శ్రీ విజ్ఞానకళా గ్రంథమాల. ౮

# మాయామేఘ

ఎనిమిదవ భాగము

కోసూరి రంగయ్యచే
రచియింపఁబడినది.



( మొదటి కూర్పు )

ప్రకాశకులు,
కోసూరి రంగయ్య అండ్ సన్సు.
శ్రీ విజ్ఞానకళా గ్రంథమండలి,
నర్సాపురం.
1935
యువనామ సంవత్సరము.
[illegible] ] [ [illegible]

# ముఖ్యమగు సవరణ.



164 వ పేజీ 19 . 22 పంక్తులలో నీరద అనుటకు బదులుగ సులోచన అని అచ్చుపడియున్నది. కావున పాఠకమహాశయులు దానిని దిద్దుకొన ప్రార్థితులు.

సంపాదకుఁడు,

కోసూరి రంగయ్య,

నర్సాపురం, పశ్చిమ గోదావరిజిల్లా.

ముద్రితము

సీతారామా ముద్రాక్షరశాల, నర్సాపురం.

# మాగ్రంథమాలను పోషించినవారు,
# పోషించుచున్నవారు



మ. రా. రా. శ్రీ శ్రీరాజా శ్రీనివాస అప్పారావు బహద్దరువారు.
కపిలేశ్వరపురం జమీందారువారు, నూజవీడు.

,, శ్రీరాజా వెల్లంకి సీతారామారావు బహద్దరువారు,
పోలిశెట్టిపాడు జమీందారువారు, తిరువూరు.

,, శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
ఉయ్యూరువగైరా యెస్టేట్లజమీందారువారు,
నూజవీడు.

,, జబ్బతుల్ యక్రాన్, శ్రీరాజా యినుగంటి రాజగోపాల వెంకటనరశింహారాయనిం బహద్దరువారు.
కిర్లంపూడి A 2, అన్నదేవరపేట, ప్రక్కిలంక వగైరా యెస్టేట్ల జమీందారువారు, శనివారపుపేట, యేలూరు తాలూకా.

,, రావుసాహేబు గుత్తా వెంకయ్య చౌదరిగారు,
భూస్వాములు, పాండురంగసినీమా మేనేజింగు ప్రొప్రియిటరు, యేలూరు.

,, యర్రమిల్లి నారాయణమూర్తిగారు, బి.ఏ.,బి.యల్.
అడ్వొకేటు, నర్సాపురం.

,, వల్లూరి వెంకట్రావుగారు, బి. ఏ., బి. యల్.,
అడ్వొకేటు, నర్సాపురం.

,, కీ॥ శే॥ శ్రీపాద రామమూర్తిగారు, బి. ఏ.,
అడ్వకేటు, నర్సాపురం.

,, గ్రంథి వెంకటరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.,
వకీలు, నర్సాపురం.

,, తులసి సుబ్బారావుగారు, ఎక్సైజు డిపార్టుమెంటు
విశాఖపట్నం.

,, గుడిమెట్ల తిరువెంగళాచార్యులుగారు, భూస్వాములు
మచ్చిపురి, నర్సాపురం తాలూకా.

,, కొవ్వర్తి రామచంద్రిరావుగారు, భూస్వాములు,
సీతారాంపురం.

,, పెన్మెత్స సోమరాజు, దాట్ల రామరాజుగార్లు,
డిస్ట్రిక్టుబోర్డు కంట్రాక్టర్లు, మిల్లుహోనర్సు,
భూస్వాములు, నరసాపురం.

,, కీ॥ శే॥ కాకర్ల సత్యబ్రిహ్మానందంగారు, భూస్వాములు,
యూనియర్బోర్డు ప్రెసిడెంటు, నరసాపురం.

,, కీ॥ శే॥ యాతం వెంకన్నగారు, తాలూకాబోర్డు మెంబరు,
భూస్వాములు, వర్తకులు, నరసాపురం.

,, కీ॥ శే॥ కోనూరి వెంకటరెడ్డిగారు, నేటివుడాక్టరు,
నరసాపురం.

,, కీ॥ శే॥ కోనూరి వెంకటలింగంగారు, ఎల్. యఫ్.
డ్రిప్టుమెస్, తాడేపల్లిగూడెం.

,, వస్తాదు వెంకటస్వామిగారు, భూస్వాములు,
నేటివ్ డాక్టరు, నరసాపురం.

,, బెజవాడ కోటిలింగంగారు, భూస్వాములు,
యేలూరు.

,, జోళ్ల సుబ్బారావుగారు, డిస్ట్రిక్టుబోర్డు వైసుప్రెసిడెం
టు టెంపిల్ కమిటీ ప్రెసిడెంటు, భూస్వాములు,
పాలకొల్లు.

,, నున్న నారాయణస్వామి చౌదరిగారు,
భూస్వాములు, రాజోలు.

మ. రా. రా. శ్రీ శింగంశెట్టి సుందరంగారు, భూస్వాములు,
నరసాపురం.

,, కీ॥ శే॥ బెజవాడ పెదరత్తయ్యగారు, భూస్వాములు,
యేలూరు.

,, జవ్వాది లక్ష్మయ్యగారు, యూనియన్‌బోర్డు ప్రెసిడెంటు, తాలూకాబోర్డు మెంబరు, డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, లేండుమార్టిగేజిబ్యాంక్ ప్రెసిడెంటు, సెకండరీ ఎడ్యుకేషనలు కౌన్సిల్ మెంబరు, భూస్వాములు, పెనుగొండ.

,, నత్తి కామిరెడ్డిగారు, రైసుమిల్లు కంట్రాక్టరు, మారుటేరు.

,, కోనూరి నారాయణస్వామిగారు, భూస్వాములు, బేంకర్లు, నరసాపురం.

,, భట్టిప్రోలు వెంకటకృష్ణారావుగారు, ఎక్సైజు సబుయినస్పెక్టరు నర్సాపురం రేంజీ, నర్సాపురం.

## స హా యు లు .



మ. రా. రా. శ్రీ ప్రయాగ సూర్యవరప్రసాదరావుగారు, భూస్వాములు, నరసాపురం.

,, డాక్టరు, కోనూరి శ్రీరామమూర్తిగారు. యల్. యం పి. తిరువూరు.

,, డాక్టరు, కోనూరి వనమరాజుగారు, యల్. యం పి. బంటుమిల్లి, బందరు తాలూకా.

,, డాక్టరు, కోనూరి ఆదినారాయణగారు, ఎల్. యం పి. నరసాపురం.

మ. రా. రా. శ్రీ మానెం వెంకటరత్నముగారు, భూస్వాములు,
నరసాపురం.

,, మానెం శేషయ్యగారు, సబుమేజిస్ట్రేటు,
రాజోలు.

,, అంబటి వెంకటస్వామిగారు, భూస్వాములు,
నరసాపురం.

,, మానెం సాంబయ్యగారు, డిస్ట్రిక్టుబోర్డు మెంబరు,
భూస్వాములు, నరసాపురం.

,, అతికారి చిన్న వెంకటస్వామిగారు, భూస్వాములు
వర్తకులు, నరసాపురం.

,, జక్కం వెంకటస్వామిగారు, భూస్వాములు
వర్తకులు, రుస్తుంబాదా.

,, మానెం కృష్ణమూర్తిగారు, భూస్వాములు,
వర్తకులు, పెనుగొండ.

,, బుడ్డిగ వెంకన్నగారు, భూస్వాములు,
వర్తకులు, నరసాపురం.

,, రవుతుల చిన్న కొండలరావుగారు, నేటివ్ డాక్టరు,
నరసాపురం.

,, కొండూరి నారాయణరావుగారు, ప్రొప్రయిటరు,
శ్రీ వేణుగోపాల రైసుమిల్లు, ఏలూరు.

,, కాకరాల సత్యన్నారాయణమూర్తిగారు,సత్యవోలు
గ్రామమున్నబు, భూస్వాములు, పెదపాడు.

,, ముల్లపూడి సత్యన్నారాయణబ్రహ్మంగారు,
భూస్వాములు, పట్లూరు.

---

# చందాదారుల కొక విజ్ఞప్తి



**మహాశయులారా!**

మన దేశమందు నెలకొని యుండిన ఆర్థిక దుస్థితిని గమనించి దాదాపు రెండువత్సరములనుండి మా గ్రంథమాల కార్యములను నిలపియుంచితిమి. సహృదయులగు మా చందాదారులలో ననేకులు మా యీయామయి మిగతభాగములను పంపుడని మాటిమాటికి వ్రాయుచుండుటచేతను, దాని భాగములను పూర్తిపఱచు బాధ్యత మాయం దుండుటచేతను మేము మరల నీ యామయి భాగములను ప్రకటించుచుంటిమి. మఱియుఁ గ్రంథము తప్పక 3 మాసముల కొకగ్రంథముచొప్పున ప్రకటించుటకుఁ దగు నేర్పాటులను గావించియున్నాము. ప్రతిగ్రంథము 250-300 పుటలకు తక్కువ గాకుండ నుండునటుల గూడ నేర్పాటు గావింపఁబడినది. కావున, చందాదారులు మున్నుపోలె గ్రంథముల నందుకొనుచు మా గ్రంథమాలాభివృద్ధికిఁ దోడ్పడఁ బ్రార్థితులు.

☞ ముఖ్యముగ గమనింపవలసిన విషయము:—

పుస్తకములను వి. పి. గా పంపుటవలన గ్రంథము 1 కి రు 0—8—0 రు 0—4—0 లు వ్యర్థముగ పోస్టుకర్చులుక్రింద అధనముగా వ్యయమగుచున్నది. కావున సంవత్సరము చందా రు 4—0—0 లు మాకు ముందుగ పంపినగాని లేక గ్రంథము వెలుపడినటుల మేము ప్రకటించిన వెంటనే ప్రతిగ్రంథమునకు రు 1—0—0 చొ॥న మణిఆర్డరుద్వారా మాకందచేసినగాని పుస్తకమును అన్‌రిజిష్టరు పార్శిలుద్వారా పంపుచుందుము.

ఇట్లు,

ప్రకాశకులు.

# మాయామహలు

## ఎనిమిదవ భాగము.

౧

మాయారాణి యాజ్ఞానుసార మాయాగంతు లిరువురను బంధించుట కేగియుండిన సైనికులు జగపతిని వెంటఁదోడ్కొని తమ నివాసమగు మొదటితరగతి కోట వైపునకు బయలుదేరిరి. కాని, వారు తమ యిచ్ఛానుసార మాస్థానమునకుఁ బోఁజాలరైరి. కారణంబేమన, నారెండవతరగతి కోటనుండి నెలుపలకుఁ బోవు మార్గ మిపుడు మాయారాణి చాతుర్యమువలన బంధింపఁబడియుండెను. అది మిగుల దృఢమైనది. దానిని దెఱచుటగాని బ్రద్దలు కొట్టుటగాని కఠినకార్యమే గాక యసంభవము ఆతిలస్మద్వార మందలి యొకటి రెండుతరగతుల మధ్య మిగులఁ బొడుగును విరివియుగల పెద్ద ప్రాకార మొకటి గలదనియు దానిపైకి వితంసమును విసరి దానితోడ్పాటున మఱియొక తరగతిలోనికిఁ బోవుట యసంభవమనియు మేము దొలుతనే లిఖించియుంటిమి. మఱియు నాప్రాకారమున కిరుపార్శ్వముల నినుపమెట్లు నిర్మింపఁబడి యుండెను. ఆమెట్లపైనుండియే యొకటి రెండుతరగతులలోని కేగవలసియుండెను. కాని, యిపుడామార్గము ను తిలస్మరీతిని మాయారాణి బంధించి యుండుటచే నాయినుపమెట్లు లాప్రకాండప్రాకారమందుఁ జొచ్చి యుండెను. తత్కారణంబున నాసైనికు లాప్రాకారముపై నెక్కఁ

జాలకుండిరి. ఆమార్గ మిప్పు బంధింపఁబడి యుండుటఁ గాంచి యది మాయారాణి కార్యాచరణమని వారు గ్రహించిరి. చండశాసనురాలగు మాయారాణి యొకగొప్ప తిలస్మమునకు రాణియనియు, నామె తలంచినఁ దమ్మా తోఁటయందు బంధించి తుదముట్టింపఁ గలదనియుఁ దోఁచుటచే వారిహృదయములు భయాతిరేకంబున దల్లడిల్లఁదొడంగెను. కాని, యాభీతి వారి మానసంబులఁ జాలసేపటివఱకు స్థిరపడియుండలేదు. కారణంబేమన, ముకుందసింహ నరపాలుఁడు వంచనవృత్తిఁ జంపఁబడెనని యాయాగంతునివలన విని యుండిన వచనములపై సైనికులకు సంపూర్ణవిశ్వాసము జనించి యుండుటచే నాశోకము గోపముగ మాఱి యాభీతిని వారిమానసములనుండి నెట్టివైచుటయే కాక, వారి హృదయభావమును బొత్తిగా మార్చివైచెను.

ఏగుప్తగవాక్షమార్గమున నాయాగంతు లిరువురు నాతోఁటయందుఁ బ్రవేశించియుండిరో యామార్గమున తోఁట వెలుపలకు వెడలిపోఁ దలంచి, జగపతిని వెంటఁదోడ్కొని యాసైనికు లచటినుండి బయలుదేరిరి. కాని, వార లాస్థానమును సమీపించి యధిక సంభ్రమాశ్చర్యచకితులయి యట్టె నిలచిపోయిరి. కారణంబేమన, నచటి గుప్తగవాక్ష మిపు డదృశ్యమై యుండెను. ఆగోడయం దొక గవాక్షచిహ్నము కొలఁదిగ గోచరించుచుండెను గాని దానిపై దట్టమగు నొక యుక్కుచిక్కము గప్పఁబడియుండినటులఁ దోఁచుచుండెను. ఇవు డాసైనికులకుఁ దోఁచిన భీతికి మేరలేదు. ఆ తోఁటనుండి వెలుపలి కేగుట కా రెండుమార్గములుదక్క వారికిఁ దెలిసియుండిన మఱియొకమార్గ మెద్దియు లేదు. నిరుపాయులయి మాయారాణి సమక్షమున కేగవలసియేయుండునని వారు మొదటఁ దలంచిరి. కాని, యామెయందలి భీతికారణమున వారికట్టి సాహసము గలుగకుండెను.

ఇపుడు తెల్లవాఱి యొకగంటకాలము గడచియుండెను. ఆ సైనికు లట్టి క్రోధావస్థయందుఁగూడ భయాశంకాసంభ్రమములను గలిగియే యుండిరి. వార లచ్చోట నిలచి, "యిపుడేమి సేయవల యు"నని తలపోయఁదొడంగిరి. ఇంతలో నొకవైపునుండి తరళ తమ దెస కేతెంచుచుండుట వారు గనుగొనిరి. కొంతసేపటి కాముగుద వారలను సమీపించి, యుచ్చైస్స్వరంబుతో, "సోదరులారా! మీరు మీప్రాణములపై నేల పగబూనుచుంటిరి? మాయారాణి యొక్క గొప్ప తిలస్మమున కధీశ్వరిణియనియు నామె తలంచిన కార్య మవలీలఁ జేయ సమర్థురాలనియు మీరలు మఱచియుంటిరా? లేక యిది మీ మూర్ఖ్యమా? మూఁడు నాలుగువేల మనుజులను దుర్భిక్షకాలములో మట్టుపెట్టఁగల మేటిదిట్టరితో వైరము దెచ్చిపెట్టుకొని వ్యర్థముగ మీ ప్రాణములను గోల్పోవుట కేల సాహసించుచుంటిరి? మీరీతోఁటయందుఁ జిక్కుపడి యాఁకలి దప్పికల మడియఁగలరని జ్ఞప్తియుంచుకొనుఁడు. నేను మీ యవివేకమునకు జాలిఁదూలి మీకు సదుపదేశ మొసంగుట కిట కేతెంచితిని. మీరా తిలస్మ మహారాణి గోపాగ్ని కింధనములుగాక తప్పియుండదలంతురేని దాని కొక్కటే మార్గము గలదు. వినుఁడు! మీరా మహారాణి సమ్ముఖమున కేగి యామె పాదములపయి నొఱగి క్షమార్పణమును వేఁడికొనుఁ"డనెను.

తరళ వచనంబుల నాలించి యాసైనికులెల్లరు దీర్ఘాలోచనయందుఁ జిక్కుకొనిరి. అంత నొకవైపునుండి యొక క్షుతము వారికి వినిపించెను. ఆతుమ్ము నాలించి యాసైనికులు వెనుకకు మరలి గాంచుటచే నకాబుపోషులను ధరించిన యాగంతు లిరువురు వారి కచటఁ బ్రత్యక్షమైరి. వారిలో నొకఁ డాసైనికులకుఁ దమయొద్దకు వెడలివచ్చుటకుఁ జేతితో సన్నఁజేయ నారంభించెను. వారిని

గాంచుటతోడనే యాసైనికుల హృదయమునందుఁ గొలఁదిగ ధైర్యము చేకూరి వారిస్థితియందుఁ గొంత పరివర్తనము జనించెను. వారిహృదయాంతరాళమున దుఃఖ భయాదిక్లేశ సంభ్రమ వలయములు మిగులఁ దేజముగఁ దిరుగనారంభించెను. అంత నాసైనికులు తరళ వచనములను బలాత్కారించుట మాని, దప్పికచేఁ దల్లడిల్లు తెగువరి, శీతలవారిపానాభిలాషను గాంచినంతనే తన ప్రాణసంరక్షచింత దానివైపున కేగులఁ బరిగినదో యీవిధంబుననే నాసైనికులాయాగంతులవైపునకుఁ బరుగిడిరి. వార లాయాగంతులను సమీపించినంతనే వారిలో నొకఁడా సైనికులఁ దెసఁ బరికించి, "సోదరులారా! మాయారాణి యీతోఁట ద్వారములను తిలస్మరీతిని బంధించి మిమ్ములను వివశులనుగ నొనరించి యుండెననియు మీరలీతోఁటనుండి వెలుపలకు వెడలిపోవుట కసాధ్యమనియుఁ దలంచి భీతిల్లకుఁడు. మేము మిమ్ముల నీతోఁటనుండి వెలుపలకు వెడలింపఁ గలము. కాని, దానికి ముందుగ మీకొక వినోదమును బ్రదర్శించుటకుఁ దలంచుచుంటిమి. మీరద్దానిని గాంచి యమితానందభరితులు గాఁగలరు. మఱియు హృద్గతమైన నిశ్చింత మీకలవడఁగలదు. ఆవినోదము మీకెల్లరకు నొక్కమాఱుగఁ జూపించుటకు వీలుచిక్కదు. కావున నైరృతదిగ్భాగమున (చేతితోఁ జూపుచు) నీగదిలోని కేతెంచి యపూర్వాద్భుతాద్వితీయాశ్చర్యజనకంబగు వినోదమును గాంచి మీజ్ఞాన చక్షువులను దెఱచి ముదమందుఁ" డనెను.

ఈసమయంబున నాయాగంతులు నిలచియుండిన స్థానమునకు వెనుక రెండుమూఁడు తరగతుల సరిహద్దు గోడ యొకటి గలదు. ఆగోడకుఁ జేరియే యొక సామాన్యమగు గదియుఁ గలదు. ఆయాగంతు లిరువు రాసైనికులతో, నవ్విధఁబునఁ దెలిపి వార

లాగదియందుఁ బ్రవేశించిరి. ఆపు డాసైనికులకుఁ గలిగియుండిన యవస్థను వర్ణింపఁ జాలవి కాను. వారిహృదయము లాయాగంతులపై నెట్టి ద్వేషభావమును బూనుట కనుజ్ఞ నిడకుండెను. మఱియు వారి యిష్టప్రకార మెచటికేగ దలంచినను, నెట్టి యడ్డంకియుఁ గలిగింపక వారిని స్వేచ్ఛగా విడచిపెట్టుటకుఁ బ్రబోధించుచుండెను.

ఆయాగంతు లాగదియందుఁ బ్రవేశించిన పిదప నాసైనికులలో మిగుల బలాఢ్యులును సాహసికులు నగు నైదుగురు సిపాయిలాగదియందుఁ బ్రవేశించిరి. మఱియుఁ గొన్నినిమిషముల కామైదుగురు నాగదినుండి యుదాసీనభావంబుతో వెలుపలకు వెడలివచ్చుటఁ గాంచి, వారి యనుచరులగు సైనికు లామైదుగురకుఁ జుట్టుముట్టి, "మీరింతలేల యుదాసీనతతోఁ జూపట్టుచుంటిరి. మీస్థితి యిటు లొక్కసారిగ మార్పునొందుటకుఁ గతంబేమి?" యని ప్రశ్నింపసాగిరి. దానికిఁ బ్రత్యుత్తరముగ నామైదుగురు సైనికులు దమ యనుచరులతో, "మీరు మమ్మేమియుఁ బ్రశ్నింప నగత్యము లేదు. మీరందఱు నైదైదుగురువంతున నాగదిలోనికిఁ బోయి యచట నేమికలదో, మీకన్నులారఁ గాంచి రండు. ఆగదియం దేమికలదో మేము వివరింపఁజాలము. కాని, దానిలోనికిఁ బోవుటవలన మీకెట్టి హానియు సంభవింపఁజాలదని మాత్రము దృఢపూర్వకముగ వచియింపగల"మని పలికిరి.

వార లట్టివిధంబున గొంత తడవువఱ కద్భుతప్రసంగములను గావించి పిదప నైదుగురు సైనికులు మరల నాగదియందుఁ జొచ్చిరి. వారలు తిరిగి వెలుపలకు వెడలివచ్చిన పిదప మొదటి యైదుగురకెట్టిస్థితి యొదవియుండెనో యట్టి స్థితియే తరువాత నాగదిలోనికిఁ బోయినవారికిని సంభవించియుండెను. తుదకచటనుండిన వారలందఱు నైదైదుగురువంతున నాగదిలోనికిఁ బోయి మరల వెలుపల

కు వెడలివచ్చిరి. ఎల్లరకు నట్టిస్థితియే యొదవియుండెను. జగపతి యాశ్చర్యకలితదృష్టి యావినోదమును బరికించుచు, నా యసలు వృత్తాంతమెట్టిదో తెలిసికొనుటకు మిక్కిలి తహతహ పడుచుండెను గాని, వాని కావిషయమెటులఁ దెలియఁగలదు? సిపాయిల విధంబున దానును నాగదిలోనికిఁ బోయి యచటివృత్తాంతము గనుగొనుట కాయాగంతులు వాని కనుమతి నొసంగరైరి తుద కాసైనికులెల్లరు నాగదియందు నొక్కవిధంబగు వినోదమునే కాంచియుండిరని, నటుల వారి సంజ్ఞాపూర్వకసంభాషణమువలన వెల్లడి యగుచుండెను. కొంతసేపటి కాయాగంతు లిరువురు నాగది వెలుపలకు వెడలి వచ్చిరి. వారిలో సామాన్యకాయుఁడగు యాగంతుఁడు సైనికులఁ గలయఁగని, "జగపతి నివుడు నాయధీన మొనరింపుఁ"డని పలికెను. వారలెట్టి యాటంకమును బలుకక జగపతిని వానియొద్దకుఁ దోడ్కొనిపోయి సవినయముగ వాని కధీనమొనరించిరి. తదనంతర మాయాగంతు లిరువురు జగపతిని వెంటఁదోడ్కొని మరల నాగదియందుఁ బ్రవేశించిరి. మఱియు నొక యరగంటకాలము గడచినపిదప నాగదినుండి వెడలివచ్చి సామాన్యకాయుఁడగు యాగంతుఁడు సైనికులతో, "జగపతిని మే మొకతావునకుఁ జేర్చి వచ్చితిమి. ఇవుడు మిమ్ములనుగూడ తోఁట వెలుపలకు వెడలించెదము రం"డని పలికెను. ఆసైనికు లెట్టియాటంకమును బలుకక రెండు మూఁడు గుంపులుగఁగూడి యాగదియందుఁ బ్రవేశించిరి. ఆయాగంతు లాగదిద్వారమును లోపలివైపుననుండి బంధించి యా సైనికులసమేతముగ నదృశ్యులయిరి.

ఈనందడిలో రెండుజాములు ప్రొద్దెక్కెను. తరళ యచటఁ గొంత దవ్వున నిలచి యావిచిత్రమును బరికించుచు, నచట నిస్తబ్ధత వ్యాపించిన పిదపఁ బరిచారికలను వెంటఁదోడ్కొని యాసమా

చారము మాయారాణి కెఱింగించుటకు మహాలువైపునకు బయలు దేరెను.

౨

మాయారాణి తరళవలన సకలవృత్తాంతముల నాలించి మిగుల నుదాసీనతయు సంభ్రమచిత్తయు నయ్యెను. ఆతోఁట ద్వారమును తిలస్మరీతిని బంధించుటవలన గలిగియుండిన యాశయు, నద్భుతమహిమోపేతమగు మచ్చుమందుపై నామెకుఁ గలిగియుండిన విశ్వాసమును బొత్తిగా నష్టప్రాయమయ్యెను. ఆమె తిలస్మాంతర్భవనములోని కేగి యాతోఁట ద్వారములను బంధించియుంచుటయుఁ దిలస్మమధమును గ్రోలుటయుఁ బూలమొక్కలపై మచ్చుమందుఁ జిలుకరించియుంచుటయు మున్నగు సకలప్రయత్నములు వ్యర్థంబులయ్యెను. మఱియు జగపతి యాయాగంతులచేతఁ జిక్కియుండుటయు, సైనికులెల్ల రాతోఁటనుండి వెడలిపోవుటయు, నాయాగంతుల కార్యాచరణముల నాలించియు నామె తన విముక్తికిఁ దగు యుక్తిని యోజింపఁజాలకుండెను. తుద కామె యన్నివిధంబుల దుఃఖితమై మరల నాతిలస్మాంతర్భవనములోని కేగెను. దానియం దొక గోడకుఁ గవాటములులేని యైదలమారులు గలవని మేము పైన లిఖించియుంటిమి. మాయారాణి రెండవయలమారు దగ్గఱకుఁబోయి దానినుండి రంగిడబ్బాల నొకటొకటిగ వెడలించి వానిమూఁతలను దెఱచి జూడసాగెను. ఆయలమారునందుఁ బరిమాణభేదములుగల డబ్బాలు విస్తారముగ గలవు. అటులఁ గొన్ని డబ్బాలను దెఱచి చూచినమీఁదట మాయారాణి మఱియొక డబ్బాను దెఱచెను. దానిపొడ వొక మూరెఁడు గలదు. ఆడబ్బాయందు గజదంతముతో నిర్మింపఁబడిన యొక యడుగు పొడుగు

గల పిస్తోలును గొన్ని యక్షుని రవ్వలును గలవు. ఇవియుఁగాక దానియం దొక తామ్రశాసనమును గలదు. తదనంతరము మాయారాణి యాడబ్బాను జేతఁ దీసికొని యచటినుండి బయలుదేరెను. మఱియు నాయంతర్భవనద్వారములను బంధించి, తనరాకకై యెదురు తెన్నులఁ జూచుచుండిన పరిచారికల సమీపమునకుఁ బోయి చేరెను. మఱియు వారియెదుట నాడబ్బాను దెఱచి, దానియందలి తామ్రశాసనమును వెడలించి చదువ నారంభించెను. మాయారాణి దానిని తుదముట్టఁ జదివిన పిదపఁ దరళవైపునకుఁ బరికించి, "నేనిపు డెట్టి యాపదయందుఁ జిక్కియుంటినో నీవు గాంచుచుంటివిగదా? అనెను

తరళ:—చిత్తము! నేనంతయు బాగుగఁ బరికించుచుంటిని. ఆయాగంతుల విషయము జ్ఞప్తికి వచ్చినమాత్రముననే నాగుండె జల్లుమనుచున్నది. ఇపు డెయ్యదియో యొక మహోపద్రవము సంభవింపనుండెననుట కెట్టి సందియమును లేదు. మఱియు నాయాగంతుల కారణంబున నీకోఁటయందలి సైనికులెల్లరు విద్రోహులయి యుండిరి.

మాయారాణి:—నిక్కువము! ఇపు డీకోఁటనుండి వెడలిన సిపాయిలు నా పౌజునందలి సిపాయిలనుగూడ నుద్రేకపూరితులనుగ నొనరింతు టొక వింతవిషయము గాదు.

తరళ:—సందేహము లేదు. మఱియు నాసిపాయిల కారణంబున బ్రజలును విద్రోహులు గాఁగలరు. ఇఁకను బ్రాణములను గాపాడుకొనుటయే దుస్తరమగును. అకటా! మీరా రెండు మర్మములను నాయెదుట దాఁచియుంచనిచో, నిట్టి కుటిల సమయంబున మీకుఁ దగుసలహా నొసంగియుందును.

మాయారాణి:—(ఆశ్చర్యముతో) ఆరహస్యము లెట్టివి?

తరళ:—అందొకటి జగిషుకి సంబంధించినది.

మాయారాణి:—మంచిది! రెండవరహస్యము?

తరళ:—(మాయారాణి చెవిదగ్గర నోరుంచి నెమ్మదిగా) జటాశంకరుని తోడ్పాటున మీరు తప్పించియుండిన ముకుంద సింహ నరపాలుని విషయము!

తరళ వచనంబుల నాలించినంతనే మాయారాణి సంభ్రమాయత్తచిత్తయై శయనస్థానమునుండి లేచి నిలచెను. మఱియుఁ దరళ చేయిఁ బట్టుకొని యొక్కవైపునకుఁ గొనిపోయి నెమ్మదిగా, "ఏమే! తరళా! ఇటుచూడుమా! నీవు నాపరిచారికలపై నధికారిణివే కావు. పసితనమునుండియు నీవు నా సహచరవు, ప్రియసఖివి. ముకుందసింహునివృత్తాంతము నీకెట్లుఁ దెల్లమయ్యెనో, దాఁచక నిజమును వక్కాణింపు"మనెను.

తరళ:—నాకైతిహాసములయందుఁ గొంత యభిరుచి గలిగియుండుట మీరెఱింగిన విషయము గాదుకదా?

మాయారాణి:—ఔను! నేను బాగుగ నెఱింగియుంటిని. కాని, నిన్నట్టి కార్యమం దెన్నఁడు నియోగించియుండలేదు.

తరళ:—ఔను. అది నా దురదృష్టము. కానిచో, నేఁటి కైయ్యారి పదవిని బడసియేయుందును.

మాయారాణి:-అగుచో, నీయైతిహాసికసంపుఁ బ్రావీణ్యమువలననే ముకుందసింహుని వృత్తాంతమును దెలిసికొని యుంటివని తోఁచుచున్నది.

తరళ:—చిత్తము. ఐతిహాసికనమువలన నావిషయ మొక్కటియే కాదు. ఇంకను ననేకరహస్యంబుల నెఱింగియుంటిని. ఆరహస్యములను మీరుగూడ నెఱుంగరు. కాని నిపుడు వెల్లడించు టంతయుచితముగ దోఁచుటలేదు. కాని, శీఘ్రకాల

ములోనే మీ కారహస్యముల నెఱింగించెదను. ఇవ్విధం బున నైన మీ ప్రాణములను సంరక్షించుకొను ప్రయత్నమం దుఁ దత్పరురాలురై యుండుటకుమాత్రము బోధించుచుం టిని. జటాశంకరుని మిత్రిత్వముపైఁ గూడ నాకు సందేహ ము జనించుచున్నది.

మాయారాణి:—జటాశంకరుఁడు నన్ను వంచించెననియే తలంచు చుంటివా?

తరళ:—ఔను. ఇంతియేకాదు. ముకుందసింహుఁడు మరణించియుం డెనను విషయమునుగూడ నేను విశ్వసింపఁజాలను.

మాయారాణి:— అగుచో, నాకథోగతి సంభవించెననియే తలంప వలసియున్నది. కాని, నీపలుకుల కెవ్వియేనియు నిదర్శన ములను జూపఁగలవా?

తరళ:—నేఁటికిగాదు. రేపటిదినమున నావిషయములను తప్పక సిద్ధాంతీకరింపఁగలను.

మాయారాణి:— కటకటా! నేనిపుడు దుర్గములోనికేగి ప్రధానా మాత్యునితో మంత్రణము గావింపఁ దలంచుచుంటిని. కాని, యిపుడు మఱియొక విధంబుగఁ గావింపవలసియున్నది.

తరళ:— (మాయారాణి చేతియందలి డబ్బావైపునకుఁ జూపి) ఈ డబ్బాను మీరేయుద్దేశ్యముతోఁ గొని తెచ్చియుంటిరో తొలుత దాని నెఱింగింపుఁడు. ఆగజదంతపు పిస్తోలు యెట్టి ది? ఆరవ్వ లెందుకుపయోగపడును?

మాయారాణి:— ఈరవ్వలు పిస్తోలునందుంచి ప్రేల్చబడును. ఎట్టి విధంబగు ధ్వనియులేక నవి యరక్రోను దవ్వువఱకు వెడ లఁగలవు. ఈరవ్వ లెవరిదేహమున కేనియు దాఁకినగాని, క్రిందఁ బడినగాని యొక గొప్ప ధ్వనితో విచ్చిపోవును.

మఱియు దానినుండి విషపూరితధూమ్రము వెడలి, నాసికా రంధ్రములనుండి మెదడునందుఁ బ్రవేశించి మానవులకు మూర్ఛ గలిగించును. ఒకమాఱుగ వేయినుంది మనుజులరుదెంచి ముట్టడించినను, వారలందఱను మూర్ఛాగతులనుగ నొనరించుట కీరవ్వలు పది పదున్నైదు చాలియున్నవి.

తరళ:-ఇదియొక యమూల్యపదార్థమనుట కెట్టిసందేహమును లేదు. మఱియు నిట్టి కోటిలనమయంబున మీకిది మిగులఁ బ్రయోజనకారి గాఁగలదు. కాని, యీడబ్బాయందుఁగల రవ్వలైదువందలకు మించియుండవని తోఁచుచున్నది. మఱియు నటుపిమ్మట వానిని నిర్మించు విధానము మీరింతకుఁ బూర్వము చదివియుండిన తామ్రశాసనముపై లిఖింపఁబడియుండెనని తలంచెదను.

మాయారాణి:—సెబాసు! నీవు మిగులఁ గుశాగ్రబుద్ధివి. ఔను! ఈతామ్రపత్రముపై నీరవ్వలను జేయువిధము లిఖింపఁబడియున్నది. ఈతిలస్మము దింకను ననేక యద్భుతపదార్థములు గలవు. కాని, తిలస్మవృత్తాంతము నాకు సంపూర్ణముగఁ దెలియకుండుటచే నిరుపాయరాలను. నేనీతిలస్మము దెంతవఱకు సంచరింపఁగలనో యచట నిట్టి సమయంబున నుపకరించు ననేక యద్భుతపదార్థములు గలవు.

తరళ:—ఇవు డాయద్భుతపదార్థములలోఁ జేఁ జిక్కినవానిని దీసికొని యిచటినుండి పారిపోవుట కియ్యదియే తరుణము. కారణంబేమన, నీతిలసోద్యానమును రాజ్యమును ముట్టడించి విధ్వంసము గావించుటకు విజయేంద్రసింహ మహీపాలుని యగణితసైన్యము జుమేలియావైపునకుఁ దరలి వచ్చుచుండెనని వినియుంటిని. మఱియు వారలు నేఁడో రేపో యిచ్చటికిఁ జేరగలరనియుఁ దలంచుచుంటిని.

మాయారాణి:—నేనుకూడ నీసమాచారమును వినియుంటిని. ముకుందసింహ జగపతుల రహస్యములు వెల్లడి గాకుండిన, వారితోఁ దలపడుటకు సంసిద్ధురాల నగుదును. కాని, యిప్పుడు నాప్రజలు నన్ననుసరింతురను నమ్మిక మినుమంతయు లేకుండెను.

తరళ:—ఆవిషయ మెట్లుండినను, మీ సేవకులలో నెవ్వరిపైనను మీరు గనుల్లఁజేసి గ్రహింపఁజాలరు. అయ్యో! యిట్టి సంభాషణమందుఁ గాలము వ్యర్థముగఁ గడచిపోవుచున్నది. మన మిప్పు డేమిసేయవలయు నెచటికిఁ బోవలయునను విషయములను నిశ్చయించుకొనుట యత్యావశ్యకము.

మాయారాణి:—నిక్కువము. కాని, యీవిపత్సమయమందు నీవు నన్నెంత దనుక ననుసరింపఁగలవో దానిని మొదటఁ దెలిసికొనవలసియున్నది.

తరళ:—నాజీవితకాలములో మీకు నాపై విశ్వాసము గలిగియుండు నంతవఱకు!

మాయారాణి:—నీప్రత్యుత్తరము సరియైనదిగాదు. కొంత వక్రముగఁ దోఁచుచున్నది.

తరళ:—మన మిచటినుండి వెడలిన పిదప మీరావిషయమును బాగుగ నాలోచించి తెలిసికొనఁగలరు.

మాయారాణి:—మంచిది. నాపరిచారికలస్థితి యెట్లున్నది?

తరళ:—మీపరిచారికలయందు నలుగురైదుగురు మాత్రము మిగుల విశ్వాసపాత్రులుగ నాదృష్టికిఁ బొడకట్టుచున్నారు. మిగత వారివిషయమును నేనేమియుఁ బలుకఁజాలను. వారి హృదయభావములను గ్రహించుటకు సాధ్యము గాకున్నది.

మాయారాణి:—(నిట్టూర్పుపుచ్చి) అకటా! నాస్థితి యింతవఱకు

వచ్చెఁగదా! నే నీయద్భుతమహిమోపేతంబగు పిస్తోలును రవ్వలను నాయొద్ద నుంచుకొనియెదను. మఱియుఁ దిలస్మములోనికేగి వచ్చినప్పుడు నెంతకుం గొనఁదగిన పదార్థము లేవిగలవో వానిని వెదకి తెచ్చెదను. తదనంతరము నిన్ను, నీకు విశ్వాసపాత్రులగు పరిచారికలను నాభవనోద్యానవని యిచటినుండి పారిపోవునటు. నేనిట్టి విపన్నావస్థయందుఁ గూడ వేలకొలఁది మనుజుల నొక్కమాటుగ శమనపురికిఁ బుత్తెంచు సామర్థ్యమును గలిగియుంటినని విశ్వసింపు" మనెను.

మాయారాణి వచనములకుఁ బ్రత్యుత్తరముగ వెనుకవైపునుండి, "నిక్కువము! నిక్కువము!! నీవు చచ్చుచుఁ జచ్చుచు వేలకొలఁది గృహములను వినాశమొనరించి పోవుదు" వని యొక ధ్వని వెడలివచ్చెను.

3

ఐయారిభాషయందు లిఖింపఁబడి యుండిన కాగితమును జదువుటచేతను, మృగాంకవతి వచియించుచుండిన ధైర్యవచనంబుల వలనను, కుమార మహేంద్రసింహునకుఁ గొంత దిటవు చేకూరి యుండెను. కాని, 'టేప' యను వానిపరిచయమును బడయుటకై యతఁడు మిగుల సంభ్రమచిత్తుఁడయి యుండెను. మఱియు వానిని గలసికొను నాశ నామందిరద్వారము నెవ్వనకుఁ గాంచుచు నచట నిలచి యుండెను. కొంతసేపటి కామందిరద్వారములను దెఱచుకొని యొకమనుజుఁడు జగపతి మణిబంధమును బట్టుకొని వెడలి వచ్చుచుండుట వారికిఁ జూపట్టెను. ఆమనుజుని మోమునపై నకాబుపోషు వ్రేలాడుచుండెను. అతఁడు కుమార మహేంద్రసింహుఁడు మున్నగు

వారలను సమీపించి తనమోముపైనుండి నకాబును దొలఁగించి వైచెను. వానిస్వరూపమును గాంచుటతోడనే కుమార మహేంద్ర సింహుఁడు సహాస్యవదనుఁడై, కొంత ముందునకేగి వానికరముఁ బట్టుకొని "ఆహా! యిచట ముకుందసింహ నరపాలునితో మాకు సమావేశము గలుగఁ గలదని యెవరి కెఱుఁగును? (మృగాంకవతి వైపునకుఁ గాంచి) తమనామమును 'తపస్' యని పెట్టుకొనిన దిట్టరి వీరే కావలయు" ననెను.

మృగాంక:—ఔను.

మహేంద్ర:—(ముకుందసింహునితో) నరేశసింహుఁ డీమందిరమందుఁ గలఁడా?

ముకుంద:—ఔను. మీ రీమందిరములోనికేగి వానితోఁ గలసికొనుఁడు.

మహేంద్ర:—మేమొక స్త్రీ యార్తనాదమును వినియుంటిమి. బహుశః యాస్త్రీయు నీమందిరముననే యుండునని తలంచెదను.

ముకుంద:-లేదు. ఆదుష్టస్త్రీ (జగపతి వైపునకుఁ జూపి) యీతఁడే! భగవంతుఁ డీదురాత్ముని నెట్లు సృజించియుండెనో తెలియదు. వీని కంఠస్వరమునువిని యితఁడొక పురుషుఁడని యెవ్వరును దలంపఁజాలరు. ఎట్టి యచ్చికమునులేక స్త్రీకంఠమువలె వినిపించును.

మృగాంక:—వీనిని మీ రెపుడు బంధించితిరి?

ముకుంద:—నిన్నటిదినమునుండి యితఁడు నాస్వాధీనమందుఁ గలఁడు. నిన్నటిదినముననే నేను వీని నీమందిరమందు బంధించి పోయితిని. నేఁడు వీనిని దీసికొనిపోవుట కిట కేతెంచియుంటిని.

మహేంద్ర:—మీరు నిన్నటిదినంబున నిచటికి కేతెంచియుండియు, నన్ను గలసికొనకూడదని శపథమును జేసికొని యుంటిరి కాంబోలు!

ముకుంద:-(నవ్వుచు) కాదుకాదు. ఆసమయము మిగుల నమూల్యమైనది. ఒక రెప్పపాటు కాలముగూడ వృథాపుచ్చుట నాకు మిక్కిలి చెడుగాఁ దోఁచుచుండెను. తత్కారణంబున మిమ్ములను గలసికొనుట కిచట నిలువఁజాలనైతిని. ఆసవిస్తర వృత్తాంతము నాలించి యమితానందభరితులగుటయే కాక యెవ్విధంబునను మీరు నగవు నాపుకొనఁజాలరు. మొదట నీమందిరములోని కేగి కుమార నరేశసింహునితోఁ గలసికొనుఁడు. తరువాత నాయపూర్వకథ నాలించెదరుగాక!

మహేంద్ర:—ఏమి! నరేశసింహుఁ డిచ్చోటునకు రాఁజాలఁడా? వానిని మీ వెంట నేల తోడ్కొని రాకైతిరి?

ముకుంద:—అతఁడు దిలస్మమందుఁ జిక్కియుండుటచే వెలుపలకు రాఁజాలఁడు. కాని, తిలస్మాములోనికి వెడలి పోఁగలఁడు. ఇపుడు దానిని ఖండించి వెలుపలకు రావలసియున్నది. మీరిపుడు వేగమె మందిరములోనికిఁ బోవుఁడు. ఆలసింపకుఁడు.

మహేంద్ర:—మంచిది! మీరు వెడలియుండిన కార్యము సిద్ధించి యుండెనా?

ముకుంద:—ఔను! బాగుగ నెరవేఱియున్నది. ఆవృత్తాంతమంత యుఁ బిదప నెఱింగించెదను.

మహేంద్ర:—జటాశంకరు నెచట విడచి వచ్చితిరి?

ముకుంద:—అతఁ డివు డేతెంచుచుండును. వాని చాకచక్యము వర్ణింప నలవికానిది. ధూర్తశిఖామణియగు నైయారుఁడు.

వాని కార్యాచరణముల నాలించుచోఁ గనుపులు విచ్చున టుల హాసింపక మానరు. కుమార నరేశసింహుఁడు తిలస్మి మందుఁ జిక్కుకొని యుండెనని దిగులొందకుఁడు. ఇపుడు మీసోదరులిరువురు నీతిలస్మమును ఖండించు నక్కఱ గలు గుచున్నది.

మహేంద్ర:—కాని, రిక్తగ్రంథమందలి సంపూర్ణవృత్తాంతములు దెలియకుండుటచేఁ దిలస్మకార్యములం దెట్టిహానియేనియుఁ గలుగుట సంభవము. దానియందలి పది పదునైదుశబ్దముల యర్థము దెలియకుండుటచేఁ బెక్కువిషయములు బాగుగ బోధపడకున్నవి.

ముకుంద:—నిక్కువము. మీకు నేనొక సూక్ష్మమార్గమును దెలి పెదను. దానివలనఁ బ్రతి తిలస్మగ్రంథమును చదివి బాగుగ గ్రహింపఁగలరు. అది యెన్ని చిక్కుపదములతోఁ గూడి యుండినను, దాని యభిప్రాయమును గుర్తించుట యం దెట్టికష్టమును గలుగఁజాలదు.

మహేంద్ర:—అది యెట్లు?

ముకుంద:—అది యొక స్వల్పవిషయము.

మహేంద్ర:—కాని, దానిని వివరించుటయందు మాత్రము వెను ముందు లాడుచుంటిరి.

ముకుందసింహ నరపాలుఁడు కుమార మహేంద్రసింహుని వైపునకు వంగి, వానిచెవిలో నేమియో వచియించెను. దాని నా లించినంతనే కుమార మహేంద్రసింహుఁడు నవ్వుచు, "నిది మిగు లఁ జాతుర్యవిషయము. కొలఁదిపాటి మార్పువలన నభిప్రాయభేద మెటులఁ గలుగుచున్నదో పరికింపుఁడు. ఇపుడు నాకు తెలియరాని పదము లేకుండునని యే తలంచెదను. ఏది యెటులుండినను, మీరీ తిలస్మమున కధీశ్వరులుగదా?" యని పలికెను.

మృగాంకవతి మిన్నకుండఁజాలక శిరమువంచి, హేళనపూర్వకంబుగ, "ఔను! వీరు తిలస్థాధీశ్వరులనుట కెట్టి సందియమును లేదు. కాని, వీరి ప్రీతినాళమునందును బక్షపాతబుద్ధి మెండుకొని యున్న" దని పలికెను. దానికిఁ బ్రత్యుత్తరముగ ముకుందసింహ నరపాలుఁ డామెతో, "కాదుకాదు. నీ విటుల దలంపవలదు. మఱియు నారహస్యమును గుమారమహేంద్రసింహునికొక్కనికే వివరించితిననియు దిగులొందకుము. (జగవతివైపునకు సంకేతించి) ఈదు రాత్మ్యని కారణంబున నటుల రహస్యముగఁ జెప్పవలసివచ్చినది. అయ్యది నీకును దెలియఁగల" దని పలికెను.

కుమార మహేంద్రసింహుఁ డొక మర్మపూరితదృష్టి మృగాంకవతిపైఁ బఱపెను. ఆమె యావిషయమును గనిపెట్టి దరహాసవదనయై యామందిరములోనికి దారిపట్టెను. రాజేశ్వరీమృగాంకవతీ మహేంద్రసింహులును, జగపతి చేయిఁ బట్టుకొని ముకుందసింహుఁడును నామందిరమందుఁ బ్రవేశించిరి.

మే మీమందిరవృత్తాంతమును బైన లిఖించియుంటిమి. కావున నిచటఁ బునరుక్తిగావించుట కెట్టి యావశ్యకమును లేదు. ముకుందసింహ నరపాలుఁడు మహేంద్రసింహుఁడు, మున్నుగు వారలను వెంటఁదోడ్కొని కుమార నరేశసింహుఁడు చిక్కియుండిన మందిరములోనికిఁ దోడ్కొనిపోయెను. కాని, దానియం దామందనముగాని, కుమార నరేశసింహుఁడుగాని చూపట్టకుండుటచే ముకుందసింహ నరపాలుఁడు మిక్కిలి యక్కజపడుచు, నాస్థానమును సమీపించి గాంచునంత నాపేటికయుండు భూభాగము లోనికి దిగిపోయి యది యొక నూయివలెఁ జూపట్టుచుండెను. ముకుందసింహ నరపాలుఁ డాశ్చర్యచకితుఁడగుచుఁ జాలసేపటివఱకు నూతిలోనికిఁ బరికించుచు మిన్నకుండుటఁ గాంచి, కుమార మహేంద్రసింహుఁడు నిలువనోపక వానితో నిటులఁ బలికెను:—

మహేంద్ర:—మీరిపుడేమి యోజించుచుంటిరి? బహుశః నరేశు
నీగదియందే మీరు విడచి వచ్చియుందురు.

ముకుంద:—ఔను. ఇపుడు బావివలె లోఁతుగఁ జూపట్టుచుండిన
యీస్థానమం దొక మందసముండెడిది. దాని పైభాగము
నఁగల యొక రంధ్రమందుఁ జేయిఁ జొనిపియే కుమార నరే
శసింహుఁడు తన్ను బంధించుకొనియుండెను. ఇపు డతఁడు
తిలస్మములోనికి వెడలియుండినటులఁ దోఁచుచున్నది. నేనీ
విషయమును దలంచియే కుమారనరేశసింహుఁడు విశ్వసించు
కొని వెలుపలకు రాఁజాలఁడనియుఁ దిలస్మములోనికిఁ బోఁ
జాలుననియుఁ దెలిపియుంటిని.

మహేంద్ర:—మంచిది! దైవయాజ్ఞ యనుల్లంఘనీయముగదా? ఈ
సంభవములన్నింటిఁ గాంచి నాబుద్ధి పెడతలఁ బట్టుచున్నది.
జగపతి నిట్టియవస్థయం దేల పరికించుచుంటిని? మీరొక్క
మాఱుగ నీతోఁటయం దేల ప్రవేశించితిరి? నాతోఁ గలసి
కొనకయే యీమందిరములోని కేల వెడలివచ్చితిరి? నరేశ
సింహుని మీరీమందిరమున విడచివచ్చుటకుఁ గతంబేమి?
వాని నాయాపదనుండి యేల తప్పింపరైతిరి? మున్నుగు ననే
క విషయములను బ్రశ్నించి తెలిసికొనుటకెంత యాతుర
ము గలిగియుండినను, ముందుగ నీబావియొక్క స్థితిని దెలి
సికొనుటకుఁ బ్రయత్నించెదను. (మృగాంకవతివైపునకుఁ
బరికించి) నీవొకమాఱు తిలస్మకైజారును నాకొసంగుము.
దానిప్రకాశమం దీనూతియం దేమికలదో పరికించెదను.

మృగాంక:—(ఉంగరముసమేతముగ కైజారు వానికొసఁగి) కైకొ
నుఁడు. దీనివలన మీకార్యము గొంత తీరగలదు.

కుమార మహేంద్రసింహుఁ డాతిలస్మకైజారుఁ జేత ధరిం
చి బావివలెఁ జూపట్టుచుండిన దాని చెంతకు బోయి నిలచెను. మఱి

యు నాతిలస్మకై జారు నాబావిలో నునిచి దానిపిడి నొక్కి ప్రకాశమును గలిగించి దానియం దేమికలదో యని పరికింపసాగెను. అతఁ డాబావియం దేమి కాంచెనో తెలియదు. అతఁ డెవ్వరితోడ నేమియుఁ బలుకకఁ దిలస్మకై జారు సమేతముగ దటాలున నాకూవ మందు దుమికెను. దానిని గాంచి రాజేశ్వరీమృగాంకవతు లిరువురు సంక్షుభితమనస్కలయిరి. ముకుందసింహ నరపాలునకును నధికాశ్చర్యముగ దోఁచెను. ముకుందసింహ నరపాలుఁడును మహేంద్రసింహునివలె తనయొద్దనుండిన తిలస్మకై జారుఁ జేతఁగొని యాబావి యొద్దునకుఁ బోయి నిలచెను. మఱియుఁ దానిపిడి నొక్కి ప్రకాశమును గలుగఁజేసి యానూతిలోనికిఁ దొంగి చూడ నారంభించెను.

మృగాంక:— దానియం దేమైనను జూపట్టుచుండెనా?

ముకుంద:—దీనియం దేమియు గోచరించుటలేదు. కుమారమహేంద్రసింహుఁ డేమి కాంచి, దీనియందు దుమికియుండెనో తెలియకున్నది.

మృగాంక:— కానిండు! మీ రచటినుండి తొలఁగి మనమిపు డేమి కావింపవలయునో యోజింపుఁడు.

ముకుంద:—రాకుమారు లిరువురు నీతిలస్మమును ఖండింతురను విషయము నాకుఁ దెలిసియుండినను వార లివ్విధంబునఁ దిలస్మమందుఁ బ్రవేశించుట సరిగాదు. భగవదేచ్ఛ యెటు లుండెనో యెవ్వ రెఱుంగుదురు. ఇపుడు రాకుమారులతో సమావేశము గలుగు నాశలేదు. మన మిచటినుండి వెడలిపోవుటయే సముచితము.

మృగాంక:—(పశ్చాత్తాపముతో) కానిండు! నడువుఁడు.

ముకుంద:—(అచటినుండి వెడలుచు) అకటా! కుమార మహేంద్రసింహునితోఁ గొన్ని ముఖ్యవిషయములను దెలుపవలసి యున్నది. కాని, ఏమిసేయగలను? నిరుపాయుఁడను.

మృగాంక:—(జగతివైపునకు సంకేతించి) వీనిని మీవెంటఁ దీసికొని సంచరించుచుంటిరా? వీని నిచటి కెందులకుఁ దోడ్కొని వచ్చితిరి?

ముకుంద:—నిన్నటిదినమున వీనిని దీనియందు బంధించి పోయితిని. ఇపుడు స్వయముగ నీమందిరమునుండి వెడలిపోఁగలఁడను భీతి నాకు లేదు. కాని, నే నీమందిరమున బ్రవేశించినంతనే నాకధికాశ్చర్యము జనించినది. ఈదురాత్ముఁ డీమందిరమునుండి వెడలిపోవు తలంపుతో మూఁడుద్వారములను దెఱచియుండెను. నాల్గవద్వారమును దెఱచుటకుఁ బ్రయత్నించుచుండిన సమయంబున నే నిటకువచ్చి చేరితిని. ఈపాపాత్మున కీమందిరద్వారములను దెఱచువిధ మెటులఁ దెల్లమయ్యెనో తెలియదు.

మృగాంక:—మీరు వీని నెవ్విధంబునఁ జే చిక్కించుకొని యుంటిరి?

ముకుంద:-మొదట నీదురాత్ముని నుచితస్థానమునకుఁ జేర్పనిమ్ము. పిదప వీని యపూర్వకథను వివరించి తెలిపెదను.

ముకుందసింహ నరపాలుఁడు జగతి చేయిఁ బట్టుకొని రాజేశ్వరీమృగాంకవతులసమేత మామందిరమునుండి వెలుపలకు వెడలిపోయెను. మఱియు దేవమందిరమువైపునకు బయలుదేరి దానికిఁ బశ్చిమదిశనుండిన మందిరముచెంతకుఁ బోయి చేరెను. "దేవమందిరమునకుఁ బడమటివైపునఁ గల మందిరద్వారమునొద్ద నొక యెముకల గుట్ట గలదనియు, దానినుండి యొక యినుపగొలుసు వెడలి దాని కెంతవకొన యామందిరసమీపమునగల కూపములోనికి వెడలియుండెననియు మేము పైన లిఖించియుంటిమి. ముకుందసింహ నరపాలుఁ డాజగతిని నీడ్చుకొని యాబావిసమీపమున కేగెను. మఱియు నాస్త్రీ వేషధారియగు నాదుష్టుని బలపూర్వకముగ నానూతి

యందుఁ బడ(ద్రో)సెను. వెంటనే యాకూపమునుండి జగపతి యఱ చుచుండిన శబ్దము వెడలివచ్చెను. కాని, రాజేశ్వరీమృగాంకవతీ ముకుందసింహులా వైపునకు దృష్టినిడక దేవమందిరములోని కేగి యచటఁ గూర్చుండి సంభాషింపఁదొడంగిరి.

మృగాంక:-(ముకుందసింహునితో) జటాశంకరుఁ డేయే కార్యముల నొనరించియుండెనో వివరింపుఁడు. నేను వానిని మీతావు నకుఁ బుత్తెంచియుంటిని. కావున, నతఁడు తన కార్యములను విశ్వాసపూర్వకముగ నొనరించియుండెనో లేదో మొదట దెలిసికొన వలసియున్నది.

ముకుంద:-నిస్సందేహముగ నతఁడు దన కార్యమును మిగుల విశ్వా సపాత్రముగ నొనరించియుండెను. జటాశంకరుఁడు దనవక్ష మున చేరి బహుమతిఁ బడయు నాపేక్ష దన కార్యములను గడు(శ్ర)ద్ధతో గావించుచుండెనను విశ్వాసము మాయారాణికి జనించునటు లతఁడు ప్రవర్తించియుండెను.

మృగాంక:—(నవ్వుచు) ఔను. అతఁడు నాకావిషయములను వివ రించియుండెను. మనవైపు సాధారణవిషయముల నున్నవి యున్నట్టు లామెకుఁ దెలిపి యతినేర్పుతో మాయారాణిని గను(భ్ర)మి యున్నాఁడు. కాని, కాశీనగరమున మీ రాతఁడు గలసికొనిన పిదప జరిగిన విషయములను (బశ్నించు చుంటిని.

ముకుంద:—అటుపిమ్మట జటాశంకరుఁడు రెండు మూఁడద్భుత కా ర్యముల నొనరించియుండెను. ఆసవిస్తరవృత్తాంతము నీకుఁ దెలిపెదను. వానిలో నొక కార్యము మిగులఁ బ్రశంసార్హ మైనది.

మృగాంక:—అదియెట్టిది?

ముకుంద:—జటాశంకరుఁడు మాయారాణితో, "నేను ముకుంద సింహుని వంచించి యధ్యక్షుని విశ్రామమందిరమందు బంధించి వచ్చితిని. కావున, నీవిపుడు నీచేతులతో వానిశిరమును ఖండించి నిశ్చింతురాలవు గ"మ్మని తెలిపెను. మాయారాణి యావచనముల నాలించినంతనే యధిక ప్రమోదభరితమానసయై బహుమానపురస్సరముగ వానికిఁ దిలస్వాధ్యక్షుని మందిరమందలి యంతర్భవనపుఁ దాళపుఁజెవి నొసంగియున్నది.

మృగాంక:—(సంతసముతో) ఏమి! అంతర్భవనపుఁ దాళపుఁజెవి జటాశంకరుని చేఁ జిక్కియుండెనా?

ముకుంద:—ఔను!

మృగాంక:—శుభము! మాయారాణియొద్దనుండి యాతాళపుఁజెవిని సంపాదించుటకు నేనాజటాశంకరునకు బోధించియుంటిని. చిది. ఇపు డాతాళపుఁజెవి యెవరియొద్దఁ గలదు?

ముకుంద:—అది నాయొద్దనే యున్నది. అతఁడు దానినొసంగునను నాకు నాశలేదు. కాని, యతఁ డెట్టియాటంకమును బలుకక దానిని నాయధీనమొనరించి యుండెను.

మృగాంక:—నీవు నన్నెటుల గౌరవదృష్టిఁ బరికించుచుంటివో, యటులనే ముకుందసింహ నరపాలునిగూడఁ జూడవలయునని వానివలన శపథమును జేయించుకొంటిని. తత్కారణంబున నతఁ డెట్టియడ్డంకియుఁ బలుకఁజాలఁడు. అతఁడు మిగులఁ గార్యవాది. విజయేంద్రసింహ మహీపాలునియెడల నతఁడనంతాపరాధమును గావించియుండెననుట కెట్టిసందియమును లేదు. మఱియు నతఁడు ప్రాణదండనమునకుఁ బాత్రుఁడై యుండెను. కాని, యతఁ డాయపరాధమును బుద్ధిపూర్వక

ముగ గావించినదికాదు. కేవల మది ప్రమాదసంజనితము. ప్రేమపిశాచ మావహించి వానివలన నట్టి కార్యమును చేయించియున్నది. వాస్తవమందు వానిస్వభావము మిగుల దొడ్డది. అనాలోచితముగఁ దనవలన దొదరియుండిన యప రాధమున కతఁడెంతయో పశ్చాత్తాపసంతప్తచిత్తుఁడగుచు న్నాఁడు. అతఁడు క్షమార్హుఁడు.

ముకుంద:—తప్పక! అతఁ డొనరించియుండిన యనేక యుపకార ముల ముం దదియొక గణనీయంబగు విషయముగాదు.

మృగాంక:-మిమ్ము తుదముట్టించువిషయములో నతఁడు మాయా రాణి నెటులఁ బ్రతారించియుండెనో, బహుమానపురస్సర ముగ నాయంతర్భవనపు తాళపుఁజెవి నెటుల సంపాదింపఁ గలిగెనో వానిని సవిస్తరముగ నెఱింగింపుఁడు.

ముకుందసింహుని విషయమున జటాశంకరుఁడు మాయా రాణి నెవ్విధంబున వంచించియుండెనో యావిషయములను మేము పై ప్రకరణమందు లిఖించియుంటిమి. అట్టివిధంబుననే ముకుందసిం హ నరపాలుఁడు తమవాక్చాతుర్యగరిమ మెఱయ మృగాంకవతికి వివరించి తెలిపెను. జటాశంకరుని విషయమున మాపాఠకమహాశ యులకుఁ గొంత శంక జనించియుండుట యబ్బురముగాదు. మఱి యు నతఁడు పూర్ణరూపంబున మాయారాణి పక్షమున జేరి యుం డెననియు భావించియుందురు. కాని, యిపు డాధూర్తుఁడు దనకార్య సంపాదనార్థమై యామె పక్షమునజేరి యన్నివిధంబుల నామెను వంచించి యుండెనని తెలిసికొనియుందురు.



౪

ఆహా! భగవంతునిమహిమ కడు విచిత్రమైనది. దుష్కృత్యముల పరిణామము దుష్టముగఁ దేలుననుట లోకవిదితమే కదా! ఎట్టి రాజాధిరాజులనేనియుఁ దృణప్రాయులనుగఁ దలంచి గర్వోద్ధతి మిడిసిపడెడు మాయారాణి, నేఁడు తనమోము సామాన్యప్రజలకు సహితము చూపుటకు సాహసింపఁజాలకున్నది. ధైర్యసాహసపరాక్రమోపేతులనియు; నైయార గురుకులభూషణులనియు, బిరుదముల నందియుండిన పురుషసింహములను సహితము, దన యసమానశౌముషీనిశేషంబున లెక్కసేయని తిలస్మమహారాణి యగు మాయారాణి, నేఁడు కొలఁది యాకులసవ్వడి చెవి సోకినంతనే భీతిల్లి మూర్ఛాగత యగుచున్నది. యౌవనమదంబున నివ్వటిల్లుచు, నహోరాత్రంబులు హాస్యకలాపంబులయందును, సుఖోపభోగంబులయందును బొద్దులు పుచ్చు భాసురాంగి మాయారాణి నేఁడు కన్నుల నీరు కాల్వలుగట్టి పాఱ దురపిల్లుచున్నది. సమస్తభాగ్యసంపదలఁ దులఁదూఁగుచు, నెండ కన్నెరుంగని సుకుమారి మాయారాణి దైవోపహతయై నేఁటి సాయంకాలసమయంబున గేవల మైదుగురు పరిచారికలతో నొక భయంకర నిర్జనారణ్యంబున దుఃఖభయసంభ్రమ సంకలితహృదయయై చెక్కిటఁ జేయిఁజేర్చి తనచేతలను దలంచి తలంచి పశ్చాత్తాపసంతప్తచిత్తయగుచుఁ గూర్చుండి యుండెను. క్రమముగ నంధకారము వృద్ధినొందుచుండిన కొలఁది యామె పరితాప మినుమడించుచుండెను. ఈసమయంబున మాయారాణి యునామె పరిచారికలునుఁ బురుషవేషమును దాల్చియుండిరి. పరిచారికలు విల్లమ్ములను ధరించి యుండిరి. మాయారాణి మొలయందుఁ దిలస్మ పిస్తోలొకటి గలదు. ఆమె సంభ్రమాయత్త చిత్తంబుతో మాటిమాటికిఁ దూర్పుదెసకుఁ బరికించుచుండుటచే నామె యెవరి

రాకనో ప్రతీక్షించుచుండినటులఁ దోఁచుచున్నది. నలుదెసల గాఢాంధకారము వ్యాపించియుండెను. కొంతవడికిఁ దూర్పుదెసనుండి యొకవ్యక్తి వెడలి వచ్చుచుండినటు లామెకుఁ దోఁచెను. మఱియుఁ గొంత సమీపించిన పిదప నావ్యక్తి పురుషవేషముతోఁ జేరిలాం తరుఁగొని యేతెంచుచుండిన తరళ యని మాయారాణి వెంటనే తెలిసికొనెను. అది తన్ను సమీపించిన తోడనే మాయారాణి మిగుల గలవరపాటుతో, "ఏమే, తరళా! నీవుపోయిన కార్యమేమై నది? వేగమె వచియింపుము! శుభమేకదా!" యని ప్రశ్నించెను.

"మనకు శుభమెక్కడిది? మనకిఁక జూమేలియా సింహాసనము దక్కుట కలలోనివార్త."

"నేనావిషయము మున్నే యెఱింగియుంటిని. నీవమాత్య శేఖరు నొద్దకుఁబోయి యుంటివా? అతఁ డేమనెను?"

"నేను వానియొద్దకుఁ బోయితిని. అసమయంబున నాయా గంతులతోఁ జేరియుండిన మనసిపాయిలలోఁ గొంద ఱచటఁగలరు. వార లాయాగంతు లిరువురి సమాచార మాయమాత్య శేఖ రునితో విన్నవించుచుండిరి. మఱియు నన్ను గాంచుటతోడనే వారు తమ సంభాషణమును గట్టిపెట్టిరి."

"తరువాత?"

"అంత నమాత్యశేఖరుఁడు నాదెసకుఁ బరికించి, "నీవిచటి కేలయరుదెంచితి"వని ప్రశ్నించెను. నేను వానిప్రశ్నమునకుఁ బ్రత్యు త్తరముగ "సచివాగణీ! మాయేలికసాని మాయారాణి మమ్ముల నవీడి యెచటికేగెనో తెలియకున్నది. మేమామెకై పలుతావుల వెదకి వేసారితిమి. ఆమెజాడ యెచటను బొడకట్టకుండుటచేఁ దల్లడి ల్లుచు తమ కీయద్భుతసమాచార మెఱింగించుట కిట కేతెంచితి" నని పలికితిని."

"అతఁ డేమనెను!"

"మంచిది. కూర్చుండుము. నేనీసిపాయిలతో సంభాషించి, పిదప నీతోఁ బ్రసంగించెద ననెను"

"నీవా సిపాయిల సంభాషణము గొంచెమైనను విని యుంటివా?"

"లేదు. వారు నాయెదుట మాట్లాడుట కిచ్ఛగింపలేదు. మఱియుఁ దరళ్ళపై మాకు విశ్వాసము లేదని యమాత్యశేఖరునితో నుడివిరి. అంతనమాత్యశేఖరుఁడు "వెలుపలకు వెడలి పొమ్మని" నన్నాజ్ఞాపించెను. నేను వ్యాపారము చెడివచ్చినదనియు, నిచటనిల చిన నన్ను వీరలు బంధింపక మానరనియు సందేహించి యచటి కావలి వాండ్రతో మంచిమాటలాడుచు నెటులనో, ఆయాపద నుండి తప్పించుకొని బయటఁ బడితిని. మఱియు నచటినుండి నెమ్మది నెమ్మదిగా జారి మైదానము వైపునకు దారిపట్టి పరు గిడితిని."

"తుదకు నాయాగంతుల సమాచారము నీకేమైనను దెల్ల మయ్యెనా? సంక్షేపముగ నెఱింగింపుము!"

"ఆయాగంతుల వృత్తాంతమిద్దియు నాకుఁ దెలియలేదు. కాని, మనము తిలస్మోద్యానమునుండి పారిపోఁ దలంచుచుండిన సమయంబున "తప్పక! తప్పక!! నీవు చచ్చుచుఁ జచ్చుచు వేల కొలఁది గృహముల నిర్మూలించి పోవుదు" వని గుప్తరీతిని పలికి యుండిన వాని జాడమాత్రము గనిపెట్టితిని."

"(సంభ్రమముతో) వాఁడెవ్వఁడు! అది నీకెటులఁ దెల్ల మయ్యెను!"

"అతఁడు జటాశంకరుఁడు. నేనటు లమాత్యశేఖరుని యింట నుండి తప్పించుకొని పారిపోవుచు నగరము వెలుపలకుఁ జేరిన పిదప

నాకస్మికముగ నన్నాతఁడు మార్గమధ్యమందుఁ గలసికొనెను. ఆతఁడునాతో, "నేనే యామాటలను పలికినవాఁడనని స్వయముగఁ జెప్పెను. మఱియు మీతోఁగూడ నివ్విధంబున దెలుపుటకు నన్నాతఁడు హెచ్చరించెను."

"ఏమి! అతఁడు నాతోఁ గొంత చెప్పుమని కూడ వచియించియుండెనా? ఏదీ! వాని సందేశమును వివరింపుము!"

"ఇపుడు నీకుఁజెడుదినములు ప్రవేశించి యున్నవనియు, నీచేఁతలకుఁ దగుప్రతిఫలము శీఘ్రకాలములోనే కుడువ వలసి యున్నదనియు నామాటలుగా మాయారాణి కెఱింగింపు మనెను. ఇంతియెకాక, నేను గోరిన పారితోషికము నొసంగుటకు మీరాణి సమ్మతించునెడల, నిట్టికుటిలసమయమందుఁ గూడ నామెకుఁదోడ్పడగలననియు వచియింపు మనెను."

("నిట్టూర్పుఁబుచ్చి) మంచిది! ఇఁక నేమైనను విశేషములు గలవా?"

"మహారాణీ! ఏమునివిన్నవింతును? మురహరిసింహుని నాయకత్వమున విజయేంద్రసింహ మహీపాలుని యిరువదివేల కాల్బలమును నశ్వదళమును జమేలియాప్రాంత భూమియందుఁజేరి యున్నవి. మన యమాత్యశేఖరుఁడు సంధి నపేక్షించుచు నొక చతురుఁడగు చారున కొకలేఖనొసంగి సేనానియగు మురహరిసింహుని యొద్దకుఁ బుత్తెంచి యుండెనఁట. ఆలేఖయందేమి లిఖింపఁబడి యుండెనో తెలియదయ్యెను గాని, దానికిఁ బ్రత్యుత్తరముగ "మేము మీరాజ్యము ముట్టడించి స్వాధీన మొనర్చుకొనుట కేతెంచి యుండలేదనియు, మాయారాణిని బంధించుకొని పోవుటకుమాత్రమే తెంచి యుంటిమనియు వ్రాసియుండెనఁట. తదనంతర మమాత్యశేఖరుఁడు మిమ్ము వెదకికొనితెచ్చుటకు నలుదెసల గూఢ చారులను బుత్తెంచియుండెననియుఁ దెలియుచున్నది."

"అగుచో, నాదురాత్మ్యుఁడమాత్యశేఖరుఁడును మనపగ తుఱతోఁ జేరియుండెననియే తలంప వలెను."

"సందేహమేమి?"

"(దీర్ఘనిశ్వాసను బరిత్యజించి) మంచిది! నీవిఁక నేమైనను వినియుంటివా?

"అన్నిటికంటె నద్భుతవిషయము వేఱొండు గలదు."

"(సంభ్రమముతో) అదియెట్టిది?"

"నేను రాత్రిసమయంబున రూపమును మాఱ్చుకొని విజయేంద్రసింహ మహీపాలుని స్కంధావారమందుఁ బ్రవేశించి, యందు సంచరించుచు, మురహరిసింహుని పటకుటీరమున కెదురుగఁ గొంతదవ్వునకుఁబోయి చేరితిని. అచట విచ్చుకత్తులను జేతఁ ధరించి, యాపటకుటీరముల జుట్టుఁ గావలి తిరుగుచుండిన సిపాయిల నడకలు కాగడాల వెలుగుతునందు నాకు బాగుగఁ జూపట్టుచుండెను. కొంతసేపటి కాపటకుటీరమునుండి యిరువురు నకాబుపోషులు వెడలి నేను నిలచియుండిన దెసకుసూటిగా బయలుదేరి వచ్చుచుండిరి. నేను వెంటనేజాగ్రత్తనొంగియచటనుండి కొంతదవ్వునకుఁ దొలఁగిపోయితిని ఎప్పుడు వారిరువురు నేను నిలచియుండిన స్థానముదాఁటి మందునకువెడలిపోయిరో యప్పుడు వారియాకారములనుబట్టి నేనువారిని గుర్తింపఁ గలిగితిని. మఱియు వారలే మన తిలస్మోద్యానమందుఁజొచ్చి జగపతిని బంధించుకొని పోయినవారలనియు నేను నిశ్చయించు కొంటిని."

"ఏమి? అటులనా?"

"ఔను."

"అకటా! ఆయాగంతు లిరువురు నెవ్వరైనదియు మన కించుకైనను తెలియకున్నది. వారు మన తిలస్మోద్యానమందలి రహస్య

ముల నెఱింగి యుండిరనుట కెట్టిసందియమును గలుగదు. ఇపు డీ సమాచారము నీవలన నాలించుటవలన వారలు తప్పక విజయేంద్ర సింహుని పక్షపాతులని నిశ్చయించుకొనకఁ దీరదు."

"నే నావిషయమును విశ్వసింపఁజాలను. కారణం బేమన, నా యాగంతులు మురహరిసింహుని సహాయమర్థించుట కచటి కేగి యుండి రేమో యెవ్వరెఱుంగుదురు!"

"అదియును సంభవమే! ఏది యెటులుండినను, నేను ముకుందసింహునికిదక్కఁ దదితరు లెవ్వరికిని భీతిల్లుదానను గాను. ప్రజలు విప్లవకారులగుదురను భీతిగాని, సైనికులు విద్రోహులగుదురను చింతగాని, అమాత్యశేఖరుఁడును దక్కుంగల యితరోద్యోగులును కృతఘ్నులయి దిరుగుబాటు చేయుదురను బెగ్గను గాని నాకు లేదు. మఱియు మృగాంకపతీ రాజేశ్వరుల విశ్వాసఘాతుకత్వమునకును వగవను. నా నేర్పు పెంపునఁ దుర్ఘటికాలములో వారి నెల్లరను వశవర్తులను గఁజేసికొను సామర్థ్యము నాకుఁ గలదు. కాని, ఆదురాత్ముఁడు ముకుందసింహుని భీతిమాత్ర మగ్గలమై నాహృదయమును గలంచి వైచుచున్నది. నీవు వచియించిన విధంబున నొక వేళ జటాశంకరుఁడు నన్ను వంచించియుండిన నది మిక్కిలి భయకారణము. ముకుందసింహుఁడు నిజముగ సజీవుఁడై యున్నచో, నన్నతఁడు చెడురీతినిఁ జిత్రవధఁ గావింపక మానఁడు. నాకుటిలవర్తనము జనసామాన్యమందు వెల్లడియగుచోఁ, దనకుఁ దలవంపులను విషయమైనను నతఁడు పాటింపఁడు. నేను వానియెడల మిక్కిలి చెడుగుగ వర్తించియుంటిని. విశ్వాసహీనయగు మృగాంకపతియు విజయేంద్రసింహుని మైయారులును వాని నేదినమున చెఱనుండివిడిపించిరో యానాఁడే నన్నతఁడు యమసదనమునకుఁ బుత్తెంపఁగలఁడు. కాని, యతఁ డటు [illegible]రింపకుండుటచే నాహృదయమందలి భీతి దినదిన

మినుమడించుచున్నది? మృత్యువుకంటె ఘోరతరమగు శిక్ష నేదియో యతఁడు నాకొఱకు శోధించియుండును. కటకటా! తిలస్మరహస్యముల నెఱుంగు దురాశ నాకేల జనింపవలెను? తత్కారణంబు ననేకదా వానినప్పుడే తుదముట్టింపక నింతకాలము దనుక బంధీకృతునిగ నొనరించియుంటిని. నే నప్పుడే వాని యుసురులను గొనియుండిన నేఁడిట్టి దుర్దిన మేల కాంచవలసివచ్చును! అయ్యారే! మృత్యువుకంటె కఠినతరమగు శిక్షను నేను గుడువవలసియున్నది. భరింపఁజాలను! భరింపఁజాలను!!" (విలపించును.)

"మహారాణీ! ఇది పొగులుటకు సమయముగాదు. ఏ వెరవునైనను ప్రాణములను గాపాడుకొనుటకుఁ బ్రయత్నింపవలెను."

("వెక్కివెక్కి యేడ్చుచు) ఏమిసేయుదును? ఎచటికేగుదును? ఎవ్వరి నాశ్రయింతును? ఇట్టి విపన్నావస్థయందు నాకుఁదోడ్పదువారెవ్వరు? అయ్యో! నేఁటిదనుక నేనెవ్వరికిట్టి యుపకారమును జేసియెరుంగనుగదా! ఏవృద్ధ్యశునితోడను సఖ్యత వహించి నాయుపకారభరము వాని శిరమున మోపియుండలేదుగదా? నాకిపుడు తోడ్పడుట కెవరికేమి యగత్యము గలదు? విజయేంద్రసింహుని పుత్రిలయెడ బూనియుండిన వైరభావమే నన్నిట్టిస్థితికి గొనితెచ్చినది.

"తిలస్మ మహారాణీ! గతమునకై యోజనయేల? ఇపుడా విషయము లన్నింటినిఁ ద్రవ్విపోసికొనుట వలనఁ బ్రయోజనమేమి? ఎట్టి విపదావస్థయందైనను నీకు నేను తోడ్పడుటకు సంసిద్ధురాలను. చింతిల్లకుఁడు. ఇపుడుకూడఁ గష్టసమయమం దుపయోగించునట్టి యద్భుత పదార్థము లనేకములు మీయొద్దఁ గలవు, ఎంతయో రత్నభాండాగారము మీయధీనమందుండుటచే ధనాభావ మెన్నఁటికినిఁ గలుగఁజాలదు. ఇఁక చింత యేటికి?"

"ఓసీ! పిచ్చిదానా! నాకుఁ జింతయేల కలుగకుండును? ఇట్టి కుటిలసమయమందుఁ దలదాఁచుకొనుటకుఁ దగినస్థానము మోహిని మందిర మొక్కటే! దానియందుఁగూడ విజయేంద్రసింహుని మైయారు లడుగిడి యున్నారు. చంద్రకళామదాలసల నామైయారులే విడిపించుకొని పోయిరని నీవేకదా నాకుఁ దెలిపియుంటివి. సులోచననుగూడ వారలే బంధించియుండవలెను. ఇపుడన్నింటి కంటె ముందుగ మనము దాఁగి యుండుటకుఁదగిన స్థానమును వెదకికొన వలయును. తదుపరి మనము గావింపఁదగు కార్యములను బర్యాలోచించుకొని నిశ్చయించుకొన దగును. అకటా! ముకుంద సింహుఁడు మరణించియుండిన నెట్టిభీతియు నాకు లేకుండెడిది.

"మహారాణీ! దాఁగియుండుటకు నేనొకస్థానమును వెదకి యుంచితిని. అది యిచటికిఁ గొంఁది దూరమున........"

తరళ యింతకంటె నధికమేమియుఁ బలుకఁ జాలదయ్యెను. కారణంబేమన, నాసమయంబుననే తమవెనుక వైపుననుండి కొందఱు మనుజులు పరుగిడివచ్చుచుండిన సవ్వడి వారికి వినిపించెను. మాటలాడునంతలో నైదుగురు ముచ్చులు, దొంగసొత్తును మోసికొని పరుగులిడుచు నెచట*మాయారాణి తనపరిచారికలతోఁగూర్చుండి సంభాషించుచుండెనో యచటికి వచ్చిచేరిరి. వారివెనుకఁ గొందఱాశ్వికులు వారిని బంధించుటకు వెంబడించి వచ్చుచుండిరి. ఆదొంగలు మాయారాణి గూర్చుండి యుండిన స్థానమున కెపుడు చేరిరో యపుడు తమ్ము వెంటాడి వచ్చుచుండిన యాశ్వికుల బారినుండి తప్పించుకొనుట కష్టసాధ్యమని తలంచి, తమయొద్దనుండిన దొంగసొత్తు నాస్థానమున బడవైచి ముందునకుఁ బారిపోయిరి. తదనంతరము కొంతసేపటి కాయాశ్వికు లాచోటునకు (మాయారాణి

---

* వారలు పురుషవేషమందు గలరు.

కూర్చుండి యుండిన స్థానమునకు) వచ్చి చేరిరి. అచటఁ గొందఱు మనుష్యులు కూర్చుండి యుండుటయు, వారిమధ్య నొకలాంతరు వెలుగుచుండుటయు దొంగసొత్తచటఁ బడియుండుటయు నాసవారులు గాంచి, వారలే దొంగలని నిశ్చయించుకొని చుట్టు ముట్టడించి నిలచిరి.

౫

అర్ధరాత్రిసమయము. శశాంకుని పరిశాంతధవళకాంతులు నలుదెసల వ్యాపించియుండెను. ఇవుడు ఋతువునందుఁ బూర్వముగఁ బరివర్తనము జనించియుండెను. రాత్రికాలమున వీఁచు చల్లని తెమ్మెరలు ప్రాణులకు మిక్కిలి ప్రియకరములై యొప్పారుచుండెను. అట్టి తరుణంబున గాశీనగరమునుండి జుమేలియాకుఁ బోవు మార్గమందిరువురు బాటసారులు వారణాశీనగరమునకుఁ బోవుచుండిరి. ఆ బాటసారు లిరువురు సామాన్యులు గారనియు, మిగుల బలపరాక్రమశాలురనియు ధనాఢ్యులనియు వారి రూపవేషములఁబట్టి వెల్లడియగుచుండెను. వారిదుస్తులు మిగుల విలువగలిగి సైనికదుస్తులవలెఁ బొడకట్టుచుండెను. వారి పదచలనమువలన వారిరువురు మిగుల ధైర్యశాలురనియు నిశ్చింతులనియుఁ దోఁచుచున్నది. కరవాల ధనుర్బాణవితంసముల నుచితస్థానంబుల నలంకరించుకొనియుండిరి. వారిరువు నెమ్మది నెమ్మదిగ నడుగులిడుచు నడచి పోవుచుండిరి. వారివెనుక మఱియిరువురు మనుజులు రెండు గుఱ్ఱముల కళీయములను జేతఁబూని నడచి పోవుచుండిరి. వారివురును గుఱ్ఱపువాండ్రు గారు.* మిగుల ధైర్యశాలురగు సిపాయిలువలెను నశ్వారోహకులుగను దోఁచుచుండిరి. ఆపథికు లిరువురటుల నడచి పోవుచు, బాటకుఁ గొలఁది దవ్వునగల నొక వృక్షసమూహముచెంతకుఁ బోయి

నిలచిరి. మఱియు వారిలో నొకఁడు గట్టిగా సీలవైచెను. ఆధ్వని నాలించినంతనే యాచెట్లచాటుననుండి పదుగురు మనుజులు వెలుపలకు వెడలివచ్చిరి. రెండవమారు సీలవైచినతోడనే యాపదుగురు మనుజులు మనబాటసారులను సమీపించి కరములను జోడించి వినయము గదుర నిలచిరి. చెడ్డీలను దొడిగి దేహమంతయుఁ దట్టమగు నల్లని వస్త్రములతోఁ గప్పుకొని యుండుటచే వారలు దోపిడిగాండ్ర వలెఁ జూపట్టుచుండిరి. వారి భుజములయందుఁ గత్తిడాలులు వ్రేలాడుచుండెను. తదనంతరము మనబాటసారులయందలి నొకఁడు వారలఁ గలయఁగని "జాడ దెల్లమయ్యెనా?" యని ప్రశ్నించెను.

చోరుఁడు:—చిత్తము. తమ యుపదేశానుసార మాయసాధ్యకార్యమునుగూడ దీర్చివచ్చితిమి.

బాటసారి:—ఆమె నెంట నెవ్వ రెవ్వరు గలరు?"

చోరుఁడు:—తరళగాక మఱియిరువురు పరిచారికలును గలరు.

బాటసారి:—మీరు వారి నేరాజ్యమునందుఁ గనుగొని యుంటిరి? మీరు కావించియుండిన కార్యము లెట్టివి!

చోరుఁడు:—ఆమె జుమేలియా రాజ్యమును విడచి కాశీనగరమందు నివసించు తలంపుతో నావైపునకు దారిపట్టి పోవుచుఁ గాశీరాజ్యపుసరిహద్దులలోని 'గంగాపుర' గ్రామపరిసరారణ్యమం దొక దినము విడిసి యుండెను. కారణంబేమనఁ దాను తనరాజ్యమును విడచివచ్చిన పిదప నచట వ్యాపించియుండిన సమాచారములను మఱికొన్ని రహస్యములను దెలిసికొనివచ్చుట కామె తరళను వెనుక విడచివచ్చెను. ఆసమయంబుననే మేము మాకార్యమును నిర్వహించుకొనుటకుఁ దగిన తరుణము చేజిక్కెను. మేము కాశీనరేశుని యధికారమందలి గంగాపురము గ్రామమందుఁ బ్రవేశించి,

దొంగసొత్తును దొంగిలించియచటి కావలివాండ్రకు మాపై
శంక జనించునటుల నచటినుండి పరుగులిడసాగితిమి. వెం
టనే దొంగలాశ్వికులు మమ్ము వెంబడించి బంధింప నేతెం
చిరి. కాని, మే మాసవ్వారులను బలుతెఱంగులఁ గనుఁ
బ్రాముచు, మాయారాణి నిలచియుండిన యడవియందుఁ
బ్రవేశించితిమి. మఱియు నామె కూర్చుండియుండిన స్థాన
మునకుఁ జేరినతోడనే, దొంగసొత్తు నచట బడవైచి మేము
పాఱిపోయితిమి. తదనంతరము గొంతసేపటికిఁ జోరాన్వేష
ణమునకు బయలుదేరిన కాశీనరేశుని యాశ్వికులు మా
యారాణి మున్నగువారలు కూర్చుండియుండిన తావునకుఁ
జేరి యచటఁ బడియుండిన చోరితపదార్థములను బరికించి
వారలే ముచ్చలని భావించి నలువైపులనుండి వారిని
ముట్టడించి నిలచిరి.

బాటసారి:-సెబాసు! మిగుల సంతోషవిషయము. మీరు మీకా
ర్య మతినేర్పుతో నిర్వహించియుంటిరి. మంచిది! తరువాత?

చోరుఁడు:—తదనంతరవృత్తాంత మేమియు మాకుఁ దెలియదు.
మీ యాజ్ఞానుసారము మిమ్ముఁ గలిసికొను సమయ మాస
న్నంబగుటచే మే మీదెసకు వెడలివచ్చితిమి.

బాటసారి:—కానిమ్ము! ఇంతియె చాలును. జామేలియా వెలుపల
గంగానదీతీరమందలి పొదలపొంత మీరొక సమయంబున
మమ్ముఁ గలసికొను నక్కఱ గలుగవచ్చును. ఇఁక మీరు
పొండు. (తన అనుచరుని వైపునకుఁ గాంచి) "మిత్రమా!
మోహనసింహా! మనవెంటఁగల యాశ్వికుల కేమియాజ్ఞ?".

మోహన:—చరువృత్తి నవలంబింపఁ గలిగినచో వీరలను గాశీనగ
రమునకుఁ బుత్తెంచుటయే శ్రేయస్కరము.

ఛాటసారి:—మనమిపుడు సాధ్యమగునంత శీఘ్రముగ మృగాంక వతినిఁ గలిసికొనుట యవసరము. జటాశంకరుఁడు నిశ్చింతుఁడని వాకొనియుండిన యామె పలుకు లబ్బురములుగావు.

అపరాక్రమశాలు లిరువురు మోహనసింహ జటాశంకరు లని మా పాఠక మహాశయులు గుర్తించి యుందురు. చోరులను, యాత్రికులను వీడ్కొల్పినపిదప మోహనసింహ జటాశంకరు లిరువురు జుమేలియా వైపునకు దారివట్టిరి. అచటికి జుమేలియా మూఁడు నాలుగు కోసులద్రవ్వ మాత్రముగలదు. తత్కారణమున గొంత సేయి యుండగనే, యేమార్గమున మృగాంకవతి, మైయాయులను రాకుమారులను వెంటఁదోడ్కొని తిలస్మోద్యానమందలి నాల్గవ తరగతి తోఁటలోనికిఁ బోయి యుండెనో, (తిలస్మాధ్యక్షుని విశ్రాంతి మందిరమునకుఁ గొలఁదిదూరమునగల)యాకొండ తిప్పయొద్దకుఁ బోయి చేరిరి. ఆకొండతిప్పపై నొకగది గలదనియు, దానియందలి వేదికపై శిలావినిర్మితంబగు శార్దూలమొకటి గూర్చుండి యుండెననియు మేము పైన లిఖించియుంటిమి. అతిన్నెయుఁ బులియు నొక విధంబగు మసాలావలన నిర్మింపఁబడి యుండెను. మోహనసింహ జటాశంకరు లిరువురు నాపులిచెంతకుఁ జేరినపిదప నచట నిలచి సంభాషింపఁ దొడంగిరి. తమవెనుకఁ గొంతదవ్వుననుండి యిరువురు యువతీమణు లేతెంచు చుండిరనియు, సీనమయంబున వార లాగది వెలుపల దాఁగి తమ సంభాషణము నాలించు చుండిరనియు వారి కినుమంతయుఁ దెలియదు. ఆయువతు లిరువురలో నొకతె మాయారాణి. రెండవది-సులోచన. మాయారాణి చౌర్యాపరాధ సందేహమునఁ గాళీనరేశుని యాత్రికులవలన ముట్టడింపఁబడి యుండె గదా? ఆమె మరల నిచటేల చూపట్టుచున్నదని మా పాఠక మహాశయులు విస్మయము నొందక మానరు. కావున, నామె వృత్తాంత మిచట గొలఁదిగ లిఖించుట సముచితముగఁ దలంచుచుంటిమి.

కాళీనరేశుని యశ్వారోహకు లెపుడు మాయారాణిని ముట్టడించి నిలచిరో, యప్పు డామె కమితభయసంభ్రమములు జనించెను. కాని, వెంటనే తన్ను దా సంబాళించుకొని యతినేర్పున దనమొలయందలి తిలస్మపిస్తోలును వెడలించి, దానియందుఁ దిలస్మసంబంధమగు రవ్వలను నింపి వృక్షశాఖములపైపునకు గుఱిపెట్టి పేల్చెను. అంత నొక గొప్ప ధ్వనితో నారవ్వలు విచ్చి యాప్రదేశమంతయు నొకవిధంబగు విషధూమముచేతను వ్యాపింపఁజేసెను. కాళీనరేశుని యాశ్వికు లావిషయముపై ధ్యాసనిడక మాయారాణిని పరిచారికలసమేతముగ బంధించుటకుఁ బ్రయత్నించుచుండిరి. మాయారాణి పిస్తోలును బ్రేల్చుటవలన వారలు క్రోధావేశులయి యామెను బాదుకలతోడను ఖడ్గతాడనములతోడను బాగుగ మర్ధించిరి. ఆవెంపరలకుఁ దాళఁజాలక మాయారాణి భూమిపైఁ గూలెను. ఆమెతోపాటు తరళయుఁ బరిచారికలును బాగుగ మోదఁబడిరి. కొన్ని నిమిషములలో నచట వ్యాపించియుండిన విషధూమ మచట నుపస్థితులయియుండిన వారినేత్రములయందుఁ బ్రవేశించి యెల్లరను మూర్ఛాగతులనుగ నొనరించెను. మూర్ఛ గలుగకుండుటకు మాయారాణి తిలస్మపురకును గ్రోలియుండుటయుఁ దరళకుఁ ద్రావించియుండుటయు మాపాఠకమహాశయులు విస్మృతిజెంది యుండరు. తత్కారణంబున మాయారాణీతరళలు మాత్రము మూర్ఛావస్థ నొందకఁ దప్పియుండిరి.

మాయారాణికిఁ దగిలియుండిన యాఘాతములవలన లేచుటకు సహిత మామెకు శక్తి గలుగకుండెను. కాని, ప్రాణభీతి నామె యెట్టెట్టులో లేచి తరళను వెంటఁదోడ్కొని యచటినుండి పారిపోవుట కుద్యమించెను. అట్టి విపత్సమయమందుఁ గూడ నీడవలెఁ దన్ను వెంబడించి వచ్చిన పరిచారికలవిషయమున, గృత

ఘ్నురాలగు మాయారాణి కిసుమంతయుఁ జింత గలుగకుండెను గాని, తరళ వెంటనే తనకక్షపాలనుండి యరకుసీసాను వెడలించి వారిమూర్ఛను బోఁదోలి తనవెంటఁ బారివచ్చుటకుద్బోధించెను.

పరిచారికలను వెంటఁదోడ్కొని మాయారాణియుఁ దరళయు నచటినుండి పారిపోయిరి. కాని, భయసంభ్రమముల కారణంబునఁ దామెచట దాఁగి ప్రాణములను గాపాడుకొనవలెనో, యావిషయమును యోజించి నిశ్చయించుకొన జాలరైరి. తుదకు వారలందఱు దిలసార్థక్షుని విశ్రాంతిమందిరమువైపునకు దారిపట్టి పరుగిడసాగిరి. భయాతిరేకంబున వారచటను నధికకాలము నిలువక నొక పగలును రేయియుఁ దమప్రయాణమును సాగించి యర్ధరాత్రము గడచిన పిదపఁ దిలసార్థక్షుని విశ్రాంతిమందిరమునొద్దకుఁ బోయి చేరిరి. సులోచన మాయారాణిని సందర్శించుతలంపుతోఁ దిలసోద్యానమువైపునకుఁ బోవుచు మార్గమధ్యమున దాకస్మికముగ మాయారాణి మున్నుగువారితోఁ గలిసికొనెను. ఆసమయంబున సులోచన మాయారాణిని గుర్తింపఁజాలదయ్యెను. కాని, మాయారాణి సులోచన గుర్తించి యామె పేరెత్తి పిలుచుచుఁ గేకలిడెను. సులోచన మాయారాణి సమీపమున కేతెంచి యామె యట్టియవస్థకుఁ బాల్పడియుండుటఁ గాంచి విషాదానలసంతప్తచిత్తయగుచు,మిగుల నబ్బురపడఁ దొడంగెను. మాయారాణి దనవృత్తాంతమంతయు సాకల్యముగ సులోచనకు వివరించి తెలిపి దురపిల్లఁదొడంగెను. సులోచనయు సానునయవాక్యంబుల నామె నోదార్చుచు,"నాకును జటాశంకరుని వర్తనమందుఁ గొంత సంశయము జనించుచున్నది. అతఁడు మనలను వంచించి యుండిన నదియొక యాశ్చర్యకరంబగు విషయముగాదు. మంచిది. భీతిల్లకుఁడు. నేను శీఘ్రకాలములోనే యారహస్యములను దెలిసికొని మీకు విన్నవింతును. మీరిపుడు కాశీ

నగరమున మోహినీమందిరమందు నివసింపుచుండెడు. నేనెట్టి నేర్పుతో జటాశంకరుని వంచించి తెచ్చెదనో పరికించెదరుగాక!......"

మాయారాణీసులోచనల సంభాషణము తుదముట్టకమున్నె యెదుటివైపుననుండి యిరువురు మనుజులేతెంచుచుండిన సవ్వడి వారికి వినిపించెను. ఆయిరువురు నితరులెవ్వరునుగారు. మన మోహనసింహ జటాశంకరులే! ఆసమయంబున నంధకారము దట్టముగ వ్యాపించియుండుటచే నాయిరువురను మాయారాణిమున్నగువారలు గుర్తింపఁజాలరైరి. మఱియు వారిని గుర్తించు నగత్యమును వారికి లేదు. కాని, క్రమముగా నాయిరువురుఁ గొండ తిప్పవైపునకు దారి పట్టుటచే మాయారాణి సంశయాకులచిత్తయగుచు, సులోచనతో, "అటుచూడుము! వారిరువురు గొండతిప్పవైపున కేగుచుండిరి. మఱియు వారు మృగాంకవతి యనుచరులువలెఁ దోఁచుచున్నారు. కారణంబేమన, నాస్థానపరిచయము లేనివారిట్టి యంధకారసమయమున నచటికిఁ బోఁజాల"రనెను.

"ఔను! ఆమనుజు లిరువురు మృగాంకవతి యనుచరులుగాని విజయేంద్రసింహుని సాహసికులగు సైయారులుగాని కావలయును. బహుశః వారలు తిలస్మోద్యానములోనికిఁ బోవు తలంపున నచటి కేగుచుండిరని తలంచెదను. తిలస్మోద్యానములోనికిఁ బోవు మార్గమీ కొండతిప్పపైనుండి కలదని మనసాధుపుంగవుని (తిలస్మోద్యతుని) వలన నాలించియుంటిని."

"నిక్కువము. అచటినుండి తిలస్మోద్యానములోనికిఁ బోవు మార్గము గలదని నేనును వినియుంటిని. కాని, యామార్గరహస్యములు నాకుఁ దెలియవు. రక్తగ్రంథము దోడ్పాటున నామార్గమును మృగాంకవతి దెలిసికొని యుండును. ఆఘాతకులు జటాశంకరసైనికుల నీపరిసాదుల కారణంబున నాగ్రంథము మృగాంకవతికిఁ జేజిక్కియున్నది."

"తప్పక! అటులనే కావచ్చును. మన మిపుడు వారి వెను వెంట నేగిన గొన్నిరహస్యములు దెలియఁగలవేమో! నడువుఁడు."

తదనంతరము మాయారాణి సులోచనమాత్రము వెంటఁ దోడ్కొని యచటినుండి బయలుదేరి డాఁగుచు దాఁగుచు నెమ్మది నెమ్మదిగా నాకొండతిప్పపైకిఁ బోయి చేరెను. మఱియు మోహన జటాశంకరు లిరువు రాగదియందుఁ బ్రవేశించిన పిదప మాయా రాణీసులోచనలు దాని వెలుపల దాఁగియుండి వారిసంభాషణము నాలించుచుండిన సమాచారమును పైన లిఖించియేయుంటిమి.

ఆగదియందలి యరుగుపైఁ గూర్చుండి యుండిన పులిసమీ పమున నిలచి మోహనసింహజటాశంకరు లిరువు రిటుల సంభాషిం పఁ దొడంగిరి.

జటాశం:—(పులితలపైఁ జేయినునిచి) తిలసోమ్నద్యానవు నాల్గ వతరగతి తోఁటయందలి దేవమందిరములోనికిఁ బోవు మార్గ మియ్యదియే!

మోహన:-ఏమి! ముకుందసింహ నరపాలునితో మనకచట సమా వేశము గలుగఁ గలదా?

జటాశం:—తప్పక! మఱియు మృగాంకవతీరాజేశ్వరులును రాకు మారు లిరువురునుగూడ నచటనే యుందురు.

మోహన:—ఈద్వారమును దెఱచు విధానము ముకుందసింహ నరపాలుఁడే మీకుఁ దెలిపియుండును.

జటాశం:-ముకుందసింహ నరపాలుఁడును మృగాంకవతియు నీద్వార మును దెఱచు విధము నాకెఱింగించియుండిరి. ఈమార్గము మిగుల సంకట సంకులము. ప్రాణాపాయకరమైనది. మం చిది. నేనిపు డీద్వారమును దెఱచెదను.

ఇవ్విధంబునఁ బలికి జటాశంకరుఁ డాతిన్నెపయిఁ గూ ర్చుండియుండిన పులి మెడమకంటిలోఁ దనవ్రేలిడి గట్టిగా లోప

లివైపునకు నొక్కెను. వెంటనే యావులి నోరు దెఱచెను. జటాశంకరుఁడు రెండవచేయి దానినోటఁ జొనిపి యొకమరనుద్రిప్పెను. అందువలన నావేదిక యెదుటిభాగము తలుపుతెక్కవలెఁ దెఱువఁబడి భూమితో నానుకొనెను. మఱియు దానిలోనికి దిగిపోవుట కొక మార్గ మేర్పడెను. మోహనసింహుఁడు మైనపువత్తిని వెలిగించుటకుఁ బ్రయత్నించెను గాని, జటాశంకరుఁడు వారించి, "నీవూరక నావెనువెంట రమ్ము. క్రిందికి దిగి పోయినపిదపఁ బ్రకాశము గలిగించుకొనవచ్చు"ననెను. ముస్ముందు జటాశంకరుఁడును వానివెనుక మోహనసింహుఁడును నచట నిర్మింపఁబడి యుండిన సోపానముల నుండి క్రిందికి దిగి పోయిరి. అచటఁ గక్ష్యాలనుండి సామానులను వెదలించి జటాశంకరుఁ డొక మైనపువత్తిని వెలిగించెను. ఆస్థానమొక గదివలె జూపట్టుచుండెను. దానికి మూఁడుతట్టుల గోడలును నాల్గవవైపున నొక సురంగమార్గమును గలవు. ఆగదికి నట్టనడుమ నొక యినుపకంబము గలదు. దాని పైభాగమునకుఁ బ్రక్కనంటుకొని యొకచక్రముండెను. జటాశంకరుఁ డాచక్రమును బట్టుకొని కొన్నిమాఱులు గిరగిరం ద్రిప్పి మోహనసింహుని వైపునకుఁ బరికించి, "ఏమార్గమున మనమిచటి కేతెంచియుంటిమో దానిని బంధించువిధాన మియ్యదియే! మఱియు (చేతితోఁజూపుచు) నీసురంగమే తిలస్మోద్యానమందలి నాల్గవతరగతి తోఁటలోనికిఁ బోవు మార్గ"మనెను.

తదనంతరము మోహనసింహ జటాశంకరు లాసురంగమందుఁ బ్రవేశించి ముందువైపునకు వెడలసాగిరి.

ఆసురంగము వెడల్పు నాలుగు మూరలకంటె నధికముగ లేదు. దానిభూమి తెలుపు నలుపు రాళ్ళతో నిర్మింపఁబడి యుండెను. అనఁగా నొకరాయి తెల్లనిది మఱియొకరాయి నల్లనిది. ఇవ్వి

ధంబుగ తెలుపు నలుపురంగు రాళ్లు వరుసగ భూమియందుఁ బాపింపఁబడియుండెను. ఆసురంగమునకు రెండు తట్టులఁగల గోడలు లోహనిర్మితములు. కొంత కొంత దూరమున నాకుడ్యములకుఁ జేరి లోహనిర్మితములగు మనుష్య విగ్రహములు తమ దీర్ఘబాహువులను జాపి నిలచియుండెను. జటాశంకరుఁడు మోహనసింహుని వైపునకుఁ గాంచి, "యీమార్గమున బ్రయాణము సాగించుటయుఁ దమ ప్రాణములకు ముప్పుదెచ్చిపెట్టుకొనుటయు నొక్కటియే. చూడుము! ఆ నల్లనిరాళ్ళపై నడుగు పడకుండ మిగుల జాగరూకతతో నావెంట రమ్ము. కానిచో, బ్రాణసంకటము గలుగకమానదు. ఎవ్వరేనియు నల్లని రాతిపైఁ బాదమిడినంతనె యీకుడ్యములకుఁ జేరి, చేయిజాచి నిలచియుండిన విగ్రహములు వారిని తమ రెండు చేతులయం దదిమిపట్టి యెవ్విధంబునను విడిపించుకొనుటకు శక్యముగాకుండునటుల బంధించివైచునని మృగాంకవతి నాకు వివరించియున్నది. అజ్ఞాతులగు ననేక మనుజు లీసురంగమందుఁ జొచ్చి తమ యసురులను బాసియుందురని తలంచెదను. తత్కారణమున మన మిరువురము వేర్వేరు మైనపువత్తులను వెలిగించుకొని యతిమెలకువతో నడచుట సముచితము.

జటాశంకరుని వచనముల నాలించి మోహనసింహుఁడు మిగుల నక్కజపడఁ దొడంగెను. తదనంతరము మోహనసింహుఁడు నొకవత్తిని వెలిగించుకొనిన పిదప నాయిరువురు నతిజాగరూకతతోఁ దెల్లని రాళ్ళపై నడుగులిడుచు నాసురంగమార్గమున ముందువైపునకు సాగిపోఁ దొడంగిరి. ఆ సురంగమంతయు నొక్కతీరుననే నిర్మింపఁబడియుండెను. దానియందలి భూమి మిగులఁ బరిశుభ్రముగనుండెను. వెలుపలి వైపుననుండి ధూళిముస్సగునవి వచ్చి దానియందుఁ బడకుండ నతినేర్పుతో నది నిర్మింపఁబడియుండెను. ఆసురంగపు

గోడలకుఁ గొన్నికొన్ని తావులయందు వెలుపలనుండి నిర్మలవాయువు లోనఁ బ్రవేశించి వెడలిపోవుచుండుటకుఁ దగిన విధంబునే విచిత్రరూపంబులగు గవాక్షము లమర్పఁబడియుండెను. తత్కారణంబున నాసురంగము విషవాయువున కాటపట్టుగాక నిర్మల వాయుప్రసారముగలదై యొప్పారుచుండెను.

మోహనసింహ జటాశంకరు లవ్విధంబున నాసురంగమందు దాదాపు రెండువందల యడుగుల దూరమేగిన పిదప నొకస్థానమందుఁ గద్యముతోఁ జేరి నిలచియుండిన మానవాకృతిఁగల లోహవిగ్రహము తన చేతులు రెండింటిని ముడుచుకొనియుండుటయు, వానియందొక యస్థిపంజరము చిక్కుయుండుటయుఁ గాంచి జటాశంకరుఁడు మోహనసింహునితో “యిటుచూడుము. ఇదియజ్ఞానవశంబునగలిగిన పరిణామము. ఈసురంగ రహస్యమెఱుంగని యేమనుజుఁడో దీనియందుఁ జొచ్చి నిష్కారణముగఁ దన ప్రాణములను గోల్పోయియున్నాఁడు. (కొంచెము యోజించి) కాదుకాదు. అతఁడు దీని రహస్యముల నెఱింగియుండినవాఁడే కావలయును. కానిచో నతఁ డింత దూరమువఱకు నిరాటంకముగ వచ్చియుండఁడుగదా? కేవలము ప్రమాదమువలననే వీనికిట్టి దుస్థితి చేకూరియుండు” నని పలికెను.

ఆయిద్దఱు లిరువురు నా కంకాళము వైపునకుఁ గాంచుచు సంభాషించుచుండిరి. అంత మోహనసింహుని చూపు వెనుక వైపునకుఁ (తాము వెడలివచ్చిన మార్గము వైపునకు) బ్రసరించుటచే నాదెసఁ గొంత ప్రకాశము గలిగియుండుటఁ గాంచి యాశ్చర్యచకితుఁడగుచు జటాశంకరుని వైపునకుఁ దిలకించి, “యిది యేమిటి? మన మేతెంచియుండిన మార్గమందుఁ బ్రకాశము చూపట్టుచున్న” దనెను.

జటా:— (తన చేతియందలి మైనపువత్తికిఁ జేయి యడ్డముగఁబెట్టి యావెలుతురు వైపునకుఁ గాంచి) ఎవ్వరో యిటు వచ్చుచున్నారు.

మోహ:—అయాగంతు లిరువురు స్త్రీలవలెఁ దోఁచుచున్నారు.

జటా:— వారిరువురు మృగాంకవతీ రాజేశ్వరులు గావలయును. ఈసురంగ రహస్యముల నెఱుంగని వారలెవ్వరును దీనిలోనికి రాఁజాలరుకదా?

మోహ:—అయిరువురు మృగాంకవతీ రాజేశ్వరులని నేను విశ్వసింపఁజాలను.

జటా:—నాకును సందేహముగనే యున్నది. నడువుఁడు. మన మా వైపున కేగి శంకానివృత్తి గావించుకొందము.

మోహనసింహ జటాశంకరు లావెలుతురు చూపట్టుచుండిన దెసకు రెండడుగులిడి యుండిరి. అంత "సరసర" మనుచు నేదియో యొకపదార్థ మెగిరివచ్చి వారి పదసమీపమున బడి యొక టపాకాయవలెఁ బెద్దధ్వనితోఁ బ్రేలెను. వెంటనే దానినుండి మూర్ఛనుగూర్చు విషధూమ్రము వెడలి నలుదెసల వ్యాపింపసాగెను. మాయారాణి తిలస్మ పిస్తోలునందు తిలస్మ సంబంధమగు రవ్వలను నింపి మోహన జటాశంకరుల వైపునకు గుఱిపెట్టి పేల్చెను. మోహనసింహ జటాశంకరులు దాము గనుగొనిన వెలుతురు వైపునకు బయలుదేరిరి. వాస్తవమం దాస్త్రీలిరువురు గది వెలుపల దాఁగి మోహనసింహ జటాశంకరుల సంభాషణము నాలించుచుండిన మాయారాణీ సులోచనలు. ఎపుడు మన మైయారు లిరువురుఁ బులి కూర్చుండియుండిన తిన్నె ద్వారమును దెఱచి లోనఁ బ్రవేశించి యచటి యినుపకంబమందలి చక్రమును ద్రిప్పి యా ద్వారమును బంధింపసాగిరో, యంతకుఁ బూర్వమే మాయారాణి

సులోచన లాద్వారమందుఁ జొచ్చి నాలుగైదు మెట్లు క్రిందికి దిగి యుండిరి. మఱియు మోహనసింహ జటాశంకరు లిరువురు దాని లోనికిఁ బోయిన పిదప సంభాషించిన విషయములనుగూడ వారు వినియుండిరి.

౬.

మనము ముకుందసింహనరపాలుని, మృగాంకవతీ రాజేశ్వరు లను దేవమందిరమందు విడచి వచ్చితిమి. ఆయువ్వురు జటాశంక రుని రాకకుఁ బ్రతీక్షించుచుఁ గూర్చుండియుండిరి. కాని యెంత సేపటికిని వాని యడపొడ దెలియకుండుటచే మృగాంకవతి నిరుపా యయై ముకుందసింహుని వైపునకుఁ గాంచి, "జటాశంకరుఁ డే కా ర్యమందోఁ జిక్కియున్నటులఁ దోఁచుచున్నది. మన మిచట వ్యర్థ ముగఁ గూర్చుండియుండుట యుచితముగాదు. మనమింక ననేక కార్యములను గావింపవలసియున్నది" యనెను.

"నేనెంత దీర్ఘముగ యోజించినను, ప్రస్తుతము నీవు గావిం పఁదగిన కార్యమెద్దియు గోచరించుటలేదు. రాకుమారు లిరువురుఁ దిలస్మమందుఁ జిక్కియున్నారుగదా! మఱియుఁ దిలస్మము ఖండింపఁ బడనిదే వారు వెలుపలకు వచ్చుట దుస్సాధ్యము. ఇఁక నాదురా త్మురాలగు మాయారాణి విషయము మాత్రము గలదు. ఆకార్య ము నేనొక్కఁడనే చూచుకొందును. తక్కంగల కార్యములన్నియు మన మైయారులు బాగుగ నిర్వహింపఁగలరు."

"అగుచో, నే నిచట నిలుచుట కెట్టి యావశ్యకము లేదని మీమాటలవలన దేలుచున్నది."

"ఔను. నా అభిప్రాయమదియే!"

"అటులయిన రాజేశ్వరిని వెంటఁదోడ్కొని *నామందిరము

* అద్భుతసరోవరమందిరము.

నకుఁ బోయెదను. అచోటనుండియే రోహిణీగడ వృత్తాంతమును గూడ నరయుచుందును."

"నీవు ముఖ్యముగ నీ నివాసమునఁ గేగవలసియున్నది. కారణంబేమన, జంద్రకళామదాలస లచటికిఁ జేర్పఁబడి యుండిరికదా! వారు నిన్నుఁ గలసికొనుటకు మిగుల సంతుష్టిగలవారై యుందురు. ఇద్దియుఁగాక కొందఱు బంధితులనుగూడ నచటికిఁ బుత్తెంచియుంటివి. వారి సమాచారములనుగూడ నీవు తెలిసికొను టత్యావశ్యకము."

"చిత్తము! మఱికొంత తడవు జటాశంకరుని రాఁకను బ్రతీక్షించెదను."

అర్ధరాత్రము గడచిన పిదప మృగాంకవతీరాజేశ్వరీముకుందసింహు లచటినుండి బయలుదేరిరి. వారలు మొదటఁ బలువిధంబులగు విగ్రహములతో నిండి యామందిరమధ్యభాగమున నొప్పుచుండిన గోళాకారస్తంభము నొద్దకుఁ బోయి నిలచిరి. ముకుందసింహ నరపాలుఁ డాస్తంభమందలి విగ్రహములలో నొకదానిపైఁ జేయి నునిచి క్రిందివైపునకు గట్టిగా నొక్కెను. వెంటనే యాగోళాకారస్తంభమందు లోనికి బ్రవేశించుట కొకచిన్న గవాక్షమేర్పడెను. ముకుందసింహ నరపాలుఁడు మృగాంకవతీరాజేశ్వరులను వెంటఁ దోడ్కొని యాగవాక్షమందుఁ జొచ్చెను. దానియందంధకారము దట్టముగ నలుముకొని యున్నను, నామువ్వురు దమ యూహనుబట్టి యచట నిర్మింపఁబడియుండిన సోపానములనుండి క్రిందికిదిగ నారంభించిరి. వారలు క్రింద నొకగదియందుఁ బ్రవేశించిన పిదప ముకుందసింహుఁ డొక మైనపువత్తిని వెలిగించి ప్రకాశమును గలిగించెను. మైనపువత్తులును వానిని వెలిగించు సామగ్రియు నాగదియందే యొక గూటియందుఁ గలవు. ముకుందసింహ నరపాలుఁ డాయంధ

కారమందు వానిని వెదకి తీసెను. ఆగది దాదాపు పదిమూరలు వెడల్పును నంతియె పొడవును గలిగియుండెను. నలువైపు గోడల యందు నాలుగుద్వారములు గలవు. ఆగది మిద్దెనుండి రెండినుప గొలుసులు వ్రేలాడుచుండెను. ముకుందసింహ నరపాలుఁ డాగొలుసులలో నొకదానిని బట్టి లాగుటవలన నాముగ్వురు నేమార్గమున నచటికి దిగివచ్చిరో యా గోళాకారపుస్తంభమందలి గవాక్షము మరల నెప్పటియటులఁ బంధింపఁబడెను. తదనంతరము ముకుందసింహ నరపాలుఁ డుత్తరపువైపు ప్రాకారమునొద్దకుఁ బోయి దానియందలి ద్వారమును దెఱచుటకుఁ బ్రయత్నింపసాగెను. ఆ ద్వారమందలి కమ్ములపై వందలకొలఁది రాగిమేకులు నాటఁబడి యుండెను. ప్రతిమేకునకు ముఖముపైఁ బరిస్ఫుటములగు నక్షరములు గలవు. ఆద్వారము తిలస్మాద్యక్షుని విశ్రామమందిరమునకు వెనుకతట్టునగల కొండతిప్పకుఁ బోవు సురంగమార్గము. ఆసురంగమార్గమునుండియే మోహన జటాశంకరులు ముకుందసింహ నరపాలుఁడు మున్నగువారిని గలసికొనుట కేతెంచుచుండుట మేము పై ప్రకరణమందు లిఖించియుంటిమి. ముకుందసింహ నరపాలుఁ డాద్వారముపై నాటియుండిన రాగిమేకుల నొక్కొక్కటిగ నొక్కనారంభించెను. మొదట నతఁడు "హ" యను యక్షరముగల మేకును నొక్కెను. అటుపిమ్మట "రి"యను యక్కరముగల మేకును తదనంతరము "ని, భ, జం, పు, ము" యను నక్షరములను క్రమముగ నొక్కెను. తోడనే యాద్వారము కొంతధ్వనితోఁ దెఱవఁబడెను. ముకుందసింహ నరపాలుఁడు మృగాంకవతీరాజేశ్వరులతో నాసురంగమందుఁ బ్రవేశించెను. మఱియు లోపలితట్టుననుండి దానికవాటములను బలపూర్వకముగ నొక్కి బంధించివైచెను. ఆద్వారమునకు లోపలితట్టునను నట్టివిధంబులగు రాగిమేకులే నాటఁబడియుండెను.

ముకుందసింహ నరపాలుఁడాసురంగమందు మృగాంకవతీరాజేశ్వరులతో నాలుగైదడుగులదూరము వెడలిన పిదపఁ దెలుపు నలుపు రాళ్ళతో నిర్మింపఁబడిన భూమి చూపట్టెను. అచటనుండియే ముకుందసింహ నరపాలుఁడు మున్నగువారలు నలుపురాళ్ళను దాఁటుచుఁ దెల్లనిరాళ్ళపై నడుగులిడుచు బయలుదేరిరి. వారలాసురంగమందు దాదాపు రెండుగంటలకాలము నడచిన పిదప నెచట మోహనసింహ జటాశంకరులు నిలచియుండిరో యాస్థానమునకుఁ బోయి చేరిరి. మాయారాణివలన బ్రయోగింపఁబడిన ద్రవ్యాలయందలి విషధూమ్రము మాస్థానమంతయు వ్యాపించియుండుటచే మోహన జటాశంకరులు దాని ప్రభావమువలన మూగాఁడు మండిన సమయంబునకు సరిగా ముకుందసింహుఁడు మున్నగువారలును నచటికి బోయి చేరిరి. మృగాంకవతీరాజేశ్వరీముకుందసింహుల కానమాచార మెటులఁ దెలియగలదు? మఱియు నాసురంగమందు మాయూరాణి ప్రవేశించి తిలస్మరద్రవ్యాలను బ్రేల్చియుండెనని వార లేమెఱుంగుదురు? తిలస్మపిస్తోలును బ్రేల్చినవెంటనే మాయారాణి తనచేతియందలి మైనపువత్తి నార్పివైచెను.

ముకుందసింహ నరపాలుఁ డచటికిఁజేరి మోహన జటాశంకరులను గాంచెను. మృగాంకవతియు జటాశంకరుని గేకలిడి పిలిచెను. కాని, యావిషధూమ్రముప్రభావము వానిపై బాగుగ వ్యాపించియుండుటచే యామె పిలుపున కతఁడేమియు బదులు పలుకఁజాలఁడయ్యెను. మఱియు వారలు చూచుచుండగనే మోహన జటాశంకరు లిరువురు మూర్ఛాగతులై భూమిపైఁ గూలిరి. క్రమముగ నచటి విషధూమ్రము మృగాంకవతీరాజేశ్వరీ ముకుందసింహుల నోటియందును నాసికారంధ్రములయందును బ్రవేశించెను గాని, వారాసంగతిని గ్రహింపఁజాలరైరి. తదనంతరము కొంతవడి కాము

వ్వరును గూడ మూర్ఛాగతులై భూమిపై నొరిగిరి.

ఒకయరగంటకాలము మిన్నకుండి తదనంతరము మాయా రాణీ సులోచనలు మైనపువత్తులను వెలిగించిరి. వారియు నమితా నందభరితలయి యావిషధూమప్రభావము దమపై వ్యాపింపకుం డుట కేదియో మందును దమనోట నుంచుకొని నెమ్మదినెమ్మదిగా తెల్లనిరాళ్ళపయి నడుగులిడుచు, మృగాంకవతీరాజేశ్వరీముకుంద మోహన జటాశంకరులు మూర్ఛాగతులయి పడియుండిన తావు నకుఁ బోయి చేరిరి.

అహో! మాయారాణి కాసమయంబున గలిగిన యానంద మునకు మేరగలిగియుండునా? ఇపుడామె యదృష్టతార భాగ్యాకా శమున నుదయించి తళుకొత్తసాగెను. ఆమె నగుమొగంబుతో సులోచనవైపునకుఁ బరికించి:—

"ఆహా! నా భాగ్యమేమని కొనియాడవలెను? నాకిపు డెవరి భీతియు లేదుగదా!"

"మీ అదృష్టము మిగుల బలవత్తరమైనది. ఇపు డీప్రపంచ మున మిమ్మెదిర్చి నిలుచువా రెవ్వరును గలుగరు. (జటాశంకరుని వైపునకుఁ గాంచి) చూడుఁడు. ఈ విశ్వాసఘాతకుని మొలయందు మృగాంకవతీప్రదత్తంబగు తిలస్మాకైజారు గలదు. ఈప్రపంచమం దు దీనికి సాటియగు మేటిపదార్థము వేఱొండు గలుగదు."

"ముకుందసింహునకుఁగూడ నొకతిలస్మాకైజారును మృగాంక వతి యొసంగియుండెనని యీదురాత్ముఁడే వచియించియున్నాఁడు. (ముకుందసింహునివైపునకుఁ గాంచి) అదిగో! వీనిమొలయందుఁ గూడ కైదువు చూపట్టుచున్నది. మృగాంకవతీరాజేశ్వరులయొద్దను గూడ యవి యుండవచ్చును. (మృగాంకవతీరాజేశ్వరీమోహనసిం హుల వైపునకు బాగుగ నిదానించి చూచి) కాదు కాదు. అట్టి

కైజారులు వీరిలో నొకరియొద్దను జూపట్టుటలేదు. మంచిది. మన శిఫు
డద్భుత మహిమోపేతములగు రెండుకైజారులు చేజిక్కినవి. ఒకటి
నాయొద్ద నుంచుకొని రెండవదాని నీకొసంగెదను. ఈకైదువులయం
దలి యద్భుతగుణవిశేషములను జటాశంకరుఁడు నాయెదుట వర్ణించి
యుండెను. జటాశంకరునికైజారును నీవు దీసికొనుము. నేను (ముకుం
దసింహుని వైపునకు వ్రేలితోఁ జూపుచు) వీనికైజారును గైకొని
యెద" ననెను.

అమితానందపారవశ్యయై మాయారాణి మొదటఁ దిలన్మ
కైజారునకు జంటయైన యుంగరమును ముకుందసింహుని వ్రేలి
నుండి వెడలించి తాను ధరించెను. పిదప వాని మొలనుండి తిలన్మ
కైజారును వెడలించి తనయధీనమందుంచుకొనెను. సులోచనయు
నవ్విధంబుననే జటాశంకరుని వ్రేలినుండలి యుంగరమును దీసికొని
తిలన్మకైజారును గైకొనెను. మాయారాణి స్మితాననయై సులోచ
నవైపునకుఁ బరికించి, "యిపుడీకైజారుతో నీయిరువురఁ నంతమొం
దించి నిరంతము నిశ్చింతురాలనై యుండెదను.

౭.

మాయారాణి యివ్విధంబున బలికి ముకుందసింహవరపా
లుని తుదముట్టించుటకుఁ గైజారుఁ బైకెత్తినతోడనే సులోచన
దటాలున నామె మణిబంధమును దృఢముగఁ బట్టుకొని, "తాళుఁ
డు! తాళుఁడు! వేగిరింపకుఁడు! వీర లిపుడు మన హస్తగతంబున
జిక్కియుండిరికదా ? ఎచటికిఁ బోఁగలరు ? ఇట్టి తరుణంబున
బాగుగ యోజించి నిశ్చయించుకొనక యేల త్వరపడుట కేమి యావ
శ్యకము! కొంతతడవు యోజించుటవలన నేదియేనియు నధిక లాభ
కరంబగు విషయము మనకు స్ఫురింపవచ్చును. వేగిరించి పిదపఁ

బశ్చాత్తాపము నొందుటకంటెc గార్యమొనరించుటకు మున్నె దాని యందలి ఫలాఫలములను జక్కగ యోజించి నిశ్చయించుకొనుట యే చతురమతుల లక్షణ” మని పలికెను. అంత మాయారాణి (చేయి క్రిందికి దించి) యామెతో:—

“నీపలుకులు యుక్తియుక్తములు. కాని, పగతురు చేc జిక్కిన వెంటనే వారిని తుదముట్టింపక నాలసించుట యుc జతురతగాదు. మాన్న నేనీ ముకుందసింహుని చెఱయందు బంధించియుంచియు వానిని హతమొనరించు నాలోచనయందే కొన్ని వత్సరములు గడపియుంటిని. తుద కావిలంబనమువలన నెట్టి ఫలితము చేకూరి యుండెనో దానిని నీవుగూడ నెఱింగియుంటివిగదా? తత్కారణం బున్ననేకదా నేడు నాకిట్టి దురవస్థ ఘటిల్లె...... (దుఃఖభరమ్మున కంఠము రుద్ధమగుటచే నాగి) నేc డాదయామయుండగు పరమేశ్వరుcడు నన్ననుగ్రహించి వంటయిలు జొచ్చిన కుందేటివలె బగతు అను నాచేcజిక్కించియున్నాcడు. ఇపుడు వీరిని యంతమొందింపక నాలసింతునేని తుదకెట్టి ఫలితము సంభవింపcగలదో యెవ్వరెఱుంగుదురు?”

“నిక్కవము మఱియు వీరిని శీఘ్రముగc దుదముట్టించుటయే నాయభిప్రాయము. ఆహా! మృగాంకవతితో పాటు ముకుందసింహుcడును మనకుc జేcజిక్కియుండుట స్వల్ప సంతోషవిషయము గాదుకదా! మఱియు వారితోపాటయిరువురు (రాజేశ్వరి మోహనసింహులు) ను జటాశంకరుcడుగూడ ... ”

“(మాటకడ్డుదగిలి) నిక్కవము. నిక్కవము. ఏదురాత్ముcడు నాయెడల విశ్వాసఘాతుక మొనరించియుండెనో యట్టి దురితాత్ముడు మన చేcజిక్కుట స్వల్పసంతోష విషయముగాదు.”

“వీరి ప్రాణములను గొనుటయం దుపేక్షింపుcడని నేను

తెలుపుటలేదు. కాని, యీసురంగ గహ్వరములను బాగుగ నెఱుం గని మన మీదుష్టులను బరిమార్చిన పిదప దీనినుండి తెలువలకు వెడలఁ జాలుదుమో లేదో యను విషయమును బాగుగ యోజిం చి నిశ్చయించుకొనువఱకుఁ దాలిమిగలిగి యుంచుటకు నూరేగను దెలుపుచుంటిని."

"ఏమి! మన మిచటినుండి వెడలిపోవుట కెట్టి యాటంకమేని యుఁ గలుగఁగలదా? వెట్టిమాట! మోహన జటాశంకరు లీసురం గద్వారమందుఁ జొచ్చి సంభాషించియుండిన మాటలను మనము వినియుండలేదా? వార లెవ్విధంబున నీసురంగ ద్వారమును బం ధించియుండిరో, యాతీరుననే మనము దానిని దెఱువఁజాలకుం దుమా?"

"నే నీప్రశ్నమునకు సరియగు ప్రత్యుత్తర మొసంగఁజాలను. కాని, మన మీవిషయమును బాగుగ యోజించి నిశ్చయించుకొను వఱకు వీరిని జీవములతో నుంచుటయే యుచితమని తెలుపుచుంటిని"

"(కొంత యోజించి కైజారును మరల నొరయందుంచి) కొంతసేపటివఱకుఁ దాళియుండుట నాకెట్టి యాటంకమును లేదు. వీరల మూర్ఛావస్థయు నంత శీఘ్రముగఁ దొలఁగిపోవునదిగాదు. నడువుము. ముందట మన మాద్వారము చెంతకుఁ బోయి దానిని దెఱవఁగలమో లేదో చూచివత్తము."

అని పలికి సులోచనను వెంటఁ దోడ్కొని మాయారాణి యాసురంగ ద్వారము వైపునకుఁ బయలుదేరెను. మఱియు జటా శంకరుఁడు దేనియందలి చక్రమును ద్రిప్పి యాసురంగద్వారమును బంధించియుండెనో యా యినుపకంబము సమీపమునకుఁ బోయి నిలచెను. తరువాత సులోచన వైపునకుఁ బరికించి, "యీచక్ర మును ద్రిప్పియేకదా, జటాశంకరుఁడు ద్వారమును బంధించియుం డె" ననెను.

"ఔను! దీని నిపుడు వెనుక వైపునకుఁ ద్రిప్పి యాద్వారము తెఱువఁబడునో లేదో మనము బరికింపవలసియున్నది."

"మంచిది! నీవే యాచక్రమును ద్రిప్పి చూడుము."

సులోచన యాచక్రమును గొన్ని మాఱులు వెనుక వైపునకుఁ ద్రిప్పెను. అదియు నది యెట్టియాటంకములేక బాగుగఁ దిరిగి యుండెను. అటుపిమ్మట నా యువతు లిరువురు తిన్నె యందలి ద్వారము తెఱువఁబడెనా లేదా యని తలపోయుచు మెట్లపై నెక్కి చూచిరి. కాని, యాద్వారమట్టులే బంధింపఁబడియుండెను. మాయారాణి మిక్కిలి యక్కజపడుచు, విభ్రాంతమనస్కయై క్రిందికి దిగి సులోచన వైపునకుఁ బరికించి, "నీయూహయే నిక్కమయ్యె" ననెను.

"నే నీవిషయమును దలంచియే యీకార్యము నాటంకపఱచితిని. ఆవేశపూరితలై యీకల్లరను జంపియుండిన మన దురవస్థకు మేరలేకుండెడిది. మనమును వీరితోపాటిచటఁ బడియుండి నడలి నడలి మృతినొందవలసివచ్చును."

"నిక్కము! నిక్కము!! (కొంత యోజించి) కానిమ్ము! ఏదెసనుండి మకరందసింహుఁ డేతెంచియుండెనో, యావైపు ద్వారమిపుడు తెఱువఁబడియుండెనేమో కనుగొనివత్తము."

"మంచిది. నడువుఁడు. మన కార్యమచటఁ దీరిన నింకఁ జింత గలుగదు. కాని, మన మచటినుండి మగుడివచ్చునంతలో వీరికి మూర్ఛ దొలఁగిపోవు టొక వింతవిషయము గాదు."

"ఔను. అటుల జరగవచ్చును. కావున, మనము వీరి కరపాదములను బంధించియుంచుటయే మేలు. బహుశః వీరికి మూర్ఛావస్థ తొలఁగినను మనకెట్టి చింతయుఁ గలుగదు."

సులోచన యచట మూర్ఛావస్థయందు మునిఁగియుండిన

వారి నెల్లరను బాగుగ నిదానించి చూడసాగెను. మోహనసింహ జటాశంకరుల కటిప్రదేశములయందు వితంనములు బంధింపఁబడి యుండెను. వానిని విప్పి మాయారాణి సులోచన లిరువురుఁ గలసి మృగాంకవతీరాజేశ్వరీజటాశంకరమోహనముకుందసింహుల కరపాదములను నిర్దయత నారతాకు రజ్జువులతో బాగుగబంధించిరి. పిదప వారిరువురు నేమార్గమున ముకుందసింహుఁడు మృగాంకవతీరాజేశ్వరులను వెంటఁ దోడ్కొని యేతెంచియుండెనో యావైపునకు దారి పట్టిరి.

మాయారాణిసులోచన యొకమైనపుగత్తిని వెలిగించుకొని దానివెలుతురునందు నల్లనిరాళ్ళను దప్పించుకొనుచు రాగిమేకులు నాటఁబడియుండిన ద్వారమునొద్దకుఁ బోయి చేరిరి. కాని, యా ద్వారరహస్య మెఱుంగని వారాద్వారమును దెఱచుట యసంభవముగదా? మాయారాణి దానిని దెఱచుటకుఁ బెక్కువిధంబులఁ బ్రయత్నించి చెక్కుచెమర్చెను. కాని, ప్రయోజనమేమియు గలుగదాయెను. ఆమె నిరుపాయయై శంకాసంభ్రమములుగూడిన చూపులతో సులోచనవైపునకుఁ బరికింపఁదొడంగెను. అంత సులోచన యామెతో నిట్లనియెను.

"నాతలంపు నిక్కువమయ్యెను. మనము వారిని చంపియుండిన తప్పక ప్రాణసంకటమందుఁ జిక్కియుందుము."

"నిక్కువము. కాని, మనమిపు డేమిసేయవలెను? నేనెంత దీర్ఘముగ నాలోచించినను నీవు నామాటలకుఁ బ్రత్యుత్తరముగ వారలమూర్ఛను బోఁద్రోలి సాధ్యమగు విధంబున నీసురంగరహస్యముల నెఱుంగుటయే శ్రేయోదాయకమని చెప్పఁదలంచినటులఁ దోఁచుచున్నది. ఏమి! యియ్యదియేకదా నీయభిప్రాయము?"

"చిత్తము. కారణంబేమన, నీయుపాయముదక్క వేఱొ

చన మెద్దియు నాబుద్ధికి తట్టుచున్నది.”

“మంచిది. అటులనే కానిమ్ము. మొదట నాయైదుగురిలో నొకరికిఁ దేకువ గలిగింపవలెను. మఱియుఁ బెక్కుభంగుల భీతిఁ గొల్పి యీసురంగద్వారమును దెఱచు విధాన మెఱుంగవలెను. అవ్విధంబున గాఁజాలినచో, మనకిఁక నేమి కావలయును? ద్వారములను దెఱచు విధానము దెలిసికొనిన పిదప నీయైదుగురను తుదముట్టించుటయే కదా నీయభిప్రాయము?”

“కాదు. మీరు జటాశంకరున కొసంగియుండిన యద్భుత మందిరపుఁ దాళపుఁజెవియు, రిక్తగంథమును మనచేఁ జిక్కువఱక వారలను జెఱయందుఁ బంధించియుంచుటయే నాయభిప్రాయము.”

“అహో! నిక్కముగ నేను వందలకొలఁది యాపదలయందుఁ జిక్కియుంటిని. ఏయుపాయాంతరమును యోజించినను దానియందన్నియు నాటంకములే పొడకట్టుచున్నవి. (కొంచెము యోజించి) అయిననేమి? ఏమి కానున్నదో జరుగక మానదుగదా? భీతియెందులకు? నేనిప్పు డెవ్విధంబునను వారలను జీవములతో విడువఁజాలను. (కొంచెమాగి) కానిమ్ము! మఱికొంతసేపు తాళెదను. వారిలో నెవ్వరికేనియుఁ దెలివి గలిగించుటకుమున్నె యందఱను బాగుగ శోధించుట మేలు. రిక్తగంథముగాని యద్భుతమందిరపుఁ దాళపుఁజెవిగాని వారిలో నెవరియొద్దనైన నుండుటొక యాశ్చర్యకరంబగు విషయముగాదు.”

సులో:—ఔను. అవి వారిలో నెవరియొద్దనైననుండుట సంభవము.

మంచిది. నడువుఁడు.

మాయారాణి సులోచనను వెంటఁదోడ్కొని ముకుందసింహుఁడు మున్నగువారలు మూర్ఛావస్థఁ బడియుండిన తావునకు మరలఁ బోయి చేరెను. ముకుందసింహజటాశంకరులయొద్ద రెండు

తిలస్నక్రైజారులు గలవనియు, వానిని మాయారాణి యధీనపఱచుకొని యొకదానిని సులోచన కొసంగి తక్కినక్రైజారును దనయొద్ద నుంచుకొనెననియు మేము పైన లిఖించియుంటిమి.

ఇప్పు డామె ముందుగ జటాశంకరుని కతుపాలను పరిశోధించుట కారంభించెను. దానియందుఁ బలువిధంబులగు మందులతోడను మోషపులతోడను నిండియుండిన మిక్కిలి సుందరములగు కొన్నిడబ్బులు మాత్రము గలవు. గాని, మాయారాణి కుపయోగించుపదార్థ మొక్కటియు దానియందుఁ జాపట్టదాయెను. మందుల యొక్కయు నోషధులయొక్కయు గుణవిశేషములును వాని నుపయోగించువిధానమును నామెకుఁ దెలియకుండుటచే నవియన్నియు నామెకు నిరుపయోగములే కదా! పిదప వాని మొలయందును చొక్కాయజేబులందును వెదకి చూచెను గాని, దానివలన నేమియుఁ బ్రయోజనము గలుగదాయెను. తుద కామె యుదాసీనతతో నచటినుండి లేచి ముకుందసింహ నరపాలుని సమీపమున కేగి వానినిఁ బరిశోధింప నారంభించెను.

జటాశంకరునకు మాయారాణి యద్భుతమందిరపుఁ దాళపుఁజెవి నిచ్చుటయు నతఁ డద్దానిని ముకుందసింహ నరపాలుని కొసంగియుండుటయు పాఠకమహాశయులు విస్మృతిజెందియుండరు. ఈసమయంబున నా తాళపుఁజెవి వానియొద్దనే కలదు. వానిని శోధించు సమయమున నా తాళపుఁజెవి మాయారాణికి జేఁజిక్కుటచే సమితానందభరితయై సులోచనదెసఁ బరికించి:—

"చూడుము! అద్భుతమందిరపుఁ దాళపుఁజెవి నాచేఁ జిక్కనది. నా సైనికులకు నాయెడలఁ దిరస్కారభావము గలిగియుండినను, నమాత్యశేఖరుఁడు నాపైఁ బగఁబూనియున్నను నాకిపు డెట్టిభీతియుఁ గలుగదు. కాశీనగరమందలి మోహినిమందిరమందుఁ దలదాఁచు

కొందమన్నను నచటి రహస్యములన్నియు విజయేంద్రిహుని నై యారు లెత్తింగియేయున్నారు. నేను వసించుటకు నిరపాయకరంబగు స్థాన మెద్దియు గోచరింపకుండుటచే నామానసము మిగులఁ దల్ల డిల్లుచున్నది. కాని, యిప్పుడీ తాళపుఁజెవి చేఁజిక్కుటవలన గొలఁది గొప్ప ధైర్యము చేకూరుచున్నది. నేనిపు డతిముదంబునఁ దిలస్మా ధ్యక్షుని విశ్రామమందిరమందు నివసించుచుఁ బగతుఱనుండి నా వైరమును దీర్చికొనియెదను. మఱియు నాసైనికుల మానసంబుల నెలకొని యుండిన శంకను బాఱఁద్రోలి నాప్రభావము వారిపై విస్త రింపఁజేసి వారిని నాయధీనములోనికిఁ దెచ్చుకొనియెదను. ఇఁక నా దురాత్ముఁ డమాత్యశేఖరుని యంత మొందించుటొక లెక్కయా? తిలస్మాకైజారు తోడ్పాటున ననేక యసాధ్యకార్యములను సహిత మవలీల నిర్వహింపఁగలను.”

“నిక్కువము. రిక్తగంథముగూడ వీరిలో నెవరియొద్దనైన నుండవచ్చును. వెదకి చూడుఁడు.”

మాయారాణి మరల శోధించుటకు నారంభించెను. ముకుంద సింహుని శోధించిన పిదప మృగాంకవతీరాజేశ్వరీమోహనసింహు లనుగూడఁ బరిశోధించెను. కాని, రిక్తగంథము (రక్తముతో వ్రాయ బడిన గ్రంథము) జాడ యిసుమంతయుఁ దెలియదాయెను. మఱి యు నామె కుపయోగపడు నేవదార్థమును వారియొద్ద జూపట్టఁ దయ్యెను. తుదకు మాయారాణి నిరుపాయయై జటాశంకరునకుఁ దేఁకువగలిగించి వానికిఁ బెక్కువిధంబులగు నా..ఁ గొల్పియు భీతిగలి గించియు నాసురంగద్వారములను దెఱచు విధా.మును దెలిసికొ నుటకు నిశ్చయించుకొనెను. మాయారాణి యాజ్ఞానుసారము సులో చన దనకత్తుపాలనుండి చురకుసీసాను వెడలించి జటాశంకరునకు వాసన జూపించు తలంపుతో వాని సమీపమునకుఁ బోయెను. అంత

నాసురంగ ముఖద్వారమునొద్ద (ఏవైపుననుండి మోహన జటాశం కరుల వెనువెంట మాయారాణీ సులోచనలు వెడలివచ్చిరో యా వైపున) గొంతపరికాళ మామెకుఁ జూపట్టెను. వెంటనే సులోచన జటాశంకరునకు వాసనజూపించుటకుఁ జాపిన తనచేయిని వెనుక కు మరల్చి యరకుసీసాను భూమిపై నిడి యొరనుండి కైజారును దూసి చేత ధరించెను. మఱియుఁ మైనపువత్తిని జల్లార్చి మాయా రాణితో, "మహారాణీ! నేను వత్తి నార్పివైచి చీఁకటి గలిగించి తినిగదా? మీరు యిటునటుఁ గదలకుఁడు. నల్లనిరాళ్ళపై నడుగు బడకుండ జాగ్రత్త గలిగియుండుఁడు. మీరును మీకైజారు చేత ధరించి యప్రమత్తలై యుండుఁడు. ఆయాగంతుఁడు మనకుశత్రువగు విజయేంద్రసింహుని మైయారులలో నొకఁడై యుండు" ననెను.

"(తిలస్మకైజారు పిడిపైఁ జేయునునిచి) సులోచనా! నీవు మైనపువత్తి నార్పివైచినను ఆయాగంతుని దృష్టి తోలంతనే యిచ టి ప్రకాశముపైఁ బడియుండును. (నిదానించి చూచి) అతఁడు మన తిలస్మాధ్యక్షుఁడగు సాధుపుంగవునివలెఁ జూపట్టుచున్నాఁడు."

"నాకు నటులనే తోఁచుచున్నది. (కొంచె మాగి) అతఁడు ముందున కేతెంచుచుండిన కొలఁది వాని గడ్డమును శిరమునందలి జటలును యెంతస్పష్టముగఁ జూపట్టుచున్నవో చూడుఁడు. నిస్సందే హముగ నతఁడు మన తిలస్మాధ్యక్షుఁడే! వేఱెవ్వరునుగారు. విజ యేంద్రసింహుని బందిగమునుండి యతఁ డెటులఁ దప్పించుకొని వచ్చెనో తెలియదు. అతఁ డిప్పు డిచటి కేతెంచుట మిగుల మేల య్యెను."

"అతఁడు చెఱనుండి తప్పించుకొని వచ్చుటచే నాకు మిక్కిలి పంతసము జనించుచున్నది. కాని, యీసమయంబున నతఁ డిచటి కేతెంచుట సరిగాదు. కారణంబేమన, నేను ముకుందసింహుని

విషయమున బ్రిజల నెట్టివిధంబున వంచించియుంటినో యాసమా చార మతఁ డెఱుంగఁడు. తత్కారణంబున ముకుందసింహుని యి చటఁ గాంచుటతోఁడనే యతఁ డావేశపూరితుఁ డగుటొక వింతసం గతి కాదు. మఱియు నాతోఁ దగవులకుఁ గాలుద్రువ్వెను. అతఁడు మిక్కిలి ప్రిభుభక్తి గలవాఁడు. తన భూపాలునిపై వాని కమితవా త్సల్యవిశ్వాసములు గలవు. అకటా! అతఁ డీసమయమున నిచటి కేల యేతెంచవలెను? వానిరాక మనకుఁ జెఱువు గలిగించునదే యగును. కానిమ్మా! నీవు మాత్రిము జాగరూకతగలిగియుండుము. ఈ తిలస్మకై జారు గుణవిశేషమును వానికిఁ దెలుపరాదుసుమా! మఱియు ముకుందసింహుని విషయమునగూడ ......... ”

“మంచిది. నేనేమియుఁ దెలుపకుందును. అటుఁ జూడుఁడు. సందేహమేమి? అతఁడు తప్పక మన తిలస్మాధ్యక్షుఁడే! మన మిపుడు ప్రకాశము గలిగించుకొనుట కాటంకమేమి గలదు?”

“ఎట్టి యభ్యంతరమును లేదు.”

పైన లిఖించిన సంగతుల నన్నింటిని మాయారాణి సులో చన లతిచురుకుగను నెమ్మదిగను సంభాషించియుండిరి. సులోచన మైనపువత్తి నొకదానిని వెలిగించెను. పిదప నాయిరువు రధ్యక్షుని గలసికొను తలంపుతో వానివైపునకు దారిపట్టిరి. అధ్యక్షుఁడు మా యారాణి సులోచనలను గాంచి వెంటనే గుర్తించెను. మాయారా ణిని సమీపించినతోడనే యతఁడు నవ్వుచు, “నేను విజయేంద్రిసిం హుని కారాగృహమునుండి తప్పించుకొని వచ్చుటయు మిమ్మిచటఁ గుశలపూర్వకముగఁ గనుగొనుటయు నా కమితానందమును గలి గించుచున్నవి. మఱియుఁ దదర్థమై యప్పరమేశ్వరున కనేక ధన్య వాదములను గావించుచుంటి” ననెను.

**మాయా:—(కృత్రిమహాస్య మొనరించుచు) మీరు బంధవిమో**

చనులయి యేతెంచుటచే నాకుఁ గలిగిన యానందమునకు మేరలేదు. నే నిచటఁ గొన్ని దినంబులనుండి యనేక యాపదలయందుఁ జిక్కియుంటిని. వానినుండి విముక్తిఁ బడయు నాశ యెద్దియు నాకుఁ గలుగకుండెను. ఈయిక్కట్టు లన్నియు మీరిచట లేకుండుటవలననే కదా సంభవించి యున్నవి.

అర్థ:—ఔను. నే నాసమాచారములు చాలవఱకు వినియుంటిని. నేను మొదట నావిశ్రామ మందిరమునొద్దకుఁ బోయి చేరితిని. అచటఁ దరళను మఱికొందఱు పరిచారికలను గాంచియుంటిని. నే నాసమాచారము లన్నింటిని తరళ వలననే వినియుంటిని. మఱియుఁ గొండతిప్పనైపున కిరువురు సును జులు పోవుచుండుటఁ గాంచి, మీరిరువురును వారిని వెంబడించి వెడలియుంటిరని తరళ వచియించుటచే నే నీవైపున కేతెంచితిని. కానిచో, నాకిట కేతెంచు యావశ్యక మేమి గలదు?

మాయా:—ఔను! నేను విజయేంద్రసింహుని మైసూరులసు మోహన జటాశంకరుల వెనువెంట నిచటి కేతెంచియుంటిని. ఈసురంగ రహస్యములు నాకావంతయుఁ దెలియవు. మీరును నేటిదనుక నీసురంగ రహస్యములను నాకుఁ జెప్పియుండలేదు. జటాశంకరుఁ డీసురంగద్వారమును దెఱచెను. మేము వారి కంటఁబడకుండఁగ దాఁగుచు నిచటికి వచ్చి చేరితిమి. కాని, యిచటినుండి యెవ్విధంబునను వెలువలకు వెడలఁ జాలకుంటిమి. జటాశంకరుఁ డీసురంగమాదుఁ బ్రవేశించి మరల నాద్వారమును బంధించియున్నాఁడు. మే మాద్వారమును దెఱచుట కెంత ప్రయత్నించినను ప్రయోజనము

గలుగకుండుటచే నిరుపాయలమై తల్లడిల్లుచుంటిమి. ఈసమ
యంబున మిమ్మిటకుఁ జేర్చి యాపరమేశ్వరుఁడు నన్ను మి
క్కిలి యనుగ్రహించియున్నాఁడు. నడువుఁడు. వెనుకవైపు
వకు మరలుఁడు. మొదట నా కాద్వారమును దెఱచు విధా
న మెఱింగింపుఁడు. పిదప మనము సంభాషింపనగును.

అధ్యః—(నవ్వి) నేనిటకు వచ్చి చేరితినికదా! మీ కీసంభ్రమ మెం
దులకు? మీరు వెంబడించి వచ్చిన మైయారు లిరువురు
నిపు డెచటఁ గలరో మొదట నాకుఁ జూపింపుఁడు.

ఈసమయంబున మాయారాణి కొకవిధంబగు విచిత్రా
వస్థ జనించియుండెను. ఆమె నోటితో మాట్లాడుచుండెను గాని,
యంతరంగమం దనేక యోజన లొక్కుమ్మడి నుదయించుచు విలీన
మొందుచుండెను. తాను కొన్ని వత్సరములనుండి ముకుందసింహుని
బంధించియుంచిన రహస్యవృత్తాంతము సాధుపుంగవునకు (తిలస్మా
ధ్యక్షునకు) దెల్లముగాకుండ మఱుగుపరచి యుంచవలెనని యామె
యభిప్రాయము గాని, దానిని గప్పిపుచ్చుట కేయుపాయాంతరము
ను నామె బుద్ధికి గోచరింపకుండెను. తటతటఁ గొట్టుకొనుచుండిన
గుండియ నడచివట్టుటకుఁ బెక్కుభంగులఁ బ్రయత్నించుచుండినను
నామె కెవ్విధంబునను సఫలత చేకూరకుండెను. ఆమె మోమునందు
భయసంభ్రమముల ఛాయ వ్యాపించియుండెను గాని, యువి యిపు
డు సాధుపుంగవుఁడు పైన ప్రశ్నించియుండిన వాక్యములు నాలిం
చినతోడనే మఱియు నభివృద్ధినొందసాగెను. తుదకు నిరుపాయయై
తన్ను బాగుగ సంభాళించుకొని సాధుపుంగవునితో సంభాషింప
నారంభించెను.

"(వెనుకవైపునకుఁ జేతితోఁ జూపుచు) ఆమైయారు లిరు
వురు నచటఁ బడియుండిరి. నాచాతుర్యగరిమ వారికి మూర్ఛనుగలి

గించి యచట విడిచి వచ్చితిని. వారిగవురు మాత్రమే కాదు. నే నీసురంగమం దాకస్మికముగఁ గలసికొనిన మృగాంకవతీ రాజేశ్వరులను మఱియొక మైయారునిగూడ నా మాయాజాలమందుఁ జిక్కించుకొని యుంటిని.

"(తుళ్లిపడి) ఏమి! మృగాంకవతియు రాజేశ్వరియునా!"

"ఔను. రాజేశ్వరి, మృగాంకవతితోఁ గూడియుండిన సమాచార మింతదనుక మీకుఁ దెలియకుండును."

"అకటా! గాలిమైనను జొరుటకు సాధ్యముగాని యంతర్భవనమందు నేను బంధింపఁబడి యుంటిని. నాకాసమాచార మెటులఁ దెలియఁగలదు? మంచిది. నడువుఁడు. నే నామైయారులను గాంచవలసియున్నది."

ఇవ్విధంబున బలికి సాధుపుంగవుఁడు ముకుందసింహ సరపాలుఁడు మున్నగువారలు మూర్ఛావస్థఁ బడియుండిన స్థానమువైపునకు బయలుదేరెను.

మాయారాణీసులోచనలును నలువురాళ్ళను దప్పించుకొనుచు, సాధుపుంగవుని వెన్వెంటఁ బోఁదొడంగిరి. అచటి భూమియందుఁ దెలువురాళ్ళకంటె నలువురాళ్లు మిక్కిలి చిన్నవిగ నుండెను. మాయారాణి సాధుపుంగవుని యెంతయు గారవించుచుండెను. మఱియు వానికధికముగ భీతిల్లుచుండెను. కాని, ఇపుడామె యవస్థయందు విపర్యయము జనించియుండెను. ఆమె మాటాడక గంపితహృదయంబుతో నాసాధుపుంగవుని వెనుక వెడలుచుండెను. మఱియు నామె కుడిహస్తము మొలయందుఁగల కైజారు పిడితో వినోద్యమందుచు, నవసరము గలిగిన వెంటనే, దానిని యొరనుండి దూసి, యుపయోగించుటకు సంసిద్ధముగ నుండెను. బహుశః యామె సాధుపుంగవునిపైఁ బ్రహరింపఁదలంచుటయే దానికిఁ గారణమై

యుండనోపు, ఎందుచేతనన, సాధుపుంగవుఁడు ముకుందసింహుని గాంచినంతనే తనపైఁ గుపితుఁడగుననియుఁ దన గుప్తరహస్యము వెల్లడియగుటలోడనే యతఁ డావేశపూరితుఁడై తన్ను దిరస్కరించి దూషింపక మానఁడనియు నామె తొలుతనే నిశ్చయించుకొని యుండెను. సాధుపుంగవుఁడును నిశ్చింతుఁడుగాక కడగంటిచూపుల నలుదెసలఁ బరికించుచు నేగుచుండుటచే నతఁ డన్నివిధంబుల జాగ్రత్తగలిగి యుండినటులఁ దోఁచుచుండెను.

సాధుపుంగవుఁ డామూర్వాగతులను సమీపించిన పిదప మైనపువత్తి వెలుతురునం దొక్కొక్కరిని బాగుగఁ బరిశీలింపసాగెను. వానిదృష్టి ముకుందసింహునిపైఁ బడుట తోడనే తుళ్ళిపడిఁ మాయారాణివైపునకుఁ బరికించి, "అహా! నే నిపు డెవరిసిగాంచుచుంటిని? నానేత్రములు నన్ను వంచించుటలేదుగదా? ఇది యెట్టి విచిత్ర"మని పలికెను:—

"మఱియొకవైయెయారుఁడును నరుదెంచి నాచేఁ జిక్కియుండెనని, తొలుతనే వివరించియుంటినిగదా!"

"అహా! కొన్నిసంవత్సరములకుఁ బూర్వము గతించియుండిన నాప్రభువు ముకుందసింహ నరపాలుఁ డీతఁడు గాడుకదా? మృతినొంది మరలఁ దిరిగి వచ్చువా రీలోకంబున నెవ్వరేనియుఁ గలుగుదురా? అయ్యో! ఇది యెట్టియడియాస! (కొంచెము యోజించి మరల ముకుందసింహునివైపునకు గాఢదృష్టిఁ బరికించి) కాదు కాదు. దుఃఖసంతాప కారణంబుల వీనిరూపమందుఁ గొంతపొరపు చూపట్టుచున్నను నేను గుర్తించుటయందు మాత్ర మిసుమంతయు వ్యత్యాసము గలుగదు. ఎవని యుపకారచింత ప్రజల నెల్లరను తన దాసులనుగ నొనరించుకొనియుండెనో, ఎవరు; వితరణశీలుఁడో, దయాంతరంగుఁడో,—స్వపక్షపరపక్షభేదమును బాటింపని న్యాయమూర్తి

రో—సకలసద్గుణగరిష్ఠుడో—ఎవని విమలకీర్తి దిగంతవిశ్రాంత మై వెలయుచుండెనో, ఎవనిని సేవించుట తమకు గౌరవప్రదముగ ప్రజలు భావించుచుండిరో, యట్టి యకళంకచారిత్రుఁడు ముకుంద సింహ నరపాలుఁ డీతఁడేయనుట కెట్టి సందియమును లేదు. మీరు వీని విషయమున మమ్మెల్లరను వంచించియుంటిరి. మీదుర్ప్రవర్త నము నాకు బాగుగ దెలిసియున్నను బలవత్తరమగు కొన్ని కారణాం తరములవలన మీపక్షము వహించి, శిగపూనైనను వాడనీయక మి మ్మెంతయో కాపాడుచువచ్చితిని. కాని, దానిపరిసీమ యింతదనుకఁ జేరియుండెనని కలనేనియుఁ దలంపనైతిని. (ముకుందసింహుని నాడి పరీక్షించి) అహా! నాప్రభువు నిట సజీవునిగఁ జడయుటచే నాకమి తానందము గలుగుచున్నది. మఱియు నాదయామయుండగు పర మేశ్వరున కనేక ధన్యవాదములను గావించుచుంటిని."

"సాధుపుంగవా! మీరు వేగిరింపకుఁడు. బాగుగ యోజిం చి విమర్శింపకయే మీకఠినోక్తుల నన్ను నొవ్వఁజేయకుఁడు. మఱి యు నేను వచియించు వాక్యములను శ్రద్ధాళురలై యాలించి విశ్వ సింపుఁడు. కొన్నిదినములనుండి విజయేంద్రసింహుని మైయారుఁడొ కఁడు భూపాలుని రూపమును దాల్చుకొని ప్రజలకు శంకాస్పదంబు లగు సంగతులను బోధించి వారియందు భేదబుద్ధిఁ గలిగించి విద్రో హామొనరించుటకుఁ బురికొల్పుచుండెను. నేనావిషయమెఱింగి తొ లుతనే మనరాజ్యమందెల్లెడల చాటింపించితిని."

"ఏమని?"

"ఒకమైయారుఁడు భూపాలుని రూపమును దాల్చుకొని ప్రజ లను బురికొల్పుట కేతెంచియుండెను గావున, వానిశిరమును ఖం డించి తెచ్చువారి కొక లక్షరూప్యములు పారితోషికముగ నొసం గబడునని. నేఁ డాదురాత్ముఁ డాకస్మికముగ నిచటికేతెంచి నాచేఁ జిక్కియున్నాఁడు."

"(కొంచెము యోజించి) అటులఁ గావచ్చును. మీరు మోహనసింహ జటాశంకరుల వెంట నీసురంగములోని కేతెంచియుంటిరి గదా! తక్కినవారలు మీకెచట నెవ్విధంబున జిక్కిరి? లేక వారలు మొదటనుండియు నీసురంగమందే కలరా?"

"నే నీసురంగమందుఁ బ్రవేశించిన పిదప మోహనసింహ జటాశంకరులకు మూర్ఛ గలిగించితిని. పిమ్మట వీర (చేతితోఁజూపుచు) లీవైపుననుండి యిటకు వచ్చి చేరిరి. ఆసమయంబున దిలస్మరవ్వలనుండి వెడలియుండిన పొగ యీస్థానమందెల్లెడల వ్యాపించి యుండుటచే వీరలుగూడ మూర్ఛావస్థకు గుఱియయ్యిరి."

"ఏమి! తిలస్మరవ్వలనుండి వెడలినపొగయా! అగుచో, మీరేనూతనపద్ధతినో వీరలకు మూర్ఛగలిగించి యుందురు."

"ఎపుడు నేననేక యాపదలయందుఁ జిక్కి దుఃఖితురాలనై ముందు కర్తవ్యము గోచరింపమి నిరాశాపూరితచిత్తనగుచు నా మందిరమునుండి పారిపోయితినో (తిలస్మపిస్తోలును రవ్వలనుచూపి) యపుడు వీనిని నావెంటఁ గొనితెచ్చితిని. ఈపిస్తోలువలన విడువఁబడిన రవ్వలు తమప్రభావమును బాగుగఁ జూపించియున్నవి. మీరును వీనిగుణగణంబుల నెఱింగియే యుందురు."

"నిక్కువము కాని, (ముకుందసింహుని వైపునకుఁ గాంచి) ఈతఁడు విజయేంద్రసింహుని మైయాతుఁడని యేమిసిద్ధాంతము! చూడుఁడు. నేనిపుడే యాజాడ గనిపెట్టెదను."

ఇవ్విధంబున బలికి సాధుపుంగవుఁడు దనజోలెనుండి యొక సీసాను వెడలించెను. దానియం దొకవిధంబగు యరకు గలదు అతఁడు దానియందుఁ దనవ్రేలుఁ దడిపి ముకుందసింహుని చెక్కిట బాగుగ రుద్దెను. మఱియుఁ గొంత తడవు నిలచి యొకవస్త్రములో దానిని దుడిచివైచెను. పిదప వానిమోమువంక బాగుగ నిదానించి చూచి మాయారాణితో నిటులఁ బలికెను:—

"కాదు కాదు. ఇతఁడు విజయేంద్రసింహుని మైయారుఁడు గాఁడు. మఱియు నితఁడు మోముపై రంగు నలఁదుకొని యుండలేదు. వీని చెక్కిటఁ జూపట్టుచున్న పుట్టుమచ్చయుఁ గల్పితమైనది గాదు. ఇతఁ డట్టి రంగుతో నీమచ్చను నిర్మించుకొనియుండినను, నీయరకునందలి ప్రభావమువలన తప్పకది తొలఁగిపోవును. మమ్ములను మీరు నిస్సందేహముగ వంచించియుంటిరి. ఇతఁడు ముకుందసింహానరపాలుఁడుగాని వేఱెవ్వరునుగాఁడు."

"మీరిటులఁ దలంపకుఁడు. విజయేంద్రసింహుని మైయారులు తమ మోములకుఁ బచ్చిరంగు నుపయోగింపరు. ఈమధ్యనే కదా, యభయసింహుఁడు నామైయారుఁడగు కాంచనసింహుని వంచించియుండెను. వాని మోముపై నభయసింహునివలన బూయఁబడిన రంగు నతఁడు వేయివిధంబులఁ బ్రయత్నించియుఁ దొలగించుకొనజాలఁడాయెను. మీ రాసవిస్తరవృత్తాంతము నాలించినచో నబ్బురపాటు నొందకమానరు. విజయేంద్రసింహుని మైయారులు మిగుల ధూర్తులనియుఁ జాకచక్యముగలవారనియు మీ రెఱింగియే యుంటిరికదా!"

"ఏది యెటులుండినను, నామందుమాత్రము వ్యర్థముగఁ బోవునదికాదు. కాని, వేఱొకటి కావచ్చును."

"(ఆతురముతో) అది యేమిటి?"

"బహుశః ముకుందసింహానరపాలుని విషయమున మీరు మమ్ము వంచింపకుండినను యాతఁడే స్వయముగ మనలను వంచించి యెటకేనియుఁ బోయి యుండవలెను."

"కాదు. ఇదియు సరి కాదు."

"కానిండు. నేను వీరికిఁ దెలివి గలిగించెదను. వీరితో సంభాషించుటవలన సర్వమును దేటతెల్లము గాఁగలదు."

"అటుల వలదు. వీరి నెల్లర నిట్టి మూర్ఛావస్థయందే నిచటి నుండి కొనిపోయి మీ పిశాశ్రమమందిరమందు బంధింపుఁడు. తరువాత యోజింపవచ్చును."

"నేను దీని కంగీకరింపఁజాలను."

"(ఆవేశపూరితయై) నాయాజ్ఞానుసారము మీరు తప్పక నడవవలసియున్నది."

"ఎప్పటికిని గాదు. నా కీముకుందసింహాసరపాలుని విషయమున సందేహము గలదు. భూపాలునితోపాటు మృగాంకవతీరాజేశ్వరులకుఁగూడఁ దేఁకుప గలిగించెదను."

ఈమాటల నాలించినంతనె మాయారాణి స్థితి మిగులఁజెడు గొందెను. క్రోధాతిరేకంబున నామె యధరోష్ఠము లదరసాగెను. కన్నులెఱ్ఱబారెను. మఱియు నామె దటాలున యొరనుండి తిలస్మ కైజారును వెడలించి కోపపూరిత స్వరంబుతో సాధుపుంగవున కిట్లనియెను:—

"మీకివ్విధంబగు నభిమానమో జనించియుండవలెను. కానిచో, నాయాజ్ఞ నుల్లంఘించుటకు మీకేమి సామర్థ్యము గలదు? నేను తిలస్మమహారాణినను విషయమును మఱచియుంటిరా? లేక, మీకంటె నధికు లెవ్వరును లేరని తలంచుచుంటిరా? నేను తలంచిన కార్యమెట్టిదైనను నవలీలఁ జేయఁజాలుదును. మఱియు మీరు నాకెట్టి కీడును గలిగింపఁజాలరు. అగుచో, నిటు వినుఁడు. స్పష్టరూపంబున దెలుపుచుంటిని. ఇతఁడు నిక్కువముగ ముకుందసింహుఁడే! ఎట్టి సంశయమును లేదు. జగవతినిగూడి సుఖోపభోగంబుల ననుభవించు లాలసతోడను, మిక్కుటముగ బాధించి తిలస్మరహస్యంబుల నెఱుంగు నాశతోడను వీనిని కారాగృహాబద్ధునిగ నొనరించియుంటిని. కాని, అకటా! పాపాత్మురాలగు మృగాంకవతి

వీనిని బంధవిముక్తునిగ నొనరించియున్నది. కానిండు! నేనిపుడు మీ
కన్నుల యెదుటనే వీరెల్లర కుత్తుకల నుత్తరించి నాక్రోధము నవశ
మిల్లఁ జేసికొనియెదను. ఇఁక మీరు తల పైకెత్తినచో, చూడుఁడు.
(కైజారును జూపి) దీనితో మొదటనే మీపని దీర్చివైచెదను."

"(నవ్వి) చాలుఁజాలును. ఇఁక నధికముగ గంతులు వేయఁ
కుఁడు. నేను వృద్ధుఁడనైయుండినను యబలలగు మీయిరువురివలన
నే నెన్నటికిని పరాజితుఁడను గాను. అగుచో, వినుఁడు. నేను నా
యభిప్రాయమును వెల్లడించుచుంటిని. మీరు తిలస్మమునకు రాణు
లయి యుండిన నే నద్దాని కధ్యక్షుఁడను. నాయొద్దఁగూడ యద్భుత
ప్రభావసమన్వితంబులగు ననేక విచిత్ర పదార్థములు గలవు. ఇది
యునుగాక మీరు నాపైఁ గుపితులయి యెట్టి లాభమును బడయఁ
జాలరు. మఱియు మీరిపుడు స్పష్టముగ ముకుందసింహుఁ డీతఁడే
యనియు నేను ......"

"(మాటకడ్డమువచ్చి) ఔను. నేను స్పష్టముగఁ దెలిపియుం
టిని. మీరు నాపక్షమున లేకుండినను నాకెట్టి కీడును గలిగింపఁజాల
రని మరలఁ దెలుపుచుంటిని. తిలస్మాధ్యక్షుఁడనను గర్వాతిశయము
మీకుఁ గలిగియుండిన నేనుగూడ నా సాహసపరాక్రమములను
జూపింపకదీరదు."

ఇవ్విధంబున బలికి మాయారాణి తిలస్మకైజారు పిడిని గట్టి
గ నొక్కెను. వెంటనే దానినుండి మెఱుపుఁదీగవలె నద్భుతప్రకా
శము వెడలి యాసురంగమును బ్రకాశవంతముగ నొనర్చెను.
మఱియు నాపిడిని సడలించుటతోడనే యాప్రకాశ మదృశ్యమయ్యె
ను. కాని, సాధుపుంగవునిపై దానిప్రభావ మెద్దియుఁ గలుగకుండు
టచే మాయారాణి కధికాశ్చర్యము జనించెను. తుదకు వానిని
మూర్ఛాగతునిగ నొనరించు తలంపున నామె తిలస్మకైజారు నా

సాధుపుంగవుని దేహమునకుఁ దాఁకించెను. దానివలనను నామెకెట్టి ప్రయోజనమును గలుగ దాయెను. ఆసాధుపుంగవుఁడు గొంచమైనను చలింపక యెప్పటియట్టుల నిలచియుండుటఁ గాంచి, మాయారాణి కిఁ గలిగిన భయాశ్చర్యములకు మేరలేకుండెను. మఱియు నామె డిల్లవోవుచు రెప్పలల్లార్పక సాధుపుంగవుని మోమువైపున కట్టుల నే పరికింపసాగెను. తిలస్మకైజారునుండి ప్రకాశము వెడలకుండిన చో దేవిగుణాతిశయంబులను జటాశంకరుఁ డభివర్ణించియుండెనో, యా కైజా రదికాదని యామెకు శంక జనించియుండును గాని, యిపు డామె దానివిషయమున నెట్టిసందేహమును బొందఁజాలకుండెను. అంత సాధుపుంగవుఁడు నవ్వుచు నామెతో నిట్లనియెను:—

"నాకేదియో గర్వాతిశయంబు గలిగియుండెనని మీరు పలికియుంటిరికదా! ఆగర్వము సరియైనదే కాని, మిథ్యముగాదని మీ రిపుడైనను గ్రహించియుందురు."

"(తిలస్మకైజారువైపునకుఁ బరికించి) కాని, బహుశః దీని యందుఁ గొంచెము..............."

"కాదుకాదు. దానిగుణమునం దెట్టిలోపమును గలుగలేదు. నేనీకైజారును బాగుగ నెఱిఁగియుంటిని. మీకిది నూతనవస్తువై యుం డినను (ముకుందసింహునివైపునకుజూపి) నే నీద రూనముద్రుఁడగు ప్రభువు కారణంబున నిట్టిగుణవిశేషయములుగల కైజారులను కటా రులను బల్లెములను నెన్నింటినో కాంచియుంటిని. మఱియు వాని నుపయోగించియుంటిని. నేనిపుడు తిలస్మకార్యములయందు సిద్ధహ స్తుఁడనై యుండుటచే నిట్టి తుచ్ఛపదార్థములను గణనసేయుట నా కీర్తియందుఁ గళంక మాపాదించుకొనుటయే యగును. ఈకైజారు నందలి ప్రభావము నాపైఁ గొంచెమైనను గలుగకుండుటఁ గను లారఁ గాంచియుంటిరికదా? నానిజసామర్థ్యమును మీ రెఱుంగనే

ఱొరుంగరు. చాలును. ఇపుడు నాసామర్థ్యమును వర్ణించి తెలుపుటకు నేఁ గోరను. కాని, విచారకరము! మీరు నన్ను జంపుటకు సిద్ధపడిరి. మంచిది. ఎట్టిచింతయుఁ గలుగదు. మిమ్ము నేఁటిదనుక నెంతేయుని గౌరవించుచుంటిని. మీరు గావించుచుండిన దుష్కార్యములను కనులారఁ గాంచుచుండియు మీపక్ష మవలంబించియుంటిని. మంచిది. ఇపుడు మీరు..........."

"(మాటకడ్డువచ్చి) వినుఁడు. వినుఁడు. మీరిపుడు చెప్పఁబోవునది నేను గ్రహించితిని. మీప్రాణములను గొనుట నాయభిమతముగాదు. కారణంబేమన, నిక్కముగ మీయందలి ధైర్యవిశ్వాసములతోడనే నేను గంతులు వైచుచుంటిని. మీతోడ్పాటుననే కదా యనేక గొప్పగొప్ప పరాక్రమశాలురనుసహితము తృణప్రాయులనుగఁ దలంచుచుంటిని. దాని కిఁక వేఱేమి తార్కాణము గావలయును? కొన్నిదినములు నుండి మీరు నన్నెడబాసియుండుటచేతనేకదా యనేక గురుతరవిపత్తులకుఁ జిక్కి రాజ్యమును విడచి దిక్కుమాలిన పక్షివలెఁ జెట్టుకుఁ బుట్టకుఁ దిరుగాడుచుంటిని. మిమ్ము నాతండ్రివలెను గురువువిధంబునను భావించుచుంటిని. (కరముల జోడించి) నావలన ఘటిల్లిన యనంతాపరాధములను మీబిడ్డల తప్పిదములుగ భావించి నన్ను మన్నింప వేఁడుచుంటిని. మీరు నాయెడలఁ బ్రసన్నచిత్తులరయి ముకుందసింహుని విషయమున మాత్ర మెట్టిజోక్యమును గలిగించుకొనకుందురుగాక యని పదేపదే మిమ్ముఁ బ్రార్థించుచుంటిని.

తిలస్మక్షైజారు దనప్రభావము సాధువుఁగవున్నిప్పైఁ జూపకుండుటచే మాయారాణి హృదయమం దధికభీతి యుప్పతిల్లెను. మఱియు నామె ప్రకంపితగాత్రియై తనయుల్లంబున నిటులఁ దలపోయఁ దొడంగెను.

"అకటా! అది యెట్టివిచిత్రము. తిలస్మక్రైజారు సాధుపుంగవునిపైఁ దనప్రభావమును జూపకున్నది. తిలస్మకార్యములయందు సిద్ధహస్తుఁడనని యీతఁడే స్వయముగఁ బలికియుండెనుగదా! నిష్క-వము! నిష్కవము!! దానియం దెంతమాత్రమును సందియములేదు. తిలస్మకార్యములయందు వీని కెంతటి స్వాతంత్ర్యమును బరిచయమును గలిగియుండెనో దానిలోఁ బదునాఱవపాలైనను నాకుఁ గలుగదనుట నిర్వివాదాంశము. ఇతఁడు తిలస్మపదార్థములవలన ననర్ఘలాభమును బడసియుండెను. ఆలాభఫలంబుగ, నితఁడు విజయేంద్రసింహుని కారాగారమునుండి యొరుల సహాయమర్థింపకయే విముక్తిలాభమును బడసియున్నాఁడు. మఱియు నిట్టి యద్భుతమహిమోపేతమగు తిలస్మక్రైజారునుసహితము నితఁడు తుచ్ఛాతితుచ్ఛముగఁ దలంచుచుండెను. కావున సర్వథా సమర్థుఁడగు నిట్టివానితోఁ దగవుఁ బెంచుకొనుట యనర్థదాయకము గాకుండునా? ఎవ్విధంబుననేనియు వీనిని నాకు వశవర్తినిగ నొనరించుకొనియెదనుగాక! పిదపఁ దరుణమునుగని యన్నియుఁ జక్క నెత్తుకొనవచ్చును."

ఇవ్విధంబులగు పెక్కుసంగతుల నతిశీఘ్రముగ నాలోచించుకొని మాయారాణి వినీతభావమెరయ, సాధుపుంగవునితో సంభాషింపఁదొడంగెను. సాధుపుంగవుఁడును మాయారాణి వేడికోలు నాలించి, కొంతతడ వెద్దియో యోజించుకొని, మందస్మితవదనుఁడై యామెతో నిటులఁ బలికెను:—

"మంచిది! నే నీయపరాధమునుగూడ మన్నించుచుంటిని. కాని, ముకుందసింహునకు మాత్ర మెట్టికీడును గలిగింపరాదు. అకటా! బహుకాలమునకుఁ బిదప వీని నిట్టిస్థితియందుఁ బరికింప వలసివచ్చినది!"

"అగుచో, నింక మీరు క్షమించిన దేదికలదు? నేను ముకుందసింహుని వంచించియుండిన రహస్యవృత్తాంతమును మీకు వెల్లడిం

వక దాఁచియుంచితివను భేదమును మీమనస్సునందుఁ బెట్టుకొన వలదు. మీరును పూర్వవృత్తాంతము గొంచెము జ్ఞప్తికిఁ దెచ్చు కొనుట మేలు. అందు ముఖ్యముగ, దేనియందు నావివాహము నాకు బదులుగ బ్రతిమతోఁ ...వింపఁబడెనో, యాగాఢాంధకార మగు రాత్రి......యీకార్యాచరణములన్నియు మీరు గావించి యుండినవియేకదా! మీరలే నన్నింతపటమునకుఁ దెచ్చినది. నాకిపుడు దుర్దశ సంభవించిన మీరుమాత్రము దప్పిపోఁగలరా? మీరిపుడు ముకుందసింహుని మృత్యువాతనుండి తప్పింపఁదలంచినను— కమ లాదేవి తప్పించుకొని పారిపోయిన విషయము మీకు దుఃఖదాయ కము గాకుండునా? ఆవృత్తాంతము ముకుందసింహునకుఁ దెల్లమగు చో, నీతఁడు మిమ్ము క్షమించి విడువఁగలఁడా? ఎన్నటికినిగాదు. ఆ సమాచారమంతయు వెల్లడియగుచో, నా కార్యవిధానమంతయు మీ వలననే జరిగియుండెనని తెలంపనివా రెవరుందురు? ఇతర హేతువు లెట్టులున్నను ముఖ్యముగఁ గమలాదేవిరహస్యము దెలియకుండుట కే నేనీముకుందసింహుని జెరఁబెట్టి యుంటినని విశ్వసింపుఁడు. మఱి యుఁ దిలస్మామ్యకుని కార్యాచరణమువలననే కమలాదేవి స్థాన మున............"

ఇంతదనుకఁ బలికి మాయారాణి యూరకుండెను. మఱియుఁ దాను వచియించియుండిన వాక్యములు సాధుపుంగవుని హృదయ మం దెట్టిపరిభావమును గలిగించెనో దానిని గనిపెట్టుటకు వాని మోము వైపునకుఁ దదేకదృష్టిఁ జూడ నారంభించెను. ఇపుడు మా యా రా ణి వచనముల నాలించి సాధుపుంగవుఁడు సంక టమందుఁ జిక్కుకొనెను. కొంతసేపటి కతఁడు శిరము పైకెత్తి మాయారాణివైపునకుఁ గాంచి, "మంచిది! ఇపుడు విస్తారముగ నేమియుఁ సంభాషింప నవసరములేదు. ముకుందసింహుని విషయ

ముఖ నే నెట్టిసంబంధమును గలిగించుకొనకుందునని ప్రతిన జేయు చుంటిని. కాని, కొన్నిదినములవఱకు వానిని దుదముట్టింపకఁ గా రాగృహబద్ధునిగ నొనరించుట యావసరమనిమాత్రము దెలుపుచుం టిని. వీనితోపాటు మృగాంకవతీరాజేశ్వరులను మోహన జటాశం కరులను గూడ బంధించియుంచుట యుచితము. మీరు రాజ్యధా మముల వీడుట కెవ్విికారణభూతములయ్యెనో, యట్టి ఘోరవిపత్తు లనుండి విముక్తిలాభమును బడసిన పిదప వీరిని మీయిష్టప్రకార ము గావింపవచ్చును. మంచిది. ఇఁక నామాటలకు మాఱుపలుకక నామతానుసారము గావింపుఁడు. కానిచో, మీకెన్నిఁటికిని సుఖ శాంతులు లభింపఁజాలవు" అనెను.

"మంచిది! అటులనే కానిండు. మనమిపుడు వీరల నెచటఁ బంధింపవలయునో తెలుపుఁడు."

"నావిశ్రామమందిరమే వీరలను బంధించుట కుపయుక్తమగు స్థానము."

"మఱియు నేను నివశించుట కేస్థానమును నిశ్చయించియుం టిరి?"

"అహా! మీరు చాలదినములు దనుక రాజ్యధామములను వీడియుండవలెనని తలంచుచుంటిరికాఁబోలు. నేను రెండుమూఁడు దినములలోనే మీకు వ్యతిరేకులగు సైనికులు మున్నగు వారెల్లర మోములకు మసిబూసి మిమ్ము పూర్వస్థానమం దధిష్టింపఁజేసెద ను. కాని, యొకవస్తువు మనయొద్ద లేకుండుటచే గొంతయిబ్బంది తప్పకఁ గలుగవచ్చును."

"అది యెట్టిది! బహుశః మీయభిప్రాయ మద్భుతసుంది రవుఁ దాళవుఁజెవి విషయమై యుండవచ్చును.

"ఔను. అదియే! దానిని మీమందిరమందు విడచి వచ్చి యుందురు."

"కాదు. అది నాయొద్దనే కలదు. నేనన్ని తెఱంగుల వివశురాలనై మందిరమునుండి పారిపోవు సమయంబున నావెంటఁ గొని తెచ్చిన పదార్థములలో నదియుఁ గలదు."

"అహా! మిక్కిలి సంతోషవార్త! దానిని నాయధీనమొనరింపుఁడు. తరువాత సంభాషింపవచ్చును."

"ఇదిగో! కైకొనుఁడు. సిద్ధముగ నున్నది. (తాళపుఁజెవి వానికొసంగి) సాధ్యమగునంత శీఘ్రముగ మనమిచటినుండి వెడలిపోవుట మంచిది."

"ఔను. నాయభిప్రాయమును నదియే! మీరీతిలస్మికైజారు నెచట సంపాదింపఁగలిగితిరి!"

"ఈకైజా రొకటియే కాదు. ఇట్టివిధంబగు మఱియొకకైజారు సులోచన యొద్దఁ గూడ కలదు. మృగాంకవతి వీనిని జటాశంకర ముకుందసింహుల కొసంగియున్నది. అవి యిపుడు వీరు మూర్ఛాగతులయిన పిదప నాకుఁ జేఁజిక్కినవి. ఒకకైజారు నాయొద్ద నుంచుకొంటిని. రెండవదానిని సులోచన కొసంగియుంటిని. మఱియు నిట్టి విధంబులగు కొన్ని కైజారులను మృగాంకవతి తనయనుచరులకుఁ బంచియుండెనని వినియుంటిని. అవి యిపు డెచటగలవో నాకుఁ దెలియదు."

"మంచిది! అద్భుతమందిరపుఁ దాళపుఁజెవి మీ వెంటఁ గొని తెచ్చుట మిగుల మేలయ్యెను. కానిచో, మన మెన్నియో శ్రమలకుఁ బాలు కావలసియుండును."

"నిక్కువము."

మాయారాణి యద్భుతమందిరపుఁ దాళపుఁజెవి విషయము నగూడఁ దిలస్మాధ్యక్షునితో ననృతమాడియుండెను. ఆమె యా తాళపుఁజెవిని జటాశంకరున కొసంగియుండినను, నిపుడది ముకుంద

సింహునియొద్ద నామెకు లభించియున్నది. ముకుందసింహుని, ప్రాణములఁ దీయుటకుఁ బదులుగ నాతాళపుఁజెవిని మాయారాణి జటా శంకరునకుఁ బారితోషికరూపమున నొసంగియున్నది. తత్కారణంబున నిపుడు జటాశంకరుని పేరెత్తుట సమంజసము గాదని దలంచి యావిషయమును మఱియొకవిధంబుగ మార్చి వానికిఁ దెలిపియున్నది.

సాధుపుంగవుఁడు మాయారాణి సులోచనలను వెంటఁదోడ్కొని, దేనియందలి చక్రమును ద్రిప్పుటవలన నాసురంగద్వారము బంధింపఁబడెనో, యాయినుపకంబము సమీపమునకుఁ బోయి నిలచెను. ఇపు డాద్వారమును సాధుపుంగవుఁ డెవ్విధంబున దెఱచునని, మాయారాణి మిగుల నుత్కంఠతోఁ జూచుచుండెను. సాధుపుంగవుఁ డెవు డాకంబమునకు నంటుకొనియుండిన చక్రమును ద్రిప్పి యాద్వారమును దెఱచెనో, యపుడు మాయారాణికి జనించిన యాశ్చర్యమునకు మేరలేదు. కారణం బేమన, నామె యాచక్రమును కొన్నిమాఱులు వెనుకవైపునకుఁ ద్రిప్పియుండెను. కాని, యాద్వారము దెఱవఁబడలేదు. ఇపు డాకారణము దెలిసికొనుటకు మాయారాణి మిగుల నుత్సుకతతో సాధుపుంగవుని దెసఁ బరికించి, "నేనుగూడ నీచక్రమును వెనుకవైపునకుఁ గొన్నిమాఱులుఁ ద్రిప్పియుంటిని. కాని, ద్వారము దెఱవఁబడదాయెను. ఇవుడది యింత సులభముగఁ దెఱవఁబడుటకుఁ గారణమేమియో నచియింపుఁ" డనెను. అంత సాధుపుంగవుఁడు నవ్వుచు నామెతో, "నాకారణమును మఱియొక సమయమున వివరించెదను. కారణం బేమన, మనము కావింపఁదలచిన కార్యముల నతిశీఘ్రముగఁ దుదముట్టింపవలసియున్నది. కావున నిపు డావిధమంతయు వర్ణించి తెలుపుటకు సమయము చాల"దని బదులుబలికెను.

మాయారాణి వాసిమాటల కేట్టి యాటంకమును బలుకక, "మంచిది! దీనిరహస్యము మఱియొక సమయమున నడిగి తెలిసికొన వచ్చుననియుఁ, దానిపుడు వానికి బాగుగఁ లోపడియుంచుటచే నా విషయమున విస్తారముగఁ బట్టుపట్టుట యుచితము గాదనియుఁ దన లోఁదా నాలోచించి మిన్నకుండెను. మాయారాణి కాద్వారరహస్యము నెఱింగించుటకు సాధుపుంగవునకు సమ్మతము గాకుండుటచే నావిధాన మామె కెఱింగింపక దాఁచియుంచెను. మాయారాణి కా ద్వారమును దెఱచువిధము దెలియకుండినను, మాపాఠకమహాశయుల చిత్తవినోదార్థ మారహస్యమును మేమిచట వెల్లడించు చుంటిమి.

ఇనుపకంబమందలి చక్రమును ద్రిప్పుటవలన నాసురంగ ద్వారము బంధింపఁబడినది. కాని, దానిని దెఱచుసమయమున మాత్రము కొన్ని సాంకేతికనియమములను బాటింపవలసి యుండెను ఆచక్రమును నిరువదిమూఁడు మాఱులు వెనుకవైపునకుఁ ద్రిప్పి మరలఁ బదమూఁడు తడవలు కుడివైపునకుఁ ద్రిప్పినపిదప నేఁడుమాఱు లెడమతట్టునకుఁ ద్రిప్పుటవలన నాద్వారము దెఱవఁబడుచున్నది. ఆనియమిత సాంకేతికమునకు విరుద్ధముగఁ గొన్నిమాఱు లెక్కువగగాని తక్కువగగాని త్రిప్పుచో, నాద్వార మెన్నటికిఁ దెఱవఁబడకుండును. సాధుపుంగవుఁ డాద్వారమును దెఱచు సమయంబునఁ దనమనంబున లెక్కించుకొనుచు, నాచక్రమును మిగుల జురుకుగఁ ద్రిప్పియుండెను. కాని, మాయారాణి కావిషయముపైఁ గొంచమైనను దృష్టి లేకుండెను.

సాధుపుంగవుఁడు మాయారాణీనులోచనలను వెంటఁదోడ్కొని యాసురంగమునుండి వెలుపలకుఁ జేరుటకే దల్లవాఱియుండెను. కాని, సూర్యభగవానుఁ డింకను నుదయించియుండలేదు.

వార లాకొండతివ్వ పైనుండి కాంచుటవలన మైదానమం దింకను నిస్తబ్ధత వ్యాపించియుండుటనెఱింగి, యానమయంబుననే మోహన సింహ జటాశంకర ముకుందసింహులను మృగాంకవతీరాజేశ్వరులను నాసురంగమునుండి వెడలించి విశ్రామమందిరములోనికిఁ జేర్చుట కొండొరులుకూడ పలుకుకొనిరి. సులోచన యతివేగముగ నచటి నుండి పరుగిడి తిలస్వామ్యత్ముని విశ్రామమందిరమునొద్దకుఁ బోయి చేరెను. మఱియు నచటినుండి తరళగు పరిచారికలను వెంటఁదోడ్కొని మరల నచటికి వచ్చిచేరెను. తదనంతము వారలెల్లరునుగూడి యా బంధితు లైదుగురను నాసురంగమునుండి వెడలించి, తిలస్వామ్యత్ముని విశ్రామమందిరములోనికిఁ జేర్చిరి. ఇవ్వడీబంధితుల నెచటఁ జెఱ పెట్టియుంచవలెనను యోజనయందు వారు జిక్కుకొనిరి. *అద్భుత మందిరవుఁ గారాగృహమందు వారిని బంధించియుంచుట సాధువుం గవుని యభిప్రాయము. కాని, మాయారాణి తనమనంబున నెద్ది యో యోజించుకొని వానితో, "మనము వీరిని మందుగాణము వకుఁ జేరియుండిన తక్షానాయందుఁ జెఱపెట్టుట యుచితి" మని పలికెను.

మాయారాణి వచనముల నాలించినంతనే సాధువుంగవుని పెదవు లదరఁదొడంగెను. దేహము జలదరించెను. క్రోధాతిశయం బున వానిహృదయము దహించికొనిపోవుచుండెను. కాని, చతుర మతియగునాసాధువుంగవుఁ డతిశీఘ్రముగ నేదియోనెపంబున మరి యొకదెసకుఁ గాంచుచుఁ దన్ను సంబాళించుకొనెను. తనకవు డుద యించిన తాత్కాలికావేశ మామె లక్ష్యమంగుఁ జిక్కగూడదను

* జటాశంకరుఁడు ముకుందసింహుని రూపుమాపుటకుఁ బ్రతినజేసి, మా యారాణి జగపతుల నేగదిలోనికిఁ దీసికొని పోయియుండెనో, మఱియు నెచట ముకుందసింహుని మృతకళేబరము జూపట్టియుండెనో యాకారాగృహము. మాయామయి 7 భాగమందలి 16 వ ప్రకరణమును గాంచుఁడు.

తలంపుతో, నతఁ డేమియుఁ బలుకక మిన్నకుండెను. తనప్రశ్నము నకు సాధుపుంగవుఁడు మాఱెద్దియుఁ బలుకకుండుటచేఁ దనమాటల నతఁడు విని యుండఁడని భావించి, వానితో, "బంధితులను మందు గాఁణమునకుఁ దాపునగల తఖ్ఖానాయందు బంధించి యుంచుట యుచిత"మని మరలఁ బలికెను.

ఆమందిరమునకు నలుతట్టుల నాలుగుగదులు నాలుగు వసారాలును గలవని మేము పైన లిఖించియుంటిమి. ఆవిశాలమమందిర ములోనికిఁ బ్రవేశించు సింహద్వారమునకు నెడమతట్టునఁగల గది క్రింద రెండంతర్భవనములు గలవు. వానిలో నొకటి మందుగాఁణ మను పేరుతో వ్యవహరింపఁబడుచుండెను. దానియందుఁ దుపాకిమందును గొన్ని చిన్నచిన్న ఫిరంగులును గలవు. ఆ మందుగ్రాణము నకుఁ జేరియుండిన రెండవయంతర్భవనమందుఁ దిలస్మాధ్యక్షుని బొక్కసము గలదు. ఆధనాగారమందే యాబంధితులను చెఱఁబెట్టి యుంచుటకు మాయారాణి దెలిపియుండెను. సాధుపుంగవుఁడును దానికి సమ్మతించియుండెను.

సాధుపుంగవుఁ డామందిరమునకు నెడమతట్టునగల గది లోనికిఁ బోయెను. దానిలో రెండువైపుల గోడలయందు రెండినుప ద్వారములు గలవు. అవియే దానియందలి యంతర్భవనములు రెం డింటిలోనికిఁ బోవు మార్గములని చెప్పవచ్చును. సాధుపుంగవుఁడు కుడివైపు గోడయందుఁగల ద్వారమును నేదియో యొకగుప్తరీతిని దెఱచెను. మఱియు నతఁడు సులోచన తరళ, పరిచారికల తోడ్పాటున నాబంధితుల నైదుగురను వారివారి నైయారీకత్తుపాలల సమేతముగ నాయంతర్భవమందుఁ జేర్చి వెలుపలకు వెడలివచ్చి యా ద్వారము నెప్పటియటుల బంధించివైచెను. వెలుపలి కేతెంచు సమయంబున నాయంతర్భవనమునుండి యొక తామ్రకలశమును

దీసికొనివచ్చెను. మఱియు నతఁడు మాయారాణిని సమీపించి, యామెతో, "నిపుడు బంధితుల కాహారపానీయములను నొసంగవ లసియున్నది. రెండుమూఁడు దినములకు సరిపడునట్టుల నీకలశము నిండ జలమును, కొన్ని వన్యఫలములను నాతఖ్యానాలోనికిఁ జేర్చి వచ్చెదను. తరువాయి సంగతి పిదప యోజింపవచ్చు"ననెను. తద నంతర మతఁడు పరిచారికలవైపునకుఁ గాంచి, "మీరిచటి యడవి లోనికేఁగి శీఘ్రముగఁ గొన్ని వన్యఫలములను గోసికొని తెం"డని యాజ్ఞాపించెను, వానియాజ్ఞానుసార మాపరిచారికలు నలువైపు లకుఁ బరుగులిడి విస్తారముగ వన్యఫలములను గోసి తెచ్చిరి. పిమ్మట నాసాధుపుంగవుఁ డాఫలముల నొకవస్త్రమునందు మూటగట్టి జలభ రితకలశము నొకచేతఁ దీసికొని యాయంతర్భవనము వైపునకు మరలఁ బోయెను. మఱియు నతఁడు గానియందుఁ బ్రవేశించి, లోపలివైపు నుండి ద్వారమును బంధించుకొనెను. ఒకయరగడియకాలము గడ చిన పిదప నతఁ డాయంతర్భవనమునుండి వెలుపలకు వెడలివచ్చెను. మాయారాణి యక్కజపడుచు వానితో, "మీ కాయంతర్భవన మం దింతతడవగుటకుఁ గారణం బేమి?" యని ప్రశ్నించెను. ఆమె ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరముగ నాసాధుపుంగవుఁ డామెతో, "నేనా బంధితుల కక్షపాలలను శోధించితిని. కాని, వానియందు మనకుప కరించు పదార్థమొద్దియుఁ జేఁజిక్కలే"దనెను.

ఈసమయంబున మాయారాణి మోముపై సంతోషచిహ్న ములు బొడకట్టుచుండెను. ఆమె కాయానందము ముకుందసింహుఁ డు మున్నగువారలు తనచేఁజిక్కుటవలన గలిగినది కాదు. దానికి వేఱొండు హేతువు గలదు. ఇంతకుఁ బూర్వ మాసాధుపుంగవుఁ డే తెంచి, యామె కార్యమందు విఘ్నము గలిగింపకుండిన, ముకుం దసింహుఁడు మున్నగువారి నెల్లరను దెగటార్చి నిశ్చింతురాలై

యుండును. కాని, యాసాధుపుంగవుఁ డేతెంచి యామె యభిప్రాయముతో నేకీభవించియుంటచే నిప్పుడామె కావిచారము లేశమైనను లేకుండెనని యామె మోమున దోఁచుచుండిన చిఱునగవు రేఖలే సిద్ధాంతీకరించుచుండెను.

## ౭.

సంధ్యాసమయము. భాస్కరభగవానుఁ డస్తమించియుండెను. కాని, పశ్చిమదిశయం దాకసమున నరుణకాంతు లింతదనుక వ్యాపించియేయుండెను. తిలస్మాధ్యక్షుని విశ్రామమందిరమందు నివసించువారి కాసమయము మిగుల మనోజ్ఞమైనది. కాని, యిప్పుడామందిరమందు నివసించువారిలో నొక్కరును నామైదానమందు నిశ్చింత విహరించుచు, నాప్రకృతిశోభను పరికించి యానందించుటకుఁ దగియుండలేదు. మాయారాణి, ముకుందసింహుఁడు మున్నగువారిని తనచేఁ జిక్కించుకొని నిశ్చింతురాలై యుండినను, నామె మానస మింకను కుదుటఁ బడకుండుటచే నామహోయానందము ననుభవింపఁ జాలకుండెను. ఆమె యచటి ప్రవాహతీరమునఁ గూర్చుండి తిలస్మాధ్యక్షుండగు సాధుపుంగవునితో సంభాషించుచు జుమేలియా సింహాసనముపై నధిష్ఠించి యున్నవోలె ప్రజలను శాసించు యోజనయందుఁ జిక్కియుండెను. ఆమె సమీపమున సులోచనమాత్రము గూర్చుండియుండి యాయిరువుర సంభాషణము నాలించుచుండెను. మాయారాణి సాధుపుంగవునితో నిటులఁ బలికెను.

"ఏనాఁడు మిమ్మును విజయేంద్రసింహుఁడు బంధించికొని పోయెనో యానాఁటినుండియు, నాయదృష్టమందు మార్పు జనించియుండెను. వేయేల? నాకీప్రపంచమే వేఱుగఁ దోఁచుచుండెను. ఒకనాఁడేనియు సుఖముగ నిద్రించుభాగ్యము నాకుఁ గలుగదయ్యెను. నాతలపై నెట్టి విపచ్ఛైలము విఱిగిపడెనో, మఱియుఁ దిలస్మా

ద్యానమం దెట్టిభయంకరసంఘటనములు దొడరియుండెనో యాసవి స్తరవృత్తాంతము నేఁడు మీకు విన్నవించుకొనియుంటిని. నేనిపుడు మృగాంకవతీరాజేశ్వరీముకుందసింహుల విషయమున నిశ్చింతురాలనై యుండినను, నా రాజ్యములోనికిగాని, తిలస్మోద్యానములోనికి గాని, పోవుటకు ధైర్యము చిక్కకున్నది. కారణం బేమనఁ, దిలస్మోద్యానములోని కిరువురు నకాబుపోషు లరుదెంచి జగపతి రహస్యమును వెల్లడించుటచే సైనికులు మిగుల నుద్రేకపూరితులయి యుండిరి. వారివలన దుఃఖమనుభవించుటకంటె నాకెట్టియాశయు లేకుండెను. అమాత్యశేఖరుఁడును కుటిలుఁడై నన్ను బంధించుటకుఁ బ్రయత్నించుచుండెననియుఁ దెలియుచున్నది.”

“అగుచో, నమాత్యశేఖరునకు ముకుందసింహ నరపాలుని యసలువృత్తాంతము దెల్లమైయుండవలెను. మఱియు నతఁడు వానిని తిరిగి జమేలియాసింహాసనముపై నధిష్టింపఁ దలంచుచుండవలెను. లేదా, మిమ్ము బంధించి విజయేంద్రసింహునకు దక్కొలుపఱచి వానిదయకుఁ బాత్రుఁడై తాను స్వయముగ నా రాజసింహాసనముపై నధిష్టింపఁగోరియుండవలెను. మఱియు మీరు వచియించిన విధంబున విజయేంద్రసింహుని యిరువదివేల కాల్బలము మురహరిసింహుని నాయకత్వమున నిచటికిఁ జేరియుండ వారినెదిర్చి పోరు నల్పక మిన్నకుండుటయం దేదియో గురుతర హేతువు తప్పక గలిగి యుండవలెను.”

“అమాత్యశేఖరుఁడు నన్ను బంధించి విజయేంద్రసింహుని యధీనమొనరించు షరతుపై వానితో సంధిగావించుకొని యుండవచ్చును.”

“అదియు సంభవము. మంచిది. మీరు సంభ్రమమునొందఁబనిలేదు. నే నమాత్యశేఖరునితోఁ గలసికొని యతఁ డెవ్విధంబున

వర్తించుటకుఁ దలంచుచుండెనో దానిని గనిపెట్టెను. అతఁడు దుర్బుద్ధితో నుండిన, వానిని సరియైనదారికిఁ దెచ్చెదను. మంచిది. కాని, మీ తిలస్మవిషయములుగాని, తిలస్మకర్మాగారరహస్యములుగాని వానితో నెవ్వరైనను జెప్పియుండరుకదా!"

"నాకుఁ దెలిసియున్నంతవఱకు వానికిఁ దిలస్మ కారాగారవిషయమున నెట్టి పరిచయమును గలిగియుండదనియే నాయభిప్రాయము. కాని, నేనావిషయమును నిశ్చయముగఁ జెప్పఁజాలను. కారణంబేమన, నానకాబు పోషులిరువురుఁ దిలస్మోద్యానమందలి రహస్యములను బాగుగ నెఱింగియుండిరి. అసవిస్తర వృత్తాంతమంతయు మీకు విశదీకరించియుంటిని. వేయేల? తిలస్మ రహస్యములను వారలు నాకంటె బాగుగ నెఱింగియుండిరనియే చెప్పవచ్చును. కానిచో, వారినిబంధించుటకు నేను కావించియుండిన యుపాయములన్నియు నేలవ్యర్థమగును? వారిరువురు నమాత్యశేఖరుని కలసికొని వానితో నాతిలస్మ వృత్తాంతములను జెప్పియుండిన నదియొకవింత సంగతి గాఁజాలదు."

"మంచిది. ఎట్టిక్షతియుఁ గలుగదు. నేను రేపటిదినమచటికేగి యమాత్యశేఖరుని కలసికొందును."

"రేపటిదినమువగాదు. నేఁడే మీరు వాని సమక్షమున కేగి తగు కట్టుబాటులను గావింపుఁడు. ఆదుష్టయమాత్యునివలన బుత్తెంపఁబడిన చారులిచటికి తెంచిన నధికానర్థము సంభవింపక మానదు. తిలస్మకైజారు నాచేఁజిక్కియుండినను, దిలస్మరవ్వలనుబ్రేల్చి వందలకొలఁది మనుజులను తుదముట్టించు సామర్థ్యము నాకుఁ గలిగియుండినను, మృగాంకవతి యొసంగియుండిన తిలస్మకైజారు వారిలో నెవ్వనియొద్దనైన నుండుచో, వారిని నే నేమియుఁ జేయఁజాలను."

"అయినను నీమందిరములోనికి తెంచి నిన్నెవ్వరును బాధింపఁజాలరు."

"నిక్కువము. కాని, నేనెన్నిదినములదనుక నీమందిరమందుదాఁగి యుండఁగలను? ఆకలిదప్పికలనైన దీర్చుకొనవలసి యుండుఁగదా!"

"ఏవిధముచేతను మీకెట్టికష్టమును సంభవింపఁజాలదు."

"అయిననేమి? మీరిపు డమాత్యశేఖరునియొద్దకుఁ బోవుటకేమి యాటంకము గలదు? ఆతఁడు మీస్వరూపమును గాంచినతోడనే భీతిల్లక మానఁడు."

"అగుచో, నేనిపుడే యిచటినుండి వెడలిపోవలయుననియా మీఅభిప్రాయము."

"ఔను. తప్పక నేఁడే వెడలవలెను."

"మంచిది. నేనిపుడే పోవుచుంటిని."

ఇవ్విధంబునబలికి సాధుపుంగవుఁ డచటినుండిలేచి జుమేలియా వైపునకు దారిపట్టెను. అతఁడు చెట్లమఱుగునకుఁబోయి యామె దృష్టిపథమునుండి యదృశ్యుఁడగువఱకు మాయారాణి వానివైపున ననిమేషదృష్టిఁ బరికించుచుండెను. తదనంతరము మాయారాణి నవ్వుచు సులోచనవైపునకుఁ గాంచి యిటులఁబలికెను.

"నేనింతచలమూని సాధుపుంగవు నిచటినుండి వెడలఁద్రోలినహేతువెయ్యదియో నీవు గ్రహించితివా!"

"మీరిపుడేకార్యార్థమై వానిని జుమేలియా వైపునకుఁ బుత్తెంచియుంటిరో యదిగాక వేఱేమి కారణముండును!"

"(నవ్వి) అటులయిన నాయభిప్రాయము నాలింపుము. నేను సాధుపుంగవుని సమక్షమున నెంతటి వినయ విధేయతలను దుఃఖసంభ్రమములను బ్రదర్శించియుంటినో, నిజముగ నాకట్టి వేమియును లేవు. కారణం బేమన, నేనహోరాత్రము లెవని భీతిచే

దల్లడిల్లుచుంటినో-ఎవరు తప్పించుకొనిపారిపోవుచో, నాకమితభయ సంతాపములు గలుగుట సంభవమో— ఎవ్వాని ప్రకటనము నాకుమృత్యుహేతువో—ఎవనికిఁ జేఁజిక్కినఁ దన పగను దీర్చుకొనక నన్ను విడువకుండునో-అట్టి ముకుందసింహుఁ డిపుడు నాకరగతంబున గలఁడు. ఆహతకుఁడు సాధుపుంగవుఁడు వానిని జంప నీయఁడయ్యెనను విచారముదక్క నాకిపుడెట్టిచింతయులేదు. కాని, యిపుడు వాని ప్రాణములను గొనక నెట్లువిడువగలను? ఈకారణముచేతనే వాని నిచట నిలువనీయక దారిపట్టించితిని."

"సాధుపుంగవుఁ డిచటినుండి వెడలినపిదప నానిర్బంధితులను తుదముట్టింప వలయుననియా మీయభిప్రాయము."

"ఔను. నేనాయుద్దేశ్యముతోడనే వాని నిచటినుండి తొలఁగించితిని. అతఁ డిచటనుండినచో నాకార్యముల కడ్డుదగులుచుండును. ఆసాధుపుంగవుఁ డరుదెంచి యెట్టియుత్పాతములను గలిగించియుండెనో నీవును జూచితివిగదా! కానిచో,నేనప్పుడే వారినెల్లరను వినాశమొనరించి యిప్పటికి నిశ్చింతురాలనై యుందును."

"కాని, నిర్బంధితులను జెఱఁబెట్టియుంచిన మందిరపుఁదాళపుఁజెవిని సాధుపుంగవుఁడు మీకొసంగి యుండలేదు కదా!"

"నిక్కువము. దీనియందుఁగూడ సాధుపుంగవుఁడు దన చాకచక్యమును జూపియుండెను. మఱియుఁ గారాగృహమందిర మెవ్విధంబున దెఱవఁబడునో యారహస్యము నాకెఱింగించియుండలేదు. తాళపుఁజెవియు నాకొసంగఁడాయెను. సాధుపుంగవుఁడా నిర్బంధితులను, నేను ప్రవేశింపఁజాలని స్థానమందు బంధించుటకుఁ దలంచుచుండెనని తొలుతనే గ్రహించియుంటిని. తత్కారణముననే వారిని మందుగ్రాణమునకుఁ జేరియుండు తఖానాయందు బంధించియుంచుట కుద్బోధించితిని. ఆతఁడు నామనోగతాభిప్రా

యమును గుర్తింపఁజాలక నామాయావాగురఁజిక్కి తుదకు మోసపోయెను."

"మీవచనముల వలన నానిర్బంధితులను బంధించియుండిన తఖ్ఖానాలోనికి మీరు నిరాటంకముగాఁ బోఁగలరని వెల్లడియగుచున్నది."

"కాదు. నేనాస్థానమునకుఁ బోఁజాలను కాని, మందుగ్రాణములోనికి వెళ్ళగలను."

"(పకపకనవ్వుచు) సేబాను! ఇపుడు మీయభిప్రాయమును గ్రహించితిని. ఆమందుగ్రాణమునకు నిప్పంటించుటయే మీయభిప్రాయ......................................"

"ఔనౌను. నాయభిప్రాయమదియే! కారాగృహమొక్కటియేకాదు. ఈవిశ్రామ మందిరమునే విధ్వంసము గావించెదను. తుదకు నిర్బంధితుల యెముకలజాడనైనను జూపట్టరాదు. మంచిది. ఇవు డీకార్యమం దాలసించుట తగదు. లెమ్ము! నావెంటరమ్ము! మన మిచటనుండి చాలదూరము వెడలిపోయిన తరువాత నీమందుగ్రాణమునకు నిప్పంటుకొను యుక్తి నేపదార్థమునైనను దానియందుంచి రమ్ము."

"అదియొక గొప్పసంగతిగాదు. అటులనే కావించెదను."

౯.

నిన్నటిదినము సాయంతన సమయంబున సాధుపుంగవుఁడు జూమేలియా వైపునకు వెడలియుండెను. మఱియు నేఁటిసాయంకాలమునకు రెండుగంటలకాలము ముందుగనే యతఁడు మగుడివచ్చెను. ఆతఁడు గొంతదవ్వునుండియే తనవిశ్రామమందిరమునకుఁ దటస్థించియుండినదుస్థితిఁగాంచి తలనూపుచుఁ దనలోదానిట్లనుకొనియెను.

"మండుగ్రామమునకు దాపుననుండిన తఖ్ఖానాయందు నిర్బంధితులను బంధింపవలయునని మాయారాణి వచియించినప్పుడే నేనామె యభిప్రాయమును గుర్తించితిని."

మిగుల సుందరంబును విలాసప్రియులకు నివాసయోగ్యంబును నగు తిలస్మాధ్యక్షుని విశ్రామమందిర మగ్నిహోత్రుని కాహుతియై మొదలంట వినాశమొందియుండెను. దానిప్రాకారములు నేలఁగూలి యిటుకిటుకకు సంబంధములేక చెల్లాచెదరై యుండెనని చెప్పవచ్చును. సాధుపుంగవుఁడు నెమ్మదినెమ్మదిగా సమీపమునకుఁ బోయి చాలసేపటివఱకుఁ దానిని బాగుగ నిదానించి, "ఏదియెటు లున్నను నద్భుతమందిరముమాత్రము విధ్వంసము గాఁజాలదనుకొనుచు, నచటినుండి మరలెను.

తిధ్యలస్మాక్షుని విశ్రామమందిరము వినాశమొందిన కారణము మాపాఠకమహాశయులు గ్రహించియుందురు. కారణంబేమన, పైప్రకరణమందు మాయారాణీసులోచనల సంభాషణమువలన నా రహస్యము వెల్లడియై యుండెను. సాధుపుంగఁ డిపుడు మాయారాణిని వెదకి యామెతో రెండుమూఁడు మాటలను ముచ్చటింపవలెనను యాలోచనయందుఁ జిక్కుకొనెను. కాని, యమాత్యశేఖరునితోఁ గలసికొనుటకు సాధుపుంగవుని బుత్తెంచుసమయంబున మాయారాణి వెంటనుండిన పరిచారికలలో నొకతె యాకస్మికముగ వాని కందుఁ జూపట్టుటచే నతఁ డధికముగ శ్రమనొందు నగత్యము గలుగలేదు. సాధుపుంగవుఁ డాపరిచారికను జేరి, "మాయారాణి యిపు డెచటఁగల"దనిమాత్రము ప్రశ్నించెను.

"తమరు జామేలియా వైపునకు వెడలిన పిదప మాయారాణి మనస్సున కూఱటఁ గూర్చుకొను తలంపుతో మమ్ములను వెంటఁ దోడ్కొని యుడవియందు విహారింపనేగెను. ఆసమయంబున మా

యారాణి మానసంబున వనవిహారకౌతుకమును జనింపఁజేసిన యా దయామయుండగు పరమేశ్వరుని నెంత కొనియాడినను తీరదు. కానిచో మేమిప్పటికిఁ బరలోకమందుఁ బ్రాతకావులమై యుందుము. మేమటు లావనమందు సంచరించుచు నెలదవ్వాతిగియుందుము. అంతఁ "బెలుపెలు గుభేలుగుభేలు" మనుచు భయంకరశబ్దములు మాకు శ్రుతిగోచరంబయ్యెను. మే మెల్లరము దొట్రిపడుచు నామందిరముపైపునకుఁ బరుగిడి చూడ నచట భూపరాగధూమ్రము లవలన నంధకారమయంబుగ నుండెను. మేము మిక్కిలి బెగడొందుచు నచటినుండి దూదవ్వులకుఁ దొలఁగిపోయితిమి. తుద కామందిరమున కెట్టిస్థితిరయొదవియుండెనో దానిని మీరును బరికించియుంటిరికదా? ఇఁకఁ జేయునది తోఁచక నచట నిలుచుట యుచితము గాదనియు భావించి సులోచనవెంట మాయారాణి కాశీపురమున కేగియున్నది."

"మఱియు మాటలను గల్పించి నాకోర్కెకు సిద్ధించి రగులఁజేయుటకు నిన్నిచట విడచిపోయెనుగాఁబోలు."

"చి—త్ర—ము—ము—ము."

"చిత్రము యేమిటి? నిన్నిందులకే యిచట విడచిపోయియున్నది. నీవును యిచటినుండి వెడలిపొమ్ము. మఱియు మీ మాయారాణితో, "నీవు మిగుల శ్లాఘాపాత్రమగు కార్యమును గావించియుంటివనియు, నార్జవయుక్తుల కెన్నడైనను శుభము లభింపఁ గలదనియు దుష్పథగాములకు సుఖనిద్రఁ జెందుభాగ్యము చేకూరఁజాలదనియు వచియింపుము. కాదుకాదు. కొంచెము నిలువుము. నేనొక కమ్మను వ్రాసియిచ్చెదను. సాధ్యమగునంత శీఘ్రముగ మాయారాణిని గలసికొని దీని నామె కొసంగుము."

సాధుపుంగవుఁ డచటఁగూర్చుండి తనకక్షపాలనుండి సామానులను వెడలించి మాయారాణిపేర నొకజాబు వ్రాయనారంభించె

ను. అతఁ డాలేఖను వ్రాసి ముగించినపిదప దాని నాపరిచారిక నొ సంగి తానుత్తరదిశకు బయలుదేరెను.

అపరిచారిక సాధుపుంగవుని జాబును గైకొని కాశీనగరమున కేగుటయందును నాలేఖను మాయారాణి కొసంగుటయందును నెట్టిసందేహములేదు. కాని, మేము మిమ్ముల్లను వెంటఁదోడ్కొని యాపరిచారిక యచటకుఁ జేరుటకుమున్నె కాశీపురమునకుఁ జేరవలసియున్నది కావున నడువుఁడు. మాయారాణి వివిధాలోచనలఁ జిక్కి యెచటఁ గూర్చుండియుండెనో మనము కొంత పరికింపవలసియున్నది.

జాము రేయి గడచియుండెను. మాయారాణి కాశీనగరమందలి మోహినీమందిరమున జక్కఁగ నలంకరింపఁబడియుండిన యొక గదియందుఁ గూర్చుండి సులోచనతో సంభాషించుచుండెను. ఈ సమయంబున నాగదియందు మాయారాణి సులోచనలుదక్క నితరులెవ్వరును లేరు. ఆగదియం దొకవైపున నమర్చియుండిన సమున్నతాసనముపైఁ బఱచిన రమణీయ విశాలతల్పముపైఁ బచ్చని మొగమలుదిండుల నానుకొని మాయారాణి కూర్చుండియుండెను. ఆగద్దియకు క్రింద భూమిపై సుగంధతైల పరిపూర్ణంబగు దివ్వెయొకటి వెలుంగుచు నాగదియందు బాగుగఁ బ్రకాశమును గలిగించుచుండెను. నేటికి మూఁడునాల్గు దినములకుఁబూర్వము దురంత దుఃఖభయసంభ్రమంబుల వన్నెదక్కి కాంతిఁ జెడియుండిన మాయారాణి సుందరవదనసరోజంబున, నేఁడువిజయసూచకంబులగు చిహ్నములు దీపించుచుండెను. తాను గావించియుండిన ప్రశ్నమునకుఁ దన యిచ్ఛానుసారంబగు ప్రత్యుత్తరమును బడయునాశఁ బెదవులపై భావగర్భితములగు చిరునగవు రేఖలు చెంగిలింప నామె సులోచనవైపునకుఁ బరికించుచుండెను. అంత సులోచన యామెతో నిట్లనియెను:—

"ఇపుడు మీశిరమునుండి యొక గొప్పపీడ తొలఁగిపోయెననుట కెట్టిసందియమును లేదు. కాని, మీరిపు డెట్టియాపదలను బ్రతిఘటించు యుగత్వము గలుగదనిమాత్రము దలంపరాదు."

"ఔను. నేనిపుడు జుమేలియాసింహాసనముపై నధిష్ఠించుటకధికప్రయత్నములను గావింపక దీరదని నేను బాగుగ నెఱింగియుంటిని. కాని, నే నన్నింటికంటె దేనిని గురుతరవిపత్తుగఁ దలంచుచుంటినో యది యిపుడు దొలఁగిపోయెననుట నిర్వివాదాంశము గదా! అదురాత్మురాలగు మృగాంకవతియు నధికోత్పాతములను గలిగించియున్నది. ఆమె విజయేంద్రసింహుని పక్షమునఁ జేరకుండిన నెప్పుడో యారాకుమారు లిరువురను మరణనిద్రయందు జోకొట్టియుందును."

"నిక్కువము! నిక్కువము!!"

"మఱియు నెవని కీమందిరరహస్యములు దెలిసియుండుటచే దీనియందు నివసించువారికి నిశ్చింత గలుగకుండెనో యట్టి విశ్వాసఘాతకుఁడగు జటాశంకరుఁడును మృతినొందుట మేలయ్యెను. కాని, యాకృతఘ్నుఁడగు నమాత్యశేఖరున కెట్టి దుర్బుద్ధిపుట్టెనో చూడుము. అతఁ డొక్కమాఱుగ నాయెడల విముఖుఁడయి యుండుటయే కాక, నన్ను బంధించుటకుఁగూడ ప్రయత్నించుచున్నాఁడు."

"ఈ వేఁకరములన్నింటి కానకాబుపోషు లిరువురే కారణభూతులని నాయభిప్రాయము."

"నిక్కువము. మొదట నే నా నకాబుపోషు లిరువురు నెవరైనదియు, వారలెటు లాతిలస్మోద్యానములోని కేతెంచినదియుఁ దెలియక దురంతవిస్మయసాగరంబున మునింగియుంటిని. కాని, యిపు డాయిరువురిలో నొకఁడు ముకుందసింహుఁడని నాకు నిశ్చయమయ్యెను. మఱియు జగపతి రహస్యము వెల్లడియగుటవలన నమా

త్యశేఖరుఁడును సైనికులును నాయకులఁ దిరస్కారభావమును గలిగియుండుట నిక్కువము."

"నిక్కువము. నేనీవిషయమునే మీకు విన్నవింపఁదలంచుచుంటిని. ముకుందసింహ నరపాలుఁడు దనరూపమును ప్రజలకు జూపియే వారిని వశమొనరించుకొనియుండెను. మఱియు వారిని మీరెంతకాలమునుండియో రహస్యముగ బంధించియుంచిరని సైనికులకును యమాత్యశేఖరునకును నిశ్చయమైయుండెను. మంచిదిం గతమునకై యోజనయేల? మరల నరుదెంచి ప్రజలకుఁ దనమోముజూపుట ప్పుడు ముకుందసింహుని నామరూపంబు లడుగంటియుండెనుగదా! మనము గొన్నిదినములలో నతఁడు నిక్కువముగ ముకుందసింహుఁడు గాఁడనియు విజయేంద్రసింహ మహీపాలుని మైయారులలో నొకఁడనియు సిద్ధాంతీకరింపవచ్చును."

"నీపలుకులు మిక్కిలి ప్రశంసార్హములు. విశ్వాసఘాతకుఁడగు యమాత్యశేఖరుని రూపడంచుటగాని వానిని బంధించుటగాని నాకొక కఠిన విషయముగాదు. కాని, మఱియొకచింతమాత్రము నన్నిపుడు వేధించుచున్నది."

"అది యెట్టిది?"

"అమాత్యశేఖరుని చంపినగాని లేక బంధించినగాని, మన నరిహద్దులయందుఁ బ్రవేశించియుండిన శత్రుసైన్యమును వెంటనే ప్రతిఘటించు నవసరము మనకు ముఖ్యముగఁ గలుగుచున్నది."

"ఔను. మనసిపాయిలు మనపక్షమున పోరుదురను విశ్వాసము నాకించుకైనను లేదు. సైనికుల హృదయములనుండి ముకుందసింహనరపాలునిపైఁగల ధ్యానమును తొలఁగించు కార్యమొకటి రెండుదినములలో దీరునది కాదు."

" (కొంచెము యోజించి) ఏమి! నేనొక్కతనె విజయేంద్ర సింహుని సైన్యమును పలాయన మొనరింపఁ జాలనా?"

" అది మీకే తెలియవలెను."

" తప్పక! అటులొనరింపఁ జాలుదును. కాని, అకటా! నా ప్రియుఁడు జగపతి............................."

జగపతి నామము వినఁబడినతోడనే మాయారాణి నేత్రము లశ్రుపూరితములయ్యెను. సులోచన తన దుకూలాంచలముతో నా కన్నీటినొత్తుచుఁ గొన్ని ధైర్యవచనములను పలికి యామె నూరడించెను. ఆసమయంబుననే ద్వారము వెలుపలఁ జిటికెలను వైచుచుండిన సవ్వడి వారికి వినఁబడుటచే, నేపరిచారికయో యచటికేతెంచి యుండెనని భావించి సులోచన గట్టిగాఁ గేకలిడుచు, "లోనికి రావచ్చు"నని తెలిపెను.

అంత, విధ్వంసముగాఁబడిన తిలసాంధ్యక్షుని విశ్రామమందిర సమీపమున సాధుపుంగవునితోఁ గలసికొనిన పరిచారిక యాగదిలోనికేతెంచుచుండుట వారికిఁ జూపట్టెను. దానిచేతనే సాధుపుంగవుఁడు మాయారాణికొరకు లేఖను పుత్తెంచియుండెను. ఆపరిచారికను గాంచుటతోడనే మాయారాణి చైతన్యమై లేచి కూర్చుండి దాని వైపునకుఁ గాంచుచు, "ఏమే! నీకు మన సాధుపుంగవునితో సమావేశము గలిగెనా? యని ప్రశ్నించెను.

" చిత్తము. వారిదర్శనలాభము నాకుఁ గలిగినది."

" (నవ్వుచు) ఆతఁడు నాపై మిగులఁ గోపించియుండును! ఏమి! నిక్కువమేకదా?"

" ఔను. సాధుపుంగవుఁడు గోపోద్దీపితమానసుఁడై మిమ్మెన్నియో కఠినోక్తులఁ బలికియుండెను. నేనేమియు మాఱుపలుకక వానిదూషణవాక్యముల నాలించుచు నట్లెనిలచి యుంటిని. తుదకతఁడొక జాబునువ్రాసి నాకొసంగి, "దీనిని మీమాయారాణి

కొనంగు"మని పలికెను."

"అగుచో, నతఁడొక జాబును నీచేఁబుత్తెంచి యుండెనా?"

"చిత్తము. కైకొనుఁడు."

ఆపరిచారిక సాధుపుంగవుని లేఖను మాయారాణి చేతి యందిడెను. "మా చెడనుగాక! దీనియం దాసాధుపుంగవుఁడేమి చిత్రించియుండెనో"'యని పలుకుచు, మాయారాణియాజాబు సులోచనకొసంగి" దీనియందేమి లిఖించియుండెనో చదివిచూడు"మనెను.

సులోచన యాలేఖను చదువ నారంభించెను. ఆసమయంబున మాయారాణి చూడ్కి సులోచన మోముపైఁగలదు. సులోచన యాలేఖను సగముపఠకుఁ జదువునరికి మోముపై భయసంభ్రిమోదాసీనతలుదోను కాడసాగెను. దేహముకంపింపఁదొడంగెను. మాయారాణి యాభావస్ఫూర్తిఁగని తబ్బిబ్బుపడుచు, "దానియందలి వృత్తాంతమేమి? వేగమె వచియింపు"మని మిగులఁ దొందరగా నామెను ప్రశ్నించెను.

దానికిఁ బ్రత్యుత్తరమందు సులోచన నిట్టూర్పులఁబుచ్చుచు, నాలేఖ మాయారాణి సముఖమందిడి,"అయ్యో! దీనిని సాంతముగఁ జదువుటకు ధైర్యము చిక్కకున్నది. అహాహా! ఎంతటి నిపుణుఁడగు రైతుసూర్దుఁడైనను విజయేంద్రసింహుని మైయాగులతో నెదిర్చినిలచుట యవివేకముగాకుండునా? అనెను.

మాయారాణి సంభ్రమాయత్తచిత్తయగుచు నాజాబునుదీసి స్వయముగఁ జదువనారంభించెను. ఆమెయు నాలేఖను సకముకంటె నధికముగఁ జదువఁజాలదయ్యెను. దేహమందెల్లెడలఁ జిరుచెమ్మట లావరించెను. తనూలతకంపింపసాగెను. తలదిరుగ నారంభించెను. తుదకామె యెత్తైలంగునను తన్నుసంబాళించుకొనలేక మూర్ఛాగతయై భూమిపైఁ గూలెను.

## ౧౦.

మేమిచటఁ దిలస్మవృత్తాంతము గొలఁదిగ లిఖించుట సముచితముగఁ దలంచుచుంటిమి. కుమారమహేంద్రసింహుఁడు దనయనుంగు సోదరుఁడగు నరేశసింహుని కలసికొనుతలంపుతో మృగాంకవతి రూపవంగియుండిన తిలస్మాకైజారు సమేతముగ నానూతియందు దుముకుట మాపాఠకమహాశయులకు జ్ఞప్తికలిగియుండును. కుమారమహేంద్రసింహుఁడా తిలస్మాకైజారును నూతిలోనికునిచి, పిడినొక్కుటతోడనే దానినుండి వెడలిన ప్రకాశమువలన నాకూపమందలి సకలవిషయములు వానికి బాగుగఁ జూపట్టసాగెను. ఆనూతికైవారము పైభాగమునకంటె నడుగుతట్టున బాగుగ వైశాల్యముగలిగియుండెను. దానియం దొకవైపున నొకమనుజుఁడు గ్రిందఁబడియుండుటయు, వానినడచిపట్టి మఱియొక మనుజుఁడు వానిపైఁగూర్చుండి తనచేతియందలి కైజారుతో వానికుత్తుకయందుఁ బొడుచుటకు సంసిద్ధుఁడై యుండుటయు నతఁడు గాంచెను.

కుమార మహేంద్రసింహుఁ డాహత్యాకాండము దన యనుంగు సోదరుఁడగు నరేశసింహునిపైఁ దొడరుటలేదుకదాయని శంకించుచు, నాలసించిన వానికెట్టి దుర్గతియేనియు సంభవింపవచ్చునన్న జగదువ నచటనొక ముహూర్తకాలమేనియు నిలువనోపక, వెనుముందులారయక, నెవరితోనేమియుఁబలుకక, నిజసహోదరవాత్సల్యప్రేరితుఁడై తటాలున నానూతియందు దుమికెను. మఱియు నాకూపమం దడుగుభాగమున భూమివలెఁ జూపట్టు చుండినయొక యినుపరేకుపయిఁ దాను పడినటుల గ్రహించుకొనెను. కారణంబేమన, కుమార మహేంద్రసింహుఁ డానూతియందు దుముకుటతోడనే యాభూగర్భభాగమొక విధంబగుధ్వనితో రెండుమూఁడుమారులు

క్రిందిమీఁదుల కట్టూఁతలూఁగెను. వానిచేతియందుఁదిలస్మకైజారు ప్రకాశించుచుండెనుగదా! దానిప్రకాశమందుఁ దానేహర్మ్యాకాం డమును పరికించి యానూతిలోనికి దుమికియుండెనో, యామనుజు లిరువురు శిలావిగ్రహములని యతఁడు వెంటనే గుర్తింపఁగలిగెను. ఆసమాచారము మృగాంకవతీముకుందసింహుల కెఱింగించు నుద్దే శ్యముతోఁ గుమార మహేంద్రసింహుఁడు శిరము పైకెత్తి కాంచు వంత నాకూపముఖద్వారము బంధింపఁబడి యుండుటచే నిరుపా యుఁడై మిన్నకుండెను. ఆబావి యెత్తువైపునకు నిదానించుటవలన నాముఖద్వారము బంధింపఁబడి యుండలేదనియు మధ్యభాగ మునుండి యేదియో యొకపదార్థము వెడలివచ్చి దానిని గప్పియుం చెననియు నతఁడు భావించెను.

కుమార మహేంద్రసింహుఁడు దనచేతియందలి కైజారు ప్రకాశమును దొలఁగించి దానిలోని కెచటినుండియేనియు వెలుతు రు ప్రవేశించుచుండెనో లేదో యను విషయమును దెలిసికొను నభి ప్రాయముతో నాతిలస్మకైజారు పిడిని నడల్చి వ్రక్కకొనెను. వెంట నే యాస్థానమందు గాఢాంధకారము వ్యాపించెను. కుమారమహేం ద్రసింహుఁడు నిరుపాయుఁడై యాతిలస్మకైజారు పిడిని నొక్కి మర లఁ బ్రకాశమును గలిగించెను. ఆప్రకాశమందుఁ దన యనుంగుసో దరుఁడు దానియం దెచటనైనను పొడకట్టఁగలఁడను నాశ నలుదెస ల బాగుగ నిదానించి చూచెను. కాని, దానియం దొకతావున నొక కావ్యమంజూషముదక్క నితరమేమియు వానికిఁ జూపట్ట కుండెను. ఆస్థానమునకు మూఁడుతట్టుల సుదృఢములగు ప్రాకార ములు గలవు. వానియందుఁ గొన్ని ద్వారములు చూపట్టుచుండెను. నాల్గవవైపున నొక సురంగమార్గము గలదు. కుమార మహేంద్ర సింహుఁడు కింకర్తవ్యవిమూఢుఁడయి యాసురంగము ననుసరించి

ముందునకు బయలుదేరెను. అతఁడు ముందువైపునకుఁ బోవుచుం
డిన కొలఁది నాసురంగమార్గము సంకీర్ణమగుచుండెను. మఱియుఁ
దానొక యెత్తైన ప్రదేశముపై నెక్కి పోవుచుండినటుల నాసికిఁ
దోఁచుచుండెను. అతఁడు దాదాపు నూఱుమూరలదూరము వెడలిన
పిదప నాసురంగ మంత మొందెను. దాని తుదియం దొకద్వారము
గలదు. అది యొకదృఢమగు శృంఖలమువలన బంధింపఁబడి బీగము
వేయఁబడియుండెను. కుమార మహేంద్రసింహుఁడా గొలుసును
తిలస్మాకైజారుతో ఖండించెను, మఱియు దానికవాటముపై సత్త్వ
కొలఁది కాలితో మోది యాద్వారమును తెఱచెను. తోడనే యె
దుటిభాగమునుండి యాసురంగములోనికి బాగుగఁ బ్రకాశము
వ్యాపించెను. ఇఁకను తిలస్మాకైజారు యవసరము లేకుండుటచే నతఁ
డు దానిపిడిని నడల్చి వట్టుకొనెను. మఱియు నాద్వారమునుదాఁటి
యొక పచ్చని తోఁటయందుఁ బ్రవేశించెను. ఆతోఁట మామూలు
తోఁటవలెగాక వేఱువిధంబుగ నుండెను. దానినిర్మాణము విచిత్ర
రీతిని గలదు. ప్రతి వృక్షమునకు నలువైపుల రెండుమూరలెత్తుగల
గోడలు గలవు. వానియం దిపుడు మట్టి పూడియుండుటవలన నవి
యొకవిధంబగు తిన్నెలవలెఁ గాన్పట్టుచుండెను. ఆతిన్నెలుగల ప్రదే
శముగాక మిగత భూమియంతయుఁ జలువరాళ్ళతోఁ గప్పఁబడి
యుండెను. తూర్పుదెసనుండి యొక చిన్నప్రవాహ మావనములో
నికిఁ బ్రవహించుచుండెను. మఱియు నాప్రవాహ మాతోఁటలోనికిఁ
బదునైదు మూరలవఱకుఁ బ్రవహించిన పిదప నచటినుండి చిన్న
చిన్న పాయలుగఁ జీలి యాతోఁటయందంతటను వ్యాపించియుం
డెను. ఆశాఖలకు రెండుతట్టులఁగల గోడలు చంద్రకాంతశిలలతోఁ
గట్టఁబడియుండెను. కాని, యడుగుతట్టున మట్టి భూమిగలదు.
తత్కారణంబున నచటిభూమి నిరంతరము తేమగలిగి వృక్షము

తెండి పోఁకుండగ సంరక్షించుచుండెను. ఆవనమునకు నలు వైపుల మిగుల నెత్తైన ప్రాకారములు గలవు. తూర్పువైపున నొక వసారాయు రెండుగదులును గలవు. పశ్చిమదిశ గోడనమీాప మున మిగుల సంకీర్ణంబగు బావి యొకటి గలదు. మఱియు నావన మునకు మధ్యభాగమున నొకసుందరంబగు దేవమందిరమునుగలదు.

కుమార మహేంద్రసింహుఁ డావృక్షములనుండి కొన్ని ఫల ములను గోసి భుజించెను. మఱియు నచటి ప్రవాహమందలి నిర్మ లోదకమును ద్రావి తృప్తిపాసల నడంచుకొనెను. తదనంతర మా వనమం దిటునటు సంచరించుచు నచటి విశేషములను పరికింపసా గెను. వానిని తన యనుంగుసోదరునిచింత యుగ్గలముగ బాధించు చుండుటచే వాని నెవ్విధంబున్ననైన వెదకి కలసికొనుటకుఁ గోరు చుండెను.

నలువైపులఁ జుట్టిచూచిన పిదప నారాకుమారుఁ డాతోఁట మధ్య నొప్పుచుండిన దేవళమందుఁ బ్రవేశించెను. ఆసుందిరము మిగులఁ జిన్నది. దానియెదుట నొక సభామండపమును గలదు. ఆ మండపమందు నలుగురైదుగురు మనుజులు గూర్చుండుటకుఁ దగిన స్థానముమాత్రము గలదు. దానియందు శివలింగముగాని విష్ణు విగ్రహముగాని యుండు (గర్భగదియందు) స్థానమున నొకతిన్నె గలదు. దానిపై మేషరూపమున నొప్పుచుండిన యొక విగ్ర హము గలదు. అతఁడు దానిని బాగుగఁ బరిశీలించి వెలుపలకు వెడలిపోయెను. మఱియు నాసభామండపమున గూర్చుండి రిక్తగ్రం థమును దెఱచి చదువనారంభించెను. ఇపుడు వాని కాపుస్తకమం దలి సకలవిషయములు బాగుగ బోధపడుచుండెను. క్రమముగఁ జీఁకటి వ్యాపించుచుండినను దానియందలి యక్షరములు జూపట్టు చుండినంతవఱకుఁ జదువుచునే యుండెను. తదనంతరము బాగుగఁ

జేఁకటి వఱుటచేఁ బుస్తకమును మూసిపైచి దానిని జతన పఱిచెను. మఱియు నామండపమందే వసుండి యిపు డేమిసేయవల యునని యోజింపసాగెను.

ఆతోఁటయందుఁ గుమార మహేంద్రసింహునకు రెండుది నములు గడచెను. ఈయంతరమం దతఁడు దన సహోదరుని వెతకి వానిజాడ గనిపెట్టుటగాని, యీతోఁటనుండి వెలుపలకు వెడలుట గాని, తిలస్మఖండమందుఁ బ్రవృత్తుఁడగుటగాని, వానివలనఁ గాఁజాలదయ్యెను. ఆరెండుదినములలోపల నతఁ డారిక్తగంథమును దుదముట్టఁ జదివి దానియందలి సంగతులను బాగుగ గ్రహించి యావిషయములన్నింటిని దనమనస్సునం దచ్చొత్తినటుల బాగుగ జ్ఞప్తియం దుంచుకొనెను. ఇపు డాపుస్తకము దోడ్పాటక్కఱలేకయే తిలస్మరహస్యములన్నియు వానికిఁ గరతలామలకములై యుండెను. మఱియు నతఁడు దన్ను తిలస్మమును ఖండించుటకుఁ దగినవానిగఁ దలంచుచుండెను. ఇఁక నాహారపానీయముల కాతోఁటయం దెట్టి కొఱంతయు లేదుగదా?

మూఁడవనాఁడు రెండుజాములవేళ గడచిన పిదపఁ దిలస్మ ఖండనమందుఁ బ్రవృత్తుఁడగు తలంపుతోఁ గుమార మహేంద్రసిం హుఁ డాదేవళమందలి తిన్నె వయిఁ గూర్చుండియుండిన మేషము నొద్దకు బోయి చేరెను. అచట నతఁడు దనసామర్థ్యమునంతయు వెచ్చింపవలసివచ్చెను. కుమార మహేంద్రసింహుఁ డామేషముపైఁ దనచేతులు రెంటిని వైచి మరనఁ ద్రిప్పునటుల బలపూర్వకముగ దానిని వెనుకపైపునకుఁ ద్రిప్ప నారంభించెను. కొన్నిమాఱు లటులఁ ద్రిప్పినపిదప నామేష మాయరుగునుండి వేఱుపడెను. మఱియు భూమిలోనుండి యొకవిధంబగు ధ్వని వెడలనారంభించెను. రాకు మారుఁ డాగొప్పవిగ్రహము నొకపైపున నునిచి యామందిరము

నుండి వెలుపలకు వెడలిపోయెను. మఱియు నిపు డేమిసంభవించు
నోయని యావైపునకుఁ జూడనారంభించెను. ఒకగంట కాలము దనుక
నాధ్వని సరాసరిగా వెడలుచునేయుండెను. తదనంతరము క్రమక్రమ
ముగా సద్దణగి తుదకాధ్వని నిలిచిపోయెను. రాకుమారుఁడు మరల
నా దేవళమునందుఁ బ్రవేశించి, గొప్ప కూర్చుండియుండిన తిన్నె యా
భూమిలోనికి దిగిపోయియుండుటఁ గనుగొనెను. దానిలోనికి దిగుట
కుఁగొన్ని మెట్లు నిర్మింపఁబడియుండెను. కుమారమహేంద్రసిం
హుఁడు నిర్భయముగ నామెట్లపైనుండి దానిలోనికిదిగెను. అచట
నంధకారము బాగుగ వ్యాపించియుండుటచేఁ దిలస్మాకైజారు పిడి
నొక్క ప్రకాశమును గలిగించి నలువైపులకుఁ బరికింపసాగెను. అది
యొక గదివలెనుండెను. దాని విరివి యిరువదిమూరలును యిరువది
యైదుమూరలుకంటె నధికముగ పొడవును గలిగియుండెను. నలు
వైపు గోడలయందుఁ జిన్నచిన్న ద్వారములుగొన్ని కలవు. ఆద్వా
రములన్నియు బంధింపఁబడియుండెను. ఆగదికి నాలుగుమూలల
యందు నాలుగు ఱాతివిగ్రహములు గలవు. అవి నాలుగును యా
కారప్రకారములయం దొక్క మాదిరిగనే యుండి యొక్కతీరుననే
నిలిచియుండెను. ఇఁక వానియందు గలిగియుండిన భేదమేమన, నొక
విగ్రహముచేతియందుఁ గైజారుగలదు. తక్కినవిగ్రహములు మూ
డింటిచేతులయం దేపదార్థమును లేదు. రాకుమారుఁడు మొదటఁ
జేతియందు గైజారుగల విగ్రహముచెంతకుఁ బోయి దాని యెడమ
చేతివైపునకు బాగుగ నిదానించి చూడసాగెను. వ్రేలియం దొక
యుంగరము గలదు. కుమారమహేంద్రసింహుఁ డాయుంగరమును
తీసికొని తనవ్రేలియందుఁ దొడుగుకొనిన పిదప నావిగ్రహపు గుడి
చేతియందుఁగల కైజారుఁ దీసికొని దానిని తనమొలయం దుంచు
కొనెను. మఱియుఁ దనలో దానిటులఁ దలపోయసాగెను:—

" ఆహా! ఈతిలస్మమం దిట్టి తిలస్మకైజారులేనిదే నిక్కువముగ నేకార్యమును నడువఁజాలదు. మంచిది! నాయనుంగు సోదరుడు నాకుఁజూపట్టినతోడనే దీనిని వానికొసంగెదనుగాక."

కుమారమహేంద్రసింహుఁడు విగ్రహముచేతినుండి తీసికొనినకైజారును మృగాంకవతి వానికొసంగియుండిన కైజారును నొక్కవిధంబగునవియే. వానిరూప గుణాదికములందెట్టి న్యూనాధిక్యములునులేవు. ఈసమయంబున రాకుమారుఁడొనరించుచుండిన సమస్తకార్యములు వానిరహస్యముల నెఱుంగక తన యిచ్చవొప్పనగావించుచుండెనని తలంపరాదు. రక్తముచే వ్రాయఁబడిన తిలస్మగ్రంథమందలి సంగతులను గ్రహించియు, దనవిమలబుద్ధినావిషయములను విమర్శించియు యథావిధిగా నాకార్యములన్నింటినిఁ జేయుచుండెను. ముందుగూడ నిట్టి విధంబుననియే మాపాఠకులు గ్రహించెదరుగాక! ఇపుడారాకుమారుఁడు నలువైపుల గోడలయందుఁ జూపట్టుచుండిన ద్వారములవైపునకు నిదానించి చూడసాగెను. ఆద్వారములలో నాలుగుమాత్రముగాక మిగత ద్వారములన్నియుఁ గృత్రిమములు. అనఁగా, మిగతద్వారముల యానవాళ్ళుమాత్రమాగోడయందుఁ జూపట్టుచుండెను. వానినిగాంచిన మానవుఁడవియు ద్వారములని భ్రమించి పూర్ణరూపంబున వంచింపఁబడునట్టులుండెను.

కుమారమహేంద్రసింహుఁడు మొదట తూర్పువైపుద్వారమునొద్దకుఁబోయిచేరెను. అది నిజమైనద్వారము. అతఁడు బలపూర్వకముగ దానికవాటముపైఁ దనకాలితోఁదన్ని దానిని తెఱచెను. అటుపిమ్మట నెడమవైపు మూలనుగల విగ్రహముచెంతకుఁబోయి తనశౌర్యాంలంబున దానినినదిమిపట్టి యాస్థానమునుండి దానిని వెడలించుటకుఁగోరెను. కాని, యతఁడటులఁ గావింపఁజాలఁడయ్యెను. కారణంబేమన, వానిదక్షిణకరమందుఁ బ్రకాశించుచుండిన తిలస్మ

కైజారు గలుగుకదా! తుదకతఁడా కైజారునుగూడ తనమొలయం దుఁజతనపఱచుకొనెను. తోడనే యాగదియందు గాఢాంధకారము వ్యాపించెను. రాకుమారుఁడావిషయమును గొంచమైనను లెక్కసే యక నాకాలుచీఁకటి యందుఁదన రెండుచేతులలోనికి నావిగ్రహ మును చిక్కించుకొని బలమంతయు నుపయోగించెను. మఱియు దానిని భూమినుండి వెడలించి, తాను తెఱచియుంచిన తూర్పువైపు ద్వారముచెంతకుఁబోయి నిలచెను. అతఁడా విగ్రహమును తనచేతు లలోనికిదీసుకొని సత్తువకొలఁది నాద్వారములోనికి విసరివైచెను. మఱియు వెంటనే తిలస్ముకైజారును జేతధరించి ప్రకాశముగలిగించి, మెట్లమార్గమున నామందిరమునుండి వెడలి యావనమందుఁ గొంత దవ్వునకుఁబోయి నిలచెను. కొంతసేపయిన పిదప నచటభూమికంపిం చుచుండినట్టులను దానియడుగుభాగమున ననేకబండ్లు పరుగిడుచుం డినట్టులను గొప్పధ్వని వానికిదోఁచెను. కొంతవడి కాభూమికంపించు టయు, నాబండ్లుపరుగిడుధ్వనియు, క్రమముగాతగ్గి నిలచిపోయెను. తదనంతర మారాకుమారుఁడు మరల నామందిరమందుఁ బ్రవేశించి మెట్లమార్గమున మొదటతానే గదిలోనికి వెడలియుండెనో యాస్థా నమునకుఁ బోయిచేరెను. ఇపుడచటఁ దిలస్ముకైజారు వెలుతురెంత మాత్ర మవసరము లేకుండెను. మొదట నామరూపములయిన జూప ట్టని చిన్నచిన్నరంధ్రములనుండి దానిలోనికి వెలుతురు బాగుగవ్యా ంచుచుండెను. రాకుమారుఁడు దృష్టిసారించి నలుదెసలఁ బరికిం చెనుగాని, వానికందేక్రొత్త విషయమును జూపట్టదాయెను. తుదక ఁడు దేనికవాటమును గాలితోఁదన్ని తెఱచియుండెనో, మఱియు కనిలోనికి బలపూర్వకముగ నావిగ్రహమును విసరివైచియుండెనో యాద్వారముచెంతకుఁబోయి నిలచెను. ఈసమయంబున నాగది యందుబాగుగఁ బ్రకాశముగలిగియుంటచే దానియందలి ప్రతివస్తు

వును స్పష్టరూపంబున జూపట్టుచుండెను. ఆగది యంత విశాలమైనది కాదు. కాని, గోడలయందుఁ దెఱవఁబడియుండిన చిన్న చిన్న ద్వారములుగొన్ని పొడకట్టుచుండెను. దానివలన నచటినుండి యన్నివైపులకుఁ బోవుటకు మార్గములుగాని సురంగములుగాని కలిగియుండునని తోఁచుచుండెను. రాకుమారుఁడాగదిలోనికి విసరివైచిన విగ్రహము వైపునకు నిదానించి చూడసాగెను. సున్నపుగుల్లపై జలమును చిలుకరించిన దానికెట్టిస్థితియొదవునో యట్టివిధంబుననే యావిగ్రహపు స్థితియుఁగలదు. ఆవిగ్రహము చెడి మగ్గియుండెను. దాని యుదరమందు మెఱయుచుండిన పదార్థమొకటి చూపట్టుచుండెను ఆపదార్థము పూర్వమావిగ్రహపు టుదరమందుండి యిపుడది విచ్చి పోవుటవలన బయల్పడియుండెను. రాకుమారుఁడా మెఱయుచుండిన పదార్థమును దీసికొని యాతఖ్ఖానానుండి వెలుపలకు వెడలి యామందిర సభామండపములోనికిఁబోయి కూర్చుండి యిపుడేమిసేయవలెనని యోజింపసాగెను.

కొంతసేపటి కొకవిధంబగు చప్పుడు వెడలివచ్చుటచే నామందిరపు తఖ్ఖానామెట్లపై నెక్కి యెవ్వరో వెడలి వచ్చుచుండినటుల వానికిఁదోఁచెను. అతఁడావైపునకుఁ దదేకదృష్టిఁ జూడఁదొడంగెను. అంత నాకస్మికముగఁ గుమారనరేశసింహుని రూపము వానికిఁ జూపట్టుటచేఁ బట్టరానిసంతసముతో మహేంద్రసింహుఁడు లేచినిలచెను. వానినేత్రములనుండి రెండుమూఁడు ప్రేమాశ్రుబిందువులు జారిపడెను. కుమారనరేశసింహుఁడు పరుగిడివచ్చి తనసహోదరుని పాదములపై నొఱిగెను. కుమారమహేంద్రసింహుఁ డధికప్రీతి వానిని లేవనెత్తి కౌగలించుకొనెను. అన్నదమ్ములిరువురు సంతోషపూర్వకంబుగ నచటఁగూర్చుండి సంభాషింపఁదొడంగిరి. మహేంద్రసింహుఁడు తనయనుంగు తమ్ముని దెసఁబరికించి సోదరా! నీవెట్టియాప

దలఁ జిక్కుకొంటివి? మఱియు నెవ్విధంబున విముక్తిలాభమును బడ సితి"వని ప్రశ్నించెను. కుమారనరేశసింహుఁడు దానాతిలస్మమందుఁ జిక్కిన విధంబును పొందియుండిన కష్టములను తనయన్నయగు మహేంద్రసింహునితోఁ జెప్ప నారంభించెను.

ఈసోమ్మోద్యానపు నాల్గవతరగతి తోఁటయందుఁ గుమార నరేశసింహుఁడు దనయన్నయగు మహేంద్రసింహుని వీడ్కొని యినపగుండ్లు వ్రేలాడుచుండిన తిలస్మమందిరములోని కేగుటయు, కౌప్యమంజూషమందుఁ జేయిఁ జొనుపుటవలన దానియందు దతఁడు చిక్కుపడుటయు మున్నగు విషయముల నిచటఁ బునరుక్తిగావించి పాఠకుల యమూల్యసమయమును వృధాపుచ్చుటకు మేము గోర ము. కుమార నరేశసింహుఁడు తదుపరివృత్తాంతములను తనసోద రునితో నేమి వచియించియుండెనో వానినిమాత్రి వించట లిఖం చుట యావశ్యకముగఁ దలంచుచుంటిమి.

నరేశసింహుఁ డివ్విధంబున జెప్పఁదొడంగెను:—

"నాకర మామంజూషనుందుఁ జిక్కుటచే దానిని విడిపించు కొనుటకుఁ బెక్కుభంగుల ప్రయత్నించియు విఫలమనోరథుఁడ నైతిని. కొన్నిగంటలకాలము వఱకు నే నట్టిస్థితియందే దానియందుఁ జిక్కియుంటిని. తదనంతరము నకాబువలన మోమును మఱుగు పఱచుకొనిన యొకమనుజుఁడు నాచెంత కేతెంచి, "భీతిల్లవలదు. మఱికొంతసేపు తాళియుండుఁడు. నేను మిమ్ము విడిపించుటకుఁ బ్రయత్నించెద"ననెను. ఆసమయంబుననే నేను నిలచియుండిన స్థానము గదలనారంభించెను. మఱియు నామందిరమంతయుఁ బలువిధం బులగు ధ్వనులతోఁ బ్రతిధ్వనింపసాగెను. నేను నిలచియుండిన భూమికి దిగువభాగంబున వందలకొలఁది బండ్లు పరుగులాడుచుండిన టుల నాకుఁ దోచెను. నాసమీపమున కేతెంచిన యామనుజుఁడు

నాతో, "మిగుల ప్రమాదమాయెను. కుమార మహేంద్రసింహ మృగాంకవతులీమందిరద్వారమునొద్ద నేమియో యుపద్రవములను గలిగించుచున్నటుల దోఁచుచున్నది. వారలటులఁ గావించుట యుచితముకా"దని పలికి పైభాగమందలి మిద్దెపైకి వెడలిపోయెను. కొంతసేపయినపిదప నతఁ డచటినుండి మరలివచ్చి తిన్నఁగాఁ గ్రిందిభాగమునకు వెడలిపోయెను. మీర లాద్వారముచెంత నుండిరనియు, నతఁ డామందిరద్వారమును దెఱచి మిమ్ములను గలసికొనుటకుఁ బోయియుండెననియు, నేను తలంచితిని."

"ఔను. నే నాసమయంబున ద్వారముచెంతనే కలను. మఱియు నావెంట మృగాంకవతీరాజేశ్వరులును గలరు. మంచిది. తదుపరివృత్తాంతమును వివరింపుము!"

"అగుచో, మీ రాద్వారమునొద్ద నేకార్యాచరణమేనియుఁ గావించియుంటిరా?"

ఔను. ఆసమాచారమంతయుఁ బిదప నెఱింగించెదను. తొలుత నీవృత్తాంతము నెఱింగింపుము."

నరేశసింహుఁడు మరల నివ్విధంబున జెప్పఁదొడంగెను:—

ఆమనుజుఁడు క్రిందిభాగమునకు వెడలి యొకపావుగడియ కాలమైనను గడచియుండడు. అంత నొక్కమాఱుగ భూమియంతయు నతివేగంబున గంపింపసాగెను. మఱియు నారౌప్యమంజూషము నన్నుగొని భూమిలోనికిఁ దిగిపోయెను. ఆసమయంబుననే నాచేయి యామంజూషమునుండి విడిపోయెను. నే నాపెట్టెను విడచి యిటునటుఁ దడవులాడ నారంభించితిని. కారణంబేమన, నచ్చోట గాఢాంధకారము వ్యాపించియుండెను. గోడ లెచటఁగలవో, వెలుపలకుఁబోవుమార్గ మెయ్యదియో యేమియుఁ దెలియకుండెను. ఆ మంజూషసహితముగ నే నచటినుండి భూగర్భభాగమునకుఁ దిగి

వచ్చితినో, యాస్థానము వైపునకు దృష్టినిగుడ్చి చూచితిని. కాని, యేమియు గోచరింపదాయెను. నిరుపాయుఁడనై నేనొక వైపునకు దారి పట్టితిని. తిన్నఁగా వెడలుటకుఁ దలంచితిని. కాని, సరియైన మార్గము నాకు లభింపదాయెను. ఒకప్పుడు పాదములకు రాళ్లుతగిలి క్రిందఁ గూలుచుంటిని. ఒకప్పుడు గోడకుఁ దగులుకొనుచుంటిని. మఱియొకతఱి పాకారము నానుకొని ముందునకు నడవవలసివచ్చుచుండెను. ఇవ్విధంబున దుఃఖితుఁడనై వెనుకవైపునకు మరలుటకుఁదలంచితిని. కాని, ఒక్కమాఱుగ నాదేహమందు మిక్కుటంబగు తాపము దోఁచి పెక్కువికారములకు లోనగుచుండుటచే నిరుపాయుఁడనై ముందువైపునకే పోవలసినవాఁడనగుచుంటిని. నే నవ్విధంబున ముందువైపున కేగుచుండినను నే నధికదూరము వెడలుటలేదనియుఁ జుట్టు తిరిగి వచ్చుచుంటిననియు బాగుగ గ్రహింపఁగలిగితిని. ఏమిసేయుదును? వివశుఁడను. నాబుద్ధి కొంచెమైనను పనిచేయదయ్యెను. అది పగలో రాత్రియో లేక ఉదయమో, సాయంకాలమో, యది యేదినమో లేక మఱుచటిదినమో తెలిసికొనుట మిక్కిలి దుస్సాధ్యమయ్యెను. ఇట్టి యిక్కట్టులయందుఁ బది యెనిమిది జాములు గడచియుండునని తలంపవచ్చును. ఒకప్పుడు నాజీవితమందు నిరాశ జనించును. మరల నప్పుడే సోదరవాత్సల్యపరిపూరితహృదయులగు మీరు నన్ను విడిపించుటకుఁ బ్రాణపణంబున బ్రయత్నింపక మానరను నాశ, నాయుల్లంబున నుదయించుటచే ధైర్యము గలుగుచుండెను. ఇంతలో నేనొక తెఱచియుండిన ద్వారములోపలఁ బాదమిడినటుల నాకుఁ దోఁచెను. ఆద్వారముననో లేక రెండవద్వారముననో వేఱొక గదిలోనికిఁ బోవు భాగ్యము నాకుఁ గలిగెను. కాని, దానినుండి విముక్తిబడయుమార్గము గోచరింపకుండెను. తుద కాగదియందు మూర్ఛాగతుఁడనై భూమిపై గూలి

తిని. ఆకలిదప్పికల బ్రాణములు వెడలిపోవుటకు సంసిద్ధము చుండెను. ఇట్టి దారుణావస్థయందుఁ గూడఁ గొన్ని గడియలు గడ చెను. తుద కొకగంటకాలము గడచిన పిదప నాచెవుల కొకధ్వని వినిపించెను. దానివలన నేను పడియుండిన గదికి బ్రక్కగది తలుపు లెవ్వరో తెఱచినటుల నాకుఁ దోఁచెను. వెంటనే నాకు మిాజ్ఞప్తి గలిగినది. కొంతసేపటికచటిభూమి కంపింపఁదొడంగెను. మఱియుఁ బలువిధంబులగుధ్వనులు నావీనులకువినిపింపఁదొడంగెను.తుదకొక్క మాఱుగ నాగదియందు వెలుతురు ప్రవేశించెను. నే నాప్రకాశ మును గాంచుటతోడనే నామేనందుఁ బ్రాణములు వచ్చిచేరెను. ఎట్టులనో యతికష్టంబున లేచి యెట్టయెదుట ద్వారము తెఱవఁబడి యుండుట గనుంగొని ప్రమోదభరితమానసుఁడనైతిని. మఱియు వేఱొకగదిలోనికిఁ బోయి చేరితిని. ఆగది ద్వారమునొద్ద నొక శిలావిగ్రహము పడియుండుటఁ బరికించితిని. ఆవిగ్రహపుదేహమం తయు నున్నపుగుల్లవిధంబున ముగ్గియుండెను. తదనంతరము నేను మూఁడవగదిలోనికిఁ బ్రవేశించితిని. దానియందు మెట్లు కట్టబడి యుండుటచే వానిపై నెక్కిపోవుచు మిాసమిాపమునకు వచ్చిచేరితిని.

కుమార మహేంద్రసింహుఁడు తన యనుంగుసోదరుని విప దావస్థ నాలించి మిక్కిలి జాలినొందుచు, “నిచట ఫలంబులకును నిర్మలోదకమునకును గొఱంతలేదు. మొదట నీవు కొంత భుజించి కడుపు చల్లార్చుకొనుము. తదుపరి నావృత్తాంతమంతయు నీకు వివ రించి తెలిపెద”ననెను.

సహోదరు లిరువురు నచటనుండి లేచి సంతోషపూర్వక ముగ ఫలవృక్షములచెంతకుఁ బోయి పరిపక్వంబులును స్వాదిష్టంబు లునగు ఫలములను గోసి మెసవనారంభించిరి. నరేశసింహుఁడు మిక్కిలి యాఁగొని యుండుటచే దుర్బలుఁడుగ నుండెను. ఫలంబు

లను తిని జలమును గ్రోలుటవలన వాని ప్రాణములు కుదుటఁబడెను. పిదప నాసహోదరు లిరువురు మరల నామందిరసమీపమున కేగి యచటఁ గూర్చుండి సంభాషింపఁదొడంగిరి. కుమార మహేంద్రసింహుఁడు దా నెవ్విధంబున నచట కేతెంచియుండెనో, ఏయేకార్యాచరణములను గావించియుండెనో వానినన్నింటిని తన తమ్మునికి సవిస్తరముగఁ జెప్పి వినిపించెను. మఱియు నెత్తురుతో వ్రాయఁబడియుండిన గ్రంథమును జదువుటవలన దన కధికలాభము నేకూరియుండెననియు, నావలెనే నీవును యాగ్రంథమును తుదముట్టఁ జదివి బాగుగ జ్ఞప్తియుంచుకొనవలెననియుఁ, దదనంతరము మన మిరువురమును కలసి తిలస్మమును ఖండించి యశమును నఖండైశ్వర్యమును బడయగలమనియు బోధించి మరల వానితో నిట్లనియెను:-

"నే నీతోఁటలోని కరుదెంచి నీజాడ నరయుచు నేయేకార్యములను గావించియుంటినో వానివలన నిపుడు తిలస్మమును ఖండించికాని, మనమెవ్విధంబునను వెలుపలకు వెడలఁజాలమని తోఁచుచున్నది."

"(కొంచెము యోజించి) రక్తగ్రంథమును జదువుటవలన మన మీతిలస్మమును ఖండింపఁగలమని విశ్వాసము గలిగియుండిన నిప్పుడే దానిని జదువ నారంభించెదను. కాని, దానియందలి పెక్కుపదముల యర్థము స్పష్టముగఁ దెలియకున్నవి."

"ఔను. ఆవిషయమును నే నిప్పుడేకదా నీకు వివరించియుంటిని. నేనెపుడు నీజాడ నరయుచు నినుపగుండ్లు వ్రేలాడుచుండిన తిలస్మమందిరమునొద్దకు సమీపించితినో యపుడు ముకుందసింహ నరపాలునితో..............."

"(మాటకడ్డుతగిలి) ఔను. నాకది జ్ఞప్తియందుఁ గలదు. ముకుందసింహ నరపాలుఁడు మీకుఁ గొన్నిమర్మములను వివరింప

యుండెననియు, వానివలన కేవలము రిక్తగంథమేకాక యెట్టి జటిలంబగు తిలస్మగ్రంథమేనియు నవలీల జదువనగుననియు వెల్లడించి యుంటిరి. మీ రారహస్యములను నాకెప్పటివఱకుఁ దెలుపకుందురో..........."

"(నవ్వుచు) ఇంతటి వ్యగ్రత యెందులకు? నేను స్వయముగ నారహస్యములను నీకు వెల్లడించుటకు నంసిద్ధముగ నుంటిని. మంచిది. ఇవు డాలింపుము."

కుమార మహేంద్రసింహుఁడు తిలస్మపుస్తకములయందుపయోగింపఁబడు సంకేతపదములు మున్నగు రహస్యములను ముకుందసింహుని వలనఁ దాను వినియుండినవన్నియు నరేశసింహునకు వివరించి తెలిపెను. ఇంతలో నామందిరము వెనుకతట్టుననుండి యార్తనాద మొకటి వెడలివచ్చెను. సహోదరు లిరువురదృష్టి యావైపున కాకర్షింపఁబడెను. మరల నివ్విధంబున వారికి వినిపించెను:-

"కానిమ్ము! నీవు నాశిరమును ఖండింపుము. విచార మావంతయుఁ గలుగదు. నేనుకూడ దానినే కోరుచుంటిని. నేను జీవించియుండి యామహేంద్ర నరేశసింహులను దుఃఖావస్థయందుఁ జూడనోపను. అకటా! మహేంద్రసింహా! నీకిపుడు నావార్తయే తెలియదుగదా!"

ఈవచనంబుల నాలించి మహేంద్రసింహుఁడు సంభ్రమాకులచిత్తుఁడగుచు "నీధ్వని మృగాంకవతి కంఠస్వరమువలెఁ దోచుచున్న"దని పలుకుచుఁ దటాలున లేచి యామందిరము వెనుకవైపునకుఁ బరుగిడెను. కుమార నరేశసింహుఁడును, వానివెన్నంటి పారఁదొడంగెను.



౧౧.

మే మిపుడు మరల మాయారాణివైపునకు మరలుచుంటిమి. ఆమె వృత్తాంత మిచట లిఖించి కొన్ని గుప్తరహస్యములను వెల్లడింపఁగోరుచుంటిమి. మాయారాణియు నాజాబును తుదముట్టఁ జదువఁజాలక మూర్ఛాగతయై భూమిపైఁగూలెను. సులోచన తత్క్షణ మచటినుండి మఱియొక గదిలోనికిఁ బోయి యొక పింగాణికూజాను గొని తెచ్చెను. దానియం దొకవిధంబగు సరకు గలదు. సులోచన యా యరకును మాయారాణి మోముపైఁ జిలుకరించి తేఁకువగలిగించుటకుఁ బ్రయత్నింపసాగెను. కొంతసేపటికి మాయారాణి చైతన్యయై లేచి కూర్చుండి సులోచనదెసకుఁ బరికించి, “అకటా! మనప్రయత్నములన్నియుఁ జెన్నటిపోయినవి. ఏమి సేయుదు” ననెను.

“కానిండు. గతమునకై వగవనేల? ఇపుడిట్టివిధంబున భయసంభ్రమములఁ జిక్కియుండుటవలన బ్రయోజనమేమి? మిమ్ములను సంబాళించుకొని మనకర్తవ్యమును చక్కఁగ యోజించి నిశ్చయింపుఁడు.”

“అయ్యో! ఆసురాత్ముఁడు మనల నొప్పుగ వంచించి యున్నాఁడు. నావలనగూడ నొకప్రమాదము ఘటిల్లియున్నది. ప్రసంగధోరణియందుఁ గమలాదేవికి సంబంధించిన రహస్యములను వాని యెదుట నుగ్గడించియుంటిని. అంతమాత్రమున నతఁ డారహస్యముల నెఱుఁగఁజాలకుండినను, యెవు డాయధ్యక్షురూపధారియగు నైయారుఁడు ముకుందసింహునియెదుట నాపేరెత్తి ప్రసంగించునో, మఱియు నాసురంగమం దావంచకుని నిక్కంపుఁ దిలసామ్రాధ్యక్షునిగఁ నేను దలంచి సంభాషించియుండిన విషయములను వానికి వెల్లడించునో యావు డావిషయములన్నింటి నతఁడతిసులభముగ గ్రహింపఁగలఁడు. మఱియు నాపై వానికిఁ గలిగియుండిన కోపము యిమడుంగులు వృద్ధినొం

దును. (కొంతయోజించి) నా చెడువర్తనము వెల్లడియగుచోఁ దనకుఁ దలవంపు గలుగునని యతఁడు తలంచుచుండిన నిపుడా యోజనయు వానినెమ్మనంబుననుండి తొలఁగిపోవును. అకటా! ఇఁక నాజీవితాశ వ్యర్థము!"

"కమలాదేవి మీనామమేకదా! మీరాతిలస్మాధ్యక్షురూపధారియగు నైయారునితోఁ గమలాదేవి పేరెత్తి సంభాషించియుండిన సంగతులనుబట్టి నాకును కొంతసందేహము జనించినది. నిజముగ మీనామము గమలా?....................."

" ఆహాహా! ఆరహస్యములు తిలస్మాధ్యక్షునికిదక్క నితరులెవ్వరికిని తెలియవు. నేఁడు (కొంచెమాగి) కాదు. ఇపుడుకూడనే నారహస్యములను దాఁచియుంచుటకుఁ బ్రయత్నించెదను. మఱియు నీకును నారహస్యములను దెలుపకుందును. చాలును. ఇఁకనాయెదుట కమలాదేవి పేరెత్తవలదు. (జాబువైపునకు సంకేతించి) మంచిది. నీవీజాబును మరలనొకమాఱు చదివి వినిపింపుము!"

ఏజాబును చదువుటవలన మాయారాణికట్టి స్థితియొదవియుండునో యద్దానిని సులోచనచేతఁ దీసికొని మరలఁజదువ నారంభించెను.

జాబు:—

దుష్కార్యములను గావించువారెన్నటికి సుఖింపఁజాలరు. నీవుముకుంద మోహానసింహ జటాశంకరులను మృగాంకవతీరాజేశ్వరులను జంపి నిశ్చింతురాలనైతివనియు నిపుడు నాతోఁ దలపడువారెవ్వరు లేరనియుఁ దలంచుచుందువు. కాని, యదియంతయు భ్రమాస్పదము. నీ వాతిలస్మసురంగమందుఁ గలసికొనిన వృద్ధుఁడు తిలస్మాధ్యక్షుఁడు గాఁడనియు, నతఁ డైయార గురుకులభూషణుఁడగు నభయసింహుఁడనియు నెఱుంగుము. మఱియుఁ దిలస్మాధ్యక్షుని విశ్రామ

మందిరము విధ్వంసమొనరింపఁబడినను బంధితులకట్టి హానియు సంభవింపలేదనియుఁ దెలిసికొనుము. సురంగమందు నిన్నువంచించి నీయొద్దనుండి యద్భుతమందిరపు తాళపుఁజెవిని నేను సంగ్రహించియుంటినికదా! ఆబంధితులకు భోజనసామగ్రులను జలమును జేర్చు సమయంబున వారి మూర్ఛను దొలఁగించి యాబందిగమునుండి తప్పించితిని. అహా! పరమేశ్వరా! నీవు ధన్యుఁడవు. నీన్యాయాన్యాయ విచారణదక్షత నిరుపమానము. ఓదురాత్మురాలా! మాయారాణీ! ఇప్పుడైనను నా సామర్థ్యమును దెలిసికొమ్ము.

ఇట్లు,

అభయసింహా మైయారుఁడు.

ఈజాబునందలి వృత్తాంతమును వినుటవలన మాయారాణి శిరము మరల దిరుగ నారంభించెను. భయాతిరేకంబున దేహవల్లి వడవడ వడంకసాగెను. కొంతసేపటికి వణకు మిన్నకుండి తనుపరి సులోచనవైపునకుఁ బరికించి యివ్విధంబున బలుకఁ దొడంగెను:-

"ఆయభయసింహుఁడొక పెనుభూతమువలెఁ జూపట్టుచున్నాఁడు. అతఁడు నన్ను రెండుమాఱులు ఘోరముగ వంచించియుండెను. అకటా! అద్భుతమందిరపుఁ దాళపుఁజెవి చేఁజిక్కియు మరల దాఁటిపోయినది. ఈతిలస్మకైజారులు రెండుమాత్రము నాయొద్ద మిగిలియున్నవి ఇపుడు కమలాదేవిరహస్యము వెల్లడియగుట నాకు మిక్కిలి యనర్థదాయకము. (కొంచెము యోజించి) అభయసింహుని యొద్దగూడ నిట్టితిలస్మకైజారును దాని జంటవస్తువగు నుంగరమును నుండుటచేతనే నాతిలస్మకైజారు ప్రభావము వానిపైఁ జూపకుండెనని నేనిపుడు తెలిసికొంటిని."

"నిక్కువముగ నదియే! మంచిది. మనప్రాణములిపుడెవ్వి

ధంబున సంరక్షింపఁ బడునో యాయుక్తిని శీఘ్రముగ యోజింపుఁడు.”

సులోచనప్రశ్నమునకు మాయారాణి మాఱెద్దియుఁబలుకక నేమియో దలపోయుచుండెను. అంతఁ నెదుటి ద్వారమును దెఱచుకొని మాయారాణి తిలస్మాధ్యక్షుఁడు లోన బ్రవేశించు టామెకుఁ జూపట్టెను. వానినిగాంచుటతోడనే మాయారాణి దురంతకోపోద్దీపిత మానసయగుచు “ఓరీ దురాత్మా! నిన్నిచటి కెవరు రానిచ్చితిరి? మంచిది. నీవు వచ్చుటయే మేలయ్యెను. నీజాబు నాకుఁ జేరకుండిన మరల నీమోసమందుఁ జిక్కుదును. కాని, దురాత్మా! నీవు నన్ను ఘోరముగ వంచించియుంటివి. అయినను నీవు నాచేతినుండి యెచటికిఁ దప్పిపోఁగలవు?”

అధ్యక్షుడు:—నీలోనీవుంటివా? లేదా, నీవిపుడెవరితో నేమిమాట్లాడుచుంటివో యదియు నెఱుంగవా? నాకుఁగాదు మృత్యువు. నోరు సంబాళించుకొని మాట్లాడకుండినచో నీకు మృత్యువే కలుగఁ గలదు.

మాయారాణి:—(లేచి నిలచి కైజారుఁ జేతఁధరించి) నిక్కువము. నన్ను నే మఱచి యుండకుండిన నినుఁబోలు దురాత్ముని మోసమందేలచిక్కుకొందును? విశ్వాసఘాతకుఁడా! నీవు నన్నొప్పుగ వంచించియుంటివి. నేనిపుడు నీకెట్టి దుర్దశను గలిగింతునో చూడుము.

సులోచన:—నీవింతటి మోస మొనరించియు మరల మాచెంతకే తెంచుట మిక్కిలి యక్కజముగఁ దోఁచుచున్నది. కాని యమ్మా! వంటయిలుఁజొచ్చిన కుందే లెచటికేనియుఁ బోఁగలదా? తిలస్మకైజారు ప్రభావము నీపైఁ జూపకుండినను నేను మఱియొకవిధంబున నీసమాచారమును కనుగొందును.

ఈసమయంబున మాయారాణికిఁ గలిగిన యావేశము చూడదగినది. ఆమె యాఁడుపులివలె నభ్యాగతుని యెదుటికి దుమికెను. ఇపు డామె వ్రేలియందు సులోచనయొద్దనుండిన యుంగరము వంటిదే విషపూరితాంగుళీయక మొకటి గలదు. మాయారాణి యతిచాతుర్యముతోఁ దనకార్యమును నిర్వహించుకొనెను. ఆవిష పూరితంబగు నంగరంబుతోఁ దటాలున వానిచెక్కుట రుద్దెను. పాప మానిస్సహాయుఁడు నివ్వెఱపడుచు నేమియుఁ జేయఁజాలక మూర్ఛాగతుఁడై భూమిపైఁ గూలెను. తదనంతరము మాయారాణి సులోచనవైపునకుఁ బరికించి, "యిపుడు వీనికరపాదములను రజ్జువుతో బాగుగ బంధింపుము. పిదప వీనికిఁ దెలివి గలిగించి, "అభయసింహా! నీవై యారగురుకులభూషణుఁడవుగదా? ఇపుడు నీ దేహారోగ్యమెట్లుండె"నని ప్రశ్నింతు"మనెను. దానికిఁ బ్రత్యుత్తరముగ సులోచన యామెతోఁ, "కేవలము కరపాదములను బంధించుటయే కాదు. వీనిముక్కునుగూడఁ గోయవలెను. వీనికృత్రిమశ్మశ్రువు నూడఁబెఱికి పాఱవేయవలెను. తదనంతరము చైతన్యము గలిగించి, మీరు కోరినటులఁ బ్రశ్నించు టొప్పిద"మనెను.

అభయసింహుఁడు దన్ను బాగుగ వంచించియుండుటచే మాయారాణి తన్నుదా మఱచియుండెను. చీమ చిటుక్కుమన్నను నామె మిక్కుటముగ భీతిల్లుచుండెను. అభయసింహుఁ డేరూపముతో మాయారాణిని వంచించియుండెనో యట్టిరూపముతోడనే మరల నామెయెదుటికే తెంచుట కతఁడంత యవివేకిగాఁడని మా పాఠకమహాశయు లెఱింగియే యున్నారు. కాని, అభయసింహుఁ డేరూపముతో మాయారాణిని కనుబ్రామియుండెనో యట్టివిధంబు ననే యా యాగంతుని రూపమును గలదు. వాస్తవమం దతఁడభయసింహుఁడు గాదు. నిక్కువముగ మాయారాణి తిలస్మాధ్యక్షుఁ

డే! ఇతఁ డవరివత్సమునుబూని ప్రాణములను సహితము సరఁగునే యక నత్యున్నతపదవికిఁ దెచ్చియుండెనో యట్టి యామెయే యిపుడు వీనిగడ్డమును గొఱిగి ముక్కుఁ గోయ నుద్యమించుట పశ్చాత్తాపక రంబగు విషయము గాకుందునా?

సులోచన వచనములకు మాయారాణి సమ్మతించెను. సులోచన తిలస్మాకై జారుతో, మొదట నాయధ్యక్షుని ముక్కుఁ గోసెను. పిదప గడ్డమును నూడఁబెఱుకుటకు సిద్ధపడెను. బలపూర్వకంబుగ నొక్కమాఱు లాగినమాత్రమునన నె వెడలివచ్చుట కాగడ్డము కల్పితమైనది కాకుండుటచే దానిని వెడలించుటకు సులోచన బాగుగ శ్రమనొందవలసివచ్చెను. మఱియునామె మాయారాణి దెసఁ బరికించి "అభయసింహుఁ డొక సామాన్యుఁడుగాఁడు. ఇతఁడు తనగడ్డము నెంతదృఢముగ నతికించుకొనియుండెనో చూడు"ఁ డని పలికి గడ్డమును గొఱుగ నారంభించెను.

సకము వఱకు ముండనము చేయునరికి యధ్యక్షుని మోమంతయు నెత్తురు చిమ్మినట్లయ్యెను. అంతమాయారాణి సంక్షోభము నొందుచు, "సులోచనా! ఆఁగుము! ఆఁగుము!! మనము పొరబడితిమి. ఇతఁడు నిక్కముగ మన తిలస్మాధ్యక్షుఁడుగాని యభయసింహుఁడు గాఁ"డనెను.

సులోచన:—(వానివైపునకుఁ దేరకొనఁజూచి) ఔను. నాకు నట్లునే తోఁచుచున్నది. అయ్యో! మిక్కిలి ప్రమాదమాయెను.

మాయారాణి:-ప్రమాదమే కాదు. మిక్కిలి యన్యాయము జరిగినది. కటకటా! నేనేమి సేయుదును. పాపము నాకితఁ డనేక మహోపకారములను గావించియుండెనే కాని యొక్కచెఱుపైనను గలిగించియెఱుంగఁడు సులోచనా! త్వరపడుము. త్వరపడుము. ఇతఁ డొకవేళ నాయుంగరపు విషమువలన మరణింపఁ

గలఁడు. యొకట నావిషమును తొలఁగించు ప్రయత్నమును గావింపు"మని మాయారాణి యిక్కిలి తొందరగఁ బలికెను.

సులోచన:—నే నావిషమును మాటలాడునంతలోఁ దొలఁగింపఁ గలను గాని, వీనికి మన మోమెటులఁ జూపఁగలము?

మాయారాణి:—నేను వీనిని బంధించుటకుమాత్రమే యాజ్ఞపించితిని. నీవు వీనిగడ్డమును ముక్కును గోయుటకుపదేశించితివి. మఱియు నటులనే నీచేతులారఁ గావించి యుంటివి."

సులోచన:—బాగు! బూతులనుకూడ నేనే యిట్టు నంటినా? మీయాజ్ఞలేనిదే నేను వీని నాశికను గోసితినా? మీరిపు డానేరము నాశిరమున మోపదలంచుచుండుటులఁ దోఁచుచున్నది ప్రజలు మిమ్మే తప్పక దూషించెదరు. చాలును! మీస్నేహమును విశ్వసించుట ముప్పుకు మూలమని నే నిపుడు దెలిసికొంటిని. నాయెదుటనే యిటులఁ బలుకుచుండఁ బరోక్షమం దేమి వచియింపకుందురు? కానిండు. మీస్వార్థపరత్వమిపుడు బాగుగఁ దెలిసివచ్చినది.

సులోచన యివ్విధంబునఁ బలుకుచు మఱియొక గదిలోనికిఁ బోయి యొక మందుసీసానుగొని శీఘ్రముగ నచటికి మరలి వచ్చెను. మఱియు నాసీసానుండి కొంతమందును వెడలించి దానిని యధ్యక్షుని కపోలముపై రుద్దెను. ఆ యౌషధప్రభావమువలన వాని చెక్కిలిపై నేర్పడియుండిన బుడగ చితికి దానినుండి కొంతనీరు కాఱి వెంటనే వానికిఁ దెలివ గలిగెను. మఱియు నతఁడు తన దుస్థితిఁ బరికించి దురంతక్రోధావేశుఁడయ్యెను. మాయారాణి యిట్టివిధంబున వర్తించుటకుఁ గారణము దనకు కొంచెమైనను దెలియకుండినను, వానికపుడు గలిగియుండిన కోపోద్రేకముచే నామె నేమియుఁ బ్రశ్నింపఁజాలకఁ గన్నులెఱ్ఱఁజేయుచు మోమునంతఁ బరి

కింపఁదొడంగెను. అంత మాయారాణి వానితో నిట్లు బలికెను:—

మాయారాణి:—(అధ్యక్షునితో) బాబాజీ! క్షమింపుఁడు. విజయేంద్రసింహుని సైనికులలో నొకఁడు మీ వేషమును ధరించి వచ్చెనని సందేహించి యావిషయమును దెలిసికొనుటకు మీకు మూర్ఛను గలిగించితిని. తక్కిన పనులన్నియు నీసులోచనయే కావించియున్నది.

సులోచన:—బాగు! బాగు!! నేనే యావిషపూరితాంగుళీయకముతోఁ బ్రాణములను గొనుటకుఁ దలంచితినని బాబాజీ బాగుగ నెరుంగఁగలరు. (అధ్యక్షునివైపునకు గాంచి) మహాత్మా! మాయారాణి స్నేహమును విశ్వసించుట మిక్కిలి ప్రమాదకరము. భర్తను చెఱఁబెట్టి యనేకసంవత్సరముల నుండి బాధించుచుండిన నీమె యితరుల విషయమున నెటులఁ బ్రవర్తించునో దానిని వేఱుగఁ జెప్పవలెనా? కమలాదేవికి సంబంధించిన రహస్యముల నభయసింహునితోఁ జెప్పుటయే కాక ఆకార్యములన్నింటిని మీరే చేసియుంటిరనియు వక్కాణించియున్నది.

మాయారాణి:—(సులోచనవైపునకుఁ గనులెఱ్ఱజేసి చూచుచు) ఓసీ! వ్యర్థముగ నాపై నపవాదముల నేలప లుకుచుంటివి?

సులోచన:-నిజమాడిన నిష్ఠురముగదా! వ్యర్థంపుమాటలను గల్పించి బాబాజీ ముక్కుఁగోసిన యపరాధము నాపై మోపుచుంటివి. నిజముచెప్పుటయు నపరాధమే కాఁబోలు. నీవిటులేల కన్నులెఱ్ఱజేసెదవు? నీకు నేను భీతిల్లుదాననుగాను. నీవు నన్నేమియుఁ జేయఁజాలవు. నీప్రాణములను నీవు కాపాడుకొనినఁజాలును.”

ఇంతకుఁబూర్వ మెవ్వరివలనను తిరస్కరింపఁబడని మాయారాణి నేఁడు సులోచన వచియించిన కటువచనంబుల నెటుల సహింపఁగలదు? ఆమె పల్లు పటపట గీఁటుచు సులోచనవైపునకుఁ గాంచుచుండెను. అంత దిలస్మాధ్యక్షుఁడు, "ఔను. తప్పక యీనేరమంతయు మాయారాణిదమట కెట్టినందియమునులేదు. సులోచన నోట "కమలాదేవి"యను శబ్దము వెడలుటయే దీనికిఁ దార్కాణ" మనెను.

అధ్యక్షుని వచనంబుల నాలించుటతోడనే మాయారాణికిఁ గలిగిన క్రోధమునకు మేరలేదు. ఆమె వెంటనే తిలస్మకైజారు మొలనుండి యూడఁబెఱికి పార్శ్వస్థితయై సులోచనపై నురికెను. సులోచనయు నతినేర్పున నొకపక్కకొదిగి తన్నుఁ గాపాడుకొని వెంటనే తిలస్మకైజారునుదూసి మాయారాణిపైఁ గదసెను. ఒండొరులతోఁ దలపడి ధైర్యసాహసంబులఁ బోరుచున్నను నాయికవురలో నొక్కరును నాకళయందు నేర్పరులుగారు. ఒకరితో నొకరు గదసి పోరుసమయంబున వారిచేతులయందుఁగల యాయుధములను నొక్కి పట్టుకొనుట సహజవిషయముగదా! ఇపుడిచటను నట్టిస్థితియే సంభవించెను. మాయారాణి సులోచన లిరువురు నాస్వాభావికవిధంబున నాతిలస్మకైజారులను బట్టియుండుటచే వానినుండి విద్యుత్ప్రభవంటి ప్రకాశము పుట్టుచుండెను. ఆయధ్యక్షుఁడు సంభ్రమాకులచిత్తుఁడగుచుఁ గన్నులను మూసికొని యచటినుండి పారిపోవుటకుఁ దలంచుచుండెను. కపటవేషధారియగు నధ్యక్షునియొద్దనుండి జాబును గొనితెచ్చిన పరిచారకయొక్క [illegible] యచటినుండి పారిపోయెను. మఱియు నచటి పరిచారకలకెల్లర కావిషయము నెఱింగించి వెంటఁదోడ్కొనెను. మాటలాడునంతలో నావరిచారికలెల్లరు నచ్చోటునకుఁ జేరి యాజగడమును జల్లార్చుటకుఁ బ్రియత్నింపసాగిరి.

అఖండైశ్వర్యంబునఁ దులఁదూఁగుచుండినవానినిగాని యొక
యధికారపదవి నలంకరించిన వానినిగాని యెల్లరు మన్నించుచుండుట
లోకసమాజము. ఆసంపదగాని యధికారముగాని తొలఁగిపోయిన
వానిని బలుకరించువారలే చూపట్టరు. మిత్రులు ననుచరులు నూ
పిరి బిగయఁబట్టి యెచ్చటివారచ్చటికిఁ బారిపోవుదురు. తండ్రియని
పిలుచుచుండిన వానిని తమ్ముఁడా యని పిలుచుటకైనను వారు
సమ్మతింపరు. కనపడినమాత్రముననే చేయెత్తి మ్రొక్కువారలు తమ
మోముల నావలివైపునకుఁ ద్రిప్పుకొందురు. మఱియు వానిపైఁ
బగఁబూనుట కుద్యమింతురు. నిరంతరము సమీపవర్తులయి చే
మోడ్చి శిరమువంచి వినమ్రభావంబునఁ దమప్రభువు నాజ్ఞకుఁ బ్ర
తీక్షించు దాసదాసీజనంబులపుడు పిలిచినను దరికిఁ జేరరు. మఱియుఁ
దాము స్వయముగ యజమానిపైఁ గనులెఱ్ఱఁజేసి చూడ సాహసిం
తురు. సరిగ నట్టిస్థితియే మాయారాణి కిపుడు గలిగియుండెను. ఆమె
రాణియను పదవియందున్నంతకాల మామెయం దనేకదోషములు
నిండి పిండీకృతంబై యుండినను, నామె నొకదేవతవలెఁ బూజించు
చుండిరి మఱియు నామె కోపభావమునఁ గన్నెత్తి గాంచినంతనె
యెల్లరు గడగడ వడంకుచుండిరి. ఆమెయాజ్ఞ దైవయాజ్ఞవోలె శిర
మున దాల్చి యది యెట్టిచెడుకార్యమైనను దానిని తమకర్తవ్యముగ
దలంచి చేయుచుండిరి. అట్టి ప్రతాపోజ్వలయగు మాయారాణి నేఁడు
పదవిచ్యుతయై యుండెను. ఆమె తనరాజ్యధామంబులను వీడి
మోము మఱుఁగుపఱచుకొని యొరులకంటఁ బడకుండఁగఁ బారిపోవ
లసివచ్చెను. నిన్నటిదిన మామె మహారాణియని పిలిపించుకొనుచు
గర్వోద్ధతి మిడిసిపడుచుండెను. ఆమెను గాంచినంత నేలక్షలకొలఁది
జనులు భీతిల్లుచుండిరి. కాని, నేఁ డామెనుగాంచి యొకసామాన్యు
రాలగు పరిచారికయైనను భీతిల్లకుండెను. నిన్నటిదినమున నామె కను

సన్నల వందలకొలఁదిజనుల శిరములు దేహమునుండి త్రుళ్లుచుండెను. కాని, నేఁడు న్యాయముగ నొకపరిచారికకైన నెట్టికీడును గలిగింపఁజాలకుండెను. ఇదియంతయు నామె దుష్కృతి పరిణామమని తలంపవలయునేగాని, వేఱుగ దలంప వీలులేదుకదా?

మోహిని మాయారాణికిఁ బ్రియసఖి మఱియు సులోచన మోహినికిఁ గూర్మినెచ్చెలిగను, మాయారాణికి పరిచారికగను తలంపఁబడుచుండెను. మాయారాణి దయాకటాక్షంబుననే మోహినీసులోచను లనేకలక్షల కధికారిణులయి యుండిరి. ఈమందిరమును నీవిభవమును వారికి మాయారాణి కరుణాకటాక్షమువలననే ప్రాప్తించియుండెను. మున్ను మాయారాణి సులోచనను లెక్కలేనన్ని చీవాట్లను పెట్టుచున్నను వానిని మహాప్రసాదమువలె స్వీకరించుచు నామె శాసించు ప్రతికార్యము (చెడుకార్యముగాని, మంచికార్యముగాని) శిరమునదాల్చి చేయుచుండెను. అట్టి మాయారాణి నేఁ డామె కన్నులయెదుట నొకకాసుకైనను కొఱగాకయుండెను. ఆమె సామర్థ్యమిపుడు సన్నగిల్లియుండుటచే మేకపిల్లనుఁబోలు సులోచన నేఁడు పులిపిల్లయయ్యెను. తుదకు సులోచనయొక్క పరిచారికల దృష్టికిఁ గూడ మాయారాణి తృణప్రాయముగఁ దోఁచుచుండెను. మాయారాణివలన నిఁక నెట్టిలాభమేనియుఁ గలుగునను నాశ సులోచనకు రవ్వంతేనియు లేకుండెను. మఱియుఁ దాను తలంచిన మాయారాణికిఁ దగుసహాయ మొనరింపఁదగుస్థితిలోని కిపుడామె వచ్చియుండెను. తత్కారణంబున సులోచన నేత్రములు తటాలున నెత్తికి వచ్చెను. మఱియుఁ గలహమునఁ బెంచి యామె ప్రాణములను గొనుటకు సిద్ధపడుచుండెను. ఇదియంతయు సులోచన దోషమని తలంపవచ్చునా! కాదుకాదు. ఇది మాయారాణి దుష్ప్రవర్త

సఫలితంబనియే తలంచుటొప్పు. ఇచటిపరిచారికలందఱు సులోచన వలన బోషింపఁబడుచుండిరి. వారలు సులోచనకుఁ దోడ్పడ నిచ్ఛగింతురు కాని, మాయారాణిపక్షము వహింపఁగోరరుగదా! అతిల స్మకైజారులనుండి వెడలుచుండిన యద్భుతప్రకాశమువలన నాపరిచారికలు వివశలయి యాజగడమందుఁ బాల్గొనఁజాలకుండిరి. కాని, యెపుడు మాయారాణీసులోచనలు పరిశ్రాంతలయి తమ పోరాటమును నిలుపుచుందురో యపు డాకైజారు పిడులనుండి చేపట్టు సడలుటచే నావప్రకాశ మదృశ్యమగుచుండెను. అపు డాపరిచారికలు సులోచనకుఁ దోడ్పడ సంసిద్ధులగుచుండిరి. సులోచన మాయారాణిని గద్దించుచు, "మాయారాణీ! యిటుచూడుము! ఇపుడు నాతోఁ బోరి నీవెవ్విధంబునను విజయముం బడయఁజాలవు. ఒకవేళ నేనోడి పారిపోయినను కాళీనరేశుని సమక్షమున కేగి నీవృత్తాంతమంతయు వెల్లడింతునేని, యతఁడు నిన్ను బంధించి విజయేంద్రసింహునియొద్దకుఁ బుత్తెంపక మానఁడు. నీవపు డేమిసేయుటకును సాధ్యపడదు. నీవిపు డొరులకుఁ దెలియకుండగ నిచట దాఁగియుంటివి. ఈసమాచారము వెల్లడియగుచో నీదుర్గతి యేటుగఁ జెప్పవలయునా? నేను నీవెనుకటిస్నేహమునుదలంచి నిన్ను క్షమించుచుంటిని. తక్షణ మించటినుండి పారిపోయి సాధ్యంబగు విధంబున నీప్రాణములను గాపాడుకొనుము. ఇయ్యదియే నాయాజ్ఞ"యని పలికెను.

సులోచన వచనంబుల నాలించి మాయారాణి నివ్వెఱపాటునొందుచు, నిలచిపోయెను. పదపయుఁ గొంతసేపటివఱకు నెద్దియో యోజించుకొని తన తిలస్మకైజారును మొలయందుఁ జొనిపి తూఁగదిపీడి యెచటకో వెడలిపోయెను. సులోచన యిటునటు బరికింప నచటఁ దిలస్మాధ్యక్షునిజాడయుఁ బొడకట్టదాయెను. తరుణముం గని యతఁడు నెచటికో పాఱిపోయియుండునని యచటివారలెల్లరుఁ దలంచిరి.

౧౨.

తిలస్మాధ్యక్షుని విశ్రామమందిరమందలి మందుగాణమునకుం బక్కగదియందు వేషధారియగు తిలస్మాధ్యక్షునిచేం బంధింపంబడియుండిన బంధితులవైపునకు మనమిపు డేగవలయున్నది. రండు! తిలస్మాధ్యక్షుని వేషమునుధరించి మాయారాణీహృదయాంతర గూఢరహస్యములను దెలిసికొనిన దిట్టరి మనఅభయసింహుండే! అతండు తిలస్మాధ్యక్షుని రూపమునుదాల్చి యిటునటు సంచరించుచుం డుడకుం దిలస్మాధ్యక్షుని మందిరముచెంతకుం బోయి చేరెను. ఇవు డచట మాయారాణి పరిచారికలును తరళయుం గలరు. ఇరువురు మనుజులు కొండతిప్పవైపున కేగుచుంటంగని మాయారాణి వారివెన్నంటి పోయియుండెనను సమాచార మతండు తరళవలన దెలిసికొనెను. అభయసింహుండా కొండతిప్పయందలి సకలమర్మములును దిలస్మోద్యానపు నాల్గవతరగతి తోంటలోనికిం బోవు సురంగ మార్గమును దానియందలి రహస్యములును బాగుగ నెరింగియుండెను. ఆరహస్యములన్నియు నతండు బూర్వమే తెలిసికొనియుండెను. తత్కారణంబున నిరువురుమనుజులవెనుక మాయారాణి కొండతిప్ప వైపునకు వెడలియుండిన సమాచార మభయసింహుం డాలించినంతనే, తిలస్మోద్యానపు నాల్గవతరగతి తోంటలోనికి బోవు తలంపుతోం దమపక్షపు వైయూరులెవ్వరో వెడలియుందురనియు, వారి వెన్నంటి మాయారాణి యేగియుండుటచే వారి కట్టిహాసియేనియు సంభవింపవచ్చునని యు సందేహించి యభయసింహుండును నాకొండగుట్టవైపునకుం బయలుదేరెను. ఈహేతువుచేతనే తిలస్మాధ్యక్షుని వేషము దాల్చియుండిన యభయసింహుని కాసురంగమందు మా

యారాణితోఁ గలుసుకొను నవసరము చేజిక్కియుండెను. అటు పిమ్మటివృత్తాంతమంతయుఁ బైన లిఖింపఁబడియే యున్నది.

మందగామినమునకుఁ బ్రక్కగదియం దపరాధులను బంధించిన పిదప వారికి భోజనసామగ్రిలను దీసికొని అభయసింహుఁ డాగదిలోనికిఁ బోయియుండిన వృత్తాంతము మాపాఠకమహాశయులు విస్మృతిఁ జెందియుండరు. పిదప నతఁ డాబంధితుల మూర్ఛను దొలఁగించి సకలవృత్తాంతములు సంక్షేపముగ జెప్పిన పిదప, మాయారాణియొద్దనుండి తాను సంపాదించియుండిన యద్భుతమందిరపుఁ దాళపుఁజెవి ముకుందసింహ నరపాలున కొసంగెను. మఱియు నాతాళపుఁజెవి సాయంబున సాధ్యమగునంత శీఘ్రముగ నచటినుండి వెడలిపోవుటకు వారి కుపదేశించెను. అంత ముకుందసింహనరపాలుఁడు వానితో, "మన కీతాళపుఁజెవి చేఁజిక్కియుండినను నెట్టిచింతయుఁ గలుగదు. మనము దీనినుండి సహజముగ వెలుపలకు వెడలగలము. ఇచటిరహస్యములన్నియు నాకుఁ గరతలామలకములు. మీరు మావిషయమున నెట్టిచింతయుఁ బొంద నగత్యము లేదు. ఇరువదినాలుగు గంటలకాలములోపున మాయారాణి యెట్టి కార్యాచరణము గావింపకుండునటుల మాత్రము జాగ్రత్తగలిగి యుండుఁడు. తదనంతరము మేము స్వయముగ మిమ్ము వెదకి కలసి కొందు"మనెను.

ఈతిలస్మాధ్యని మందిరరహస్యము లభయసింహున కేగాక మన మైయారులలో మఱికొందఱకును దెలియును. మృగాంకవతి యామందిర రహస్యములన్నింటిని తనకుఁ దెలిసియున్నంతవఱకు వారికి వివరించియుండెను.

వేషధారియగు తిలస్మాధ్యక్షుఁ డెపు డమాత్యశేఖరునితోఁ గలసికొనుటకు మాయారాణివలన బలాత్కరింపఁబడెనో, యవు

ుఁ డచటినుండి బయలుదేరి ముకుందసింహుఁడు మున్నగువారిని లసికొను తలంపుతో నుత్తరదిశనుబట్టి పోఁదొడంగెను. కారణం మన, వారలు మందుగా గ్రాణపుఁ బ్రక్కగదినుండి బయలువెడలి యుత్తరపువైపునగల నొకస్థానమునకుఁ జేరఁగలరని మన యభయ సింహుఁడు బాగుగ నెరింగియుండెను.

అభయసింహుఁ డింకను రెండుమైళ్ళదూరమైనను వెడలి యుండఁడు. అప్పటికే నందె చీఁకటులు నలుదెసల వ్యాపించియుండెను. ఆనిబిడారణ్యము గాఢాంధకారమున కిరవై యుండుటచే నతఁడు ముకుందసింహుఁడు మున్నగువారిని వెదకి కనుగొనఁజాలకుండెను. ముకుందసింహుఁడు మున్నగువార లామందు గ్రాణపుఁ బ్రక్కగది నుండి వెలుపలకు వెడలిపోయినమార్గ ముత్తరదిశకుఁ బోయియుండెననిమాత్ర మతఁ డెఱిఁగియుండెను. కాని, యది యేస్థానమున తుదిగొనియుండెనో యాజాడ వానికి బాగుగఁ దెలియదు. అయినను నతఁడు వారిని గలసికొనుటయం దధికశ్రమనొందు నగత్యము గలుగలేదు. కారణంబేమన, నతఁడు మఱికొంతదవ్వున కేగినపిదప వానిని వెదకుచు నేతెంచుచుండిన మోహనసింహునితో వానికి సమావేశము గలిగెను. ఆయడవియం దొక దట్టమగు మ్రానుక్రింద నభయసింహుని రాకకై ప్రతీక్షించుచుఁ గూర్చుండియుండిన ముకుందసింహుఁడు మున్నగు వారి సమీపమున కతఁడు మోహనసింహుని వెంటఁ బోయిచేరెను. అభయసింహుని గాంచినంతనే యచటి వారలెల్లరు లేచి నిలచి వానికి స్వాగతం బొసంగురీతి రెండుమూఁడడుగులు ముందున కేగిరి.

మోహన:—(ముకుందసింహునితో) నే నెంతశీఘ్రముగ వీరిని గని
పెట్టి తోడ్తెచ్చితినో చూడుఁడు!

ముకుంద:—(అభయసింహునితో) విచ్చేయుఁడు. విచ్చేయుఁడు.

అభయ:—ఇంతదూరముదనుక నేతెంచియు నిఁక రెండుమూఁడడుగులలోనే నిలచిపోవుదునా?

ముకుంద:—(నవ్వుచు నభయసింహుని చేయి పట్టుకొని) మీ కారణముననేకదా నేఁడు మేమిచటఁ బ్రాణములతోఁ జూపట్టుచుంటిమి!

అభయ:—ఇదియంతయు నాభవానీదేవి కరుణాకటాక్షము. ఆమె కృపాకలితాపాంగవీక్షణముననే నేనిపుడు మీపాగడ్తల నాలించుటకుఁ దగియుంటిని. మీ కిచ్చగలిగినవిధంబున నన్నుఁ బొగడుఁడు. నే నుప్పొంగుచు మిన్నకఁ గూర్చుండి మీసంస్తుతి నాలించుచుందును. మఱియు నీపరిశంస మిమ్ములను బంధవిముక్తులనుగ నొనరించుటచేఁ జేయుచుంటిరి. కాని, యది యేవిషయమునకుఁ దగినదికాదనియు వేఱొండు కార్యమునకై యోగ్యమైనదనియు నేను భావింతును. ఏరహస్యము న్వయముగ మీ రెఱుంగరో యదియే మీనోట వెల్లడి కాఁగలదు. మఱియు నే నెంతటి యమూల్యకార్యమును గావించివచ్చితినో దానిని మీ రెఱుంగకున్నను దానికారణంబుననే మీప్రశంసాప్రవాహములను సహించుచు మీ సమక్షమున ఱొమ్ముచాచి నిలుచుట కర్హుఁడనుగఁ దలంచుచుంటిని. అది కేవలము మీకొక్కటికే కాదు. మృగాంకవతీరాజేశ్వరులకు గూడ నధికసంతోషప్రదమైనది.

ముకుంద:—(కొంచెము యోజించి హేళనముగ నవ్వుచు) మీరు కోపింపకుండిన, ననభ్యతయని తలంపకుండిన, నేఁడు భంగు గ్రోలుటకుమాఱుగ మదిరమును ద్రావియుంధురని పలుకదీరను.

ఆయరణ్య మింతదట్టముగను గాఢాంధకారముగనున్నను నభయసింహుని ట్రోడ్నాని మోహనసింహుఁడు వచ్చుచుండెను. ఆసవ్వడినాలించినంతనే జటాశంకరుఁడు తన కక్షపాలనుండి మడచి యుండిన లాంతరొకటి దీసి దానిని వెలిగించుటకుఁ దలంచుచుండె ను. అంత మోహనసింహుని కంఠస్వరము నాలించుటతోడనే యతఁ డాలాంతరు వత్తిని వెలిగించి ప్రకాశమును గలిగించెను. ఆప్రకాశ మొందఱు గుర్తించుకొనుటకుఁ దగియుండెను. అభయసింహు ని గాంచినంతనే వాని నాదరించుట కెల్లరు లేచి రెండుమూఁడడు గులు ముందునకుఁ బోయియుండిరిగదా! మఱియు మాయారాణి సమాచారమును దెలిసికొను తలంపుతో నెల్లరు వానిచుట్టు మూఁగి నిలచిరి. అభయసింహుని మోమునఁదు సంతోషచిహ్నము లనుదిన ముకంటె నేఁ డధికముగఁ జూపట్టుచుండుటచే ముకుందసింహుఁడు మున్నగువార లితఁడేదియో యొక సంతోషవార్త వినిపింపగల డను నాశ మిక్కిలి యాసక్తితో వాని మోమువంకఁ బరికింపసాగిరి. కాని, పట్టుపోగులవలె జటిలంబులగు నభయసింహుని మాటలకు నివ్వెఱపాటు నొందుచు ముకుందసింహుఁడు దనలోఁ "ఇది యెట్టి సంతోషవార్త! నే నెద్దానిని స్వయముగ నెఱుంగనో, మఱియు నెద్దానిని నావలన నాలించి, యద్దానినే నాకు వినిపించి మమ్ములను సంతోషచిత్తులనుగ నొనరించి తాను ప్రశంసాపాత్రుఁడగుటకుఁ గో రుచుండె"నని తలంచి భంగు ద్రాగుటకు బదులుగ నేఁడు మదిర మును గ్రోలియుంటిరని పలుకకఁ దీర"దని పరిహాసపూర్వకంబుగఁ బలికియుండెను.

అంత నభయసింహుఁడు నవ్వుచు వానితో నిట్లనియెను:—

"ఎవరు మదిరమును సురయుఁ గ్రోలుదురో యట్టివారలు తమ యింటిగుట్టు కొంచమైనను దెలియఁజాలరు. మీరును నట్టివా

రిలోఁ జేరినవారనుట శక్యమైనందియుమును లేదు. దానినిఁ దగు నిదర్శనములతో నిశ్చయపఱతును. ఇపు డావిషయము నెఱుంగుటకు మీ యుదరమం దనేక రాజనామూషికములు గంతులు వైచుచుండును. నే నిపుడు మిమ్మేమి ప్రశ్నింపఁ దలంచుచుంటినో, యేమి చెప్పఁ దలంచుచుంటినో దాని నెఱుంగుటకు మిక్కిలి యాతురము గలిగి యుందురనుట నిక్కువము. మంచిది. "కమలాదేవి"యను నామ మెవ్వరిదో దానిని దొలుత నెఱింగింపుఁడు."

"అది మీ కెఱుంగరా? వేఱెవరు గలరు? ఇది యాదురాత్మురాలగు మామారాణి నామధేయము"

"మంచిది. నే నిద్దానిని 'సంతోషసమాచార'మని దలంచుచుంటినో, యట్టి నాయూహ నిక్కువంబయినదని యిపుడు మీవచనమువలనఁ దెలిసికొనఁగలిగితిని. వినుఁడు. (కొంచెమాగి) కాదు కాదు. ఆశుభవార్త నెఱింగించుటకుమున్న నాకొనంగవలసిన పారితోషికమును స్థిరపఱచుకొనుటమేలు. కేవలము వట్టి పొగడ్తలవలన బ్రయోజనమేమిగలదు?

"అబ్బా! మమ్మిట్టులేల వేధించెదరు? మీ కెద్దియేనియుఁ బారితోషిక మొసంగుటకు నేనిపు డట్టిస్థితియందు లేనని మీ రెఱింగియుంటిరిగదా! అయినను, మీరు నన్నట్టి భాగ్యునిగఁ దలంచుచుండిన మీ కట్టిపారితోషికముగావలయునో దానినిగూడ నిపుడు నిశ్చయింపుఁడు. దానిని నెరవేర్చుటకుఁ బ్రాణమనంబుల సంసిద్ధుఁడ నగుదును."

"(చేయిఁజాపి) అగుచో, నాచేతిపయిఁ జేతిలోఁ దట్టి శపథమును జేయుఁడు. నేను గోరఁబోవు బహుకృతిని మీ రందులకుఁ దగియుండినపుడును నాకగత్యము గలిగినపుడును యడిగి తీసికొందును."

"(అభయసింహుని కరతలమును దనచేతితోఁ దట్టుచు) ఇదిగో! కైకొనుఁడు. ఇఁక నాలసింపకుఁడు. వేగమె వచింపుఁడు. మాయెల్లరహృదయము లాసంతోషవార్త నాలించుటకు మిక్కిలి తల్లడమొందుచున్నవి."

"మంచిది. వినుఁడు. (మృగాంకవతీరాజేశ్వరులతో) మీరి రువురుఁ గొంతదగ్గఱకువచ్చి కూర్చుండుఁడు. మఱియు నేఁ జెప్ప బోవునది కడుశ్రద్ధ నాలింపుఁడు. (నవ్వుచు) నేఁడు మీరధికప్రమో దభరితమానసులు గాఁగలరు. సరియే! మీరందరుఁ గూర్చుండుఁడు"

"(కూర్చుండి) మీరు వేగమె వచియించి మాహృదయాందోళనమును జల్లార్చకేల యాలసించుచుంటిరి? ఇఁక మమ్ము బాధింపకుఁడు. ఆసంతోషవార్త యెట్టిదో వేగమె వచియించి మమ్ము గృతార్థులనుగఁ జేయుఁడు."

"కారణంబేమన, సంతోషమునకుఁ బిదప విచారముగూడ గలుగఁగలదు. మఱియు నొకవిధమగు సందేహమందుఁ మీరు జిక్కక మానరు."

"మే మెంత వేగిరపడుచున్నను నిట్టి జటిలములగు మాటలను పలికి మా మానసంబుల నొవ్వఁజేయుచుంటిరి కాని, యణుమంత యుఁ దెలుపకుంటిరి. ఇది యేటిన్యాయము!"

"వచియించుచుంటినికదా! వినుఁడు. ఆమాయారాణి వాస్తవముగఁ గమలాదేవి కాదని యెఱుంగుఁడు."

ఈవచనము నాలించినంతనే ముకుందసింహునకును మృగాంకవతీరాజేశ్వరులకు నొదవిన విస్మయాందోళనములకు మేరలేదు. తుదకు వారికి హర్షవాయువుగూడ జనించుటకు సిద్ధపడెను. కొంత సేపటివఱకుఁ బలుకుటకుఁగాని, వినుటకుఁగాని యామువ్వురకు శక్తి

లేకుండెను. తదనంతరము కొంతస్థిరపడి మృగాంవతి అభయసిం హునితో నిటులఁ బలికెను.

“నే నెట్టిలజ్జావశంబునఁ బ్రియలకు మోము జూపుటకుసహిత ము సంకోచించుచుంటినో, యయ్యది యిపుడు తొలఁగిపోయినది. నేనిపు డతిముదంబున జమేలితూ రాజకర్మచారలయెదుట మాయా రాణివిషయమునఁ దలయెత్తి సంభాషింపఁగలను. కాని, మీవచన ములు నిక్కవములనుట కేమి నిదర్శనము?”

అభయ:— నే నెపుడు తిలస్మాధ్యక్షుని వేషంబున సురంగమార్గ మంనఁ బ్రవేశించితినో, మఱియు మాయారాణితో నాకు సమావేశము గలిగెనో, యపుడు మీ రెల్లరకుఁ దెలివి గలి గించువిషయమున మాయిరువురకు జగడము గలిగెనని సం క్షేపముగ మీకు వచియించియుంటిని.

ముకుంద:—ఔను. మీరు వక్కాణించియుంటిరి.

అభయ:—అపుడు మాయారాణికిని నాకును జరిగిన సంభాషణము ను బిదప నెఱింగించెదను. ఆమోసకత్తె వచియించియుండిన కొన్నిమాటలయందలి ప్రత్యక్షరమును పాఠశాలయందుఁ జదువు బాలురచందంబున కంఠస్థమొనరించుకొనియుంటిని. ఆమాటలను మీకు వివరించుచుంటిని వాని నాలించుటవ లన నావలెనే మీకును నామె కమలాదేవి కాదనువిషయము బాగుగ బోధపడఁగలదు. ఆమె యిట్లు వచియించియుండెను.

“నేను ముకుందసింహుని వచించిన విషయము మీకు వెల్ల డింపక దాఁచియుంచితినను చింత మీకుఁ గలిగియున్న మీరును వెనుకటివిషయములను గొంచెను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుటమేలు అందు ముఖ్యముగ నయంధకారబంధురంబగు రాత్రివేళ... దేనియందు

నావివాహము నాకుబదులుగ బ్రతిమలో.........మీరే నన్నింత కుఁ దెచ్చినది. నాకు దుర్దశ సంభవించిన మీకుమాత్రి మది తప్పు ఎట్లు? మీరు ముకుందసింహునిఁ గాపాడదలంచిన, కమలాదేవి రహస్యము వెల్లడియగుచో, మీకది దుఃఖదాయకము గాకుండునా? మఱియు మిమ్మతఁ దూరకవిడచునా? నే నేయనుచిత కార్యములను గావించియుంటినో యవియన్నియు మీరు కావించియుండిన యప రాధములుగ భావింపఁబడకుండునా? నే నీవిషయములన్నింటిని ద లంచియే ముకుందసింహుని బంధించియుంచితిని. అధ్యక్షుని కార్యా చరణమువలననే కమలాదేవి స్థానమున..........."

మాయారాణి యింతదనుకఁ బలికి మిన్నకుండెను. పరిసంగ ధోరణియందు నే నావిషయమున నపరిచితుఁడననియు నేను నిక్క వముగఁ దిలసాధ్యక్షుఁడను గాననియు నామెకుఁ దెల్లమగునను భీతి నామె మాటలకుఁ బ్రత్యుత్తరంబొసంగుట యనుచితంబని తలంచి మిన్నకుంటిని.

ముకుంద:—చాలును. చాలును. మాయారాణి నోట వెడలిన యీ స్వల్పవచనములే సాక్షిభూతమ్ములైయున్నవి. ఆ దురితాత్ము రాలు నిక్కవముగ నాభార్య కాదు. వివాహపునాఁటి సం గతులన్నియుఁ గ్రమక్రమముగ నాకిపుడు జ్ఞప్తికి వచ్చుచు న్నవి. అవియన్నియు నీవిషయమును దృఢీకరించుచున్నవి. నిస్సందేహముగ నా విశ్వాసఘాతుకుఁడగు నధ్యక్షుఁడే యీకాముపునకు మూలము.

మృగాంక:—అధ్యక్షుని తోడ్పాటునఁ దనకార్యమును బూర్తిపఱచు కొనినపిదప నాయక్కయగు కమలాదేవి ప్రాణములను గొ నుటకుఁ దలంచియుండును. కాని, యామె యెవ్విధంబునో

తప్పించుకొని పాఱిపోయి యుండినటు లాదురాత్మురాలి మాటలవలననే తేలుచున్నది.

అభయ:—అటులనే కావచ్చును. మఱియుఁ గమలాదేవి యింతవఱకు జీవించియుండెనని నామానసంబే నాకు సాక్ష్యమొసఁగుచున్నది. మన మామెను వెదకిన నెందేనియుఁ జాడకట్టఁగలదు.

ముకుంద:—నాకు నటులనే తోఁచుచున్నది. కాని, యామె నన్ను గలసికొనుటకుఁగాని, యారహస్యములను వెల్లడించుటకుఁగాని ప్రయత్నింపకుండుట మిక్కిలి పశ్చాత్తాపకరము.

మృగాంక:—ఆమె యేవిధంబగుప్రయత్నమును జేసియుండలేదని మీరెటుల వచియింపఁగలరు? బహుశః యామె ప్రయత్నము సఫలము గాకపోవచ్చును. మఱియు మాయారాణీతిల స్వార్ధ్యత్తుల చతురతయుఁ జాకచక్యమును సామాన్యములయినవి కావుగదా! ఇఁక నామె తప్పేమికలదు? నేనామెకుఁ దోఁబుట్టువునైయుండియు నామె మోసము నుండి తప్పిపోఁగలిగితినా? ఇఁక నితరులవిషయ మేలవచియింపవలెను? ఆమె వివాహముజరిగి నాలుగువత్సరములు గతించిన పిదప మా తల్లి మృతినొందుటచే నేనును రాజేశ్వరియు నీమెచెంతకు వచ్చి చేరితిమి. మాయారాణిరూపమును గాంచుటతోడనే నాకపుడు కొంతసందేహము జనించినది. కాని, యానాలుగు సంవత్సరములలో నామె రూపమం దట్టి పరివర్తనము గలిగి యుండవచ్చునని తలంచి యాసందేహమును నామానసము నుండి తొలఁగించుకొంటిని. మఱియు ననేకబాలికలకు వివాహమైన పిదప మూఁడునాలుగు సంవత్సరములలో రూపరే

ఖావిలానంబులందు మార్పుగలిగి గుర్తించుటకు సహితము సాధ్యము గాకుండుననుటయు నొక వింతవిషయముగాదు.

అభయ:—నిక్కువము. దానియం దెట్టిసందేహమునులేదు.

మృగాంక:—మఱియొకవిశేషము గలదు. ఒకయక్క తనసోదరీమణుల నెంత మమతనాదరించుట సంభవమో, యట్టివిధంబుననే యాకుటిలహృదయ మాయారాణియు మద్భగినిపురను నాదరించియున్నది. కాని, ఆయాదరణము వీరి (ముకుందసింహునివైపునకు సంకేతించి) బంధించుటకు మాత్రమే కలదు.

ముకుంద:—అయ్యో! మా కులసాంప్రదాయకమే నన్నిట్టిస్థితికిఁ దెచ్చినది. వివాహమునకుఁబూర్వము నే నామెను జూచి యుండలేదు. ఇఁక నామెను గుర్తించుటెట్లు?

మృగాంక:-అయ్యో! గొప్ప యనర్థమే సంభవించియున్నది. ఇపుడు మదీయసోదరీమణి కమలాదేవి నెచట వెదకుదును. ఎటులఁ బడయఁగలను?

అభయ:—మాయారాణి నన్నుభృత్యునిగ భావించి నాకు బోధించు తలంపులో నేయేవిషయములను బలికియుండెనో, వానినిఁ బట్టి యోజింప నాయధ్యక్షుఁడే కమలాదేవిని బంధించి యే గుప్తస్థానమందునో దాఁచియుంచెననియుఁ గొన్నిదినములకుఁ బిదప నామె యెవ్వనిసాయంబుననో తప్పించుకొని పారిపోయియుండెననియుఁ దోఁచుచున్నది. మఱియు నేహేతువు వలననో యామె మృగాంకవతీరాజేశ్వరితోఁ గలసికొనఁ జాలదాయెను. తదుపరియు నట్టితరుణ మామెకుఁ జిక్కి యుండకుండును.

ముకుంద:—అధ్యక్షుని బాధింపకయే మన మీరహస్యమును దెలి సికొనఁజాలము.

అభయ:-అతఁడు రోహిణీగడమందు బంధింపఁబడియున్నాఁడుగదా!

అంత నొకవైపుననుండి, "అధ్యక్షుఁ డిపుడు గోహిణీగడ మందు లేడు. అతఁ డేవెరవుననో తప్పించుకొని పారిపోయె" నను ధ్వని వెడలివచ్చెను. అభయసింహుఁడు వెంటనే వెనుకవైపునకుఁ దిరిగి కాంచునంత వానిదృష్టి రణతేంద్రసింహునిపైఁ బడెను. రణ తేంద్రసింహుఁడు వారిని సమీపించి తనతండ్రి పాదములపై నొ‌ఱి ‌ెను. మఱియు ముకుందసింహ నరపాలునకు నమస్కరించి నిల ‌ను. పిదప నతఁ డాజ్ఞను బడసి యచటఁ గూర్చుండెను.

యి:-(రణతేంద్రసింహునితో) రణతా! నీవిచట చాలసేపటినుండి నిలచి మాసంభాషణము నాలించుచుండినటులఁ దోఁచుచు న్నది. మాటలసందడిని నీరాకను గొంచెమైనను గుర్తింపఁ జాలమైతిమి.

—జనకా! లేదు. నేనిప్పుడే యిచటికివచ్చి చేరితిని. నేను ప్రత్యుత్తరం బొసంగిన తుదిమాటదక్క నితరమేమియు నే వినియుండలేదు.

— మే మిచటనుండిన సమాచారము నీకెటులఁ దెల్ల గాయెను?

నేను తలస్నోద్యానపు నాల్గవతరగతి తోఁటలోనికిఁ బోవు ంపుతో నేగుచుంటిని. కాని, తలస్నాధ్యక్షుని విశ్రామ ందిరమునొద్దకుఁ జేరినంతనే యది విధ్వంసమైయుండుట నామానసము పలువెతలకుఁ బాలయ్యెను. ఆమందిర స్థలమునకుఁ గారణము తుపాకిమందుగాక వేఱొకటి ియు, నీకార్యాచరణము మానవగతు లెవ్వరో కావిం

చియుండుగనియుఁ దలంచి, దాని నిశ్చితార్థ మెఱుంగుటకు నాకిచ్ఛ జనించినది. తత్కారణంబున నే నాతిరస్కృతధ్యాన పుఁతోఁటలోనికి బోవక నెవ్వరితోడనైనఁ గలసికొని యీ సమాచారమును దెలిసికొను తలంపుతోఁ నీయుపవియందు సంచరించుచుంటిని. అంత నీవైపుననుండి యీదివ్య పరిశా శము చూపట్టుటచే నే నధికముగ శ్రమనొందను వగత్వ ము గలుగలేదు. ఇపు డన్నిటికంటె ముందుగ నామందిర విధ్వంసకారణమును దెలిసికొనఁ గోరుచుంటిని. మీ కాస మాచారము తెలిసియుండిన వివరింపుఁడు.

అభయ:—విజయేంద్రసింహ మహీపాలుని కుశలసేమము నాలిం చిన పిదప నీకుఁ జెప్పదలంచిన వార్తలతో ముఖ్యముగ నా మందిర విధ్వంసకారణమును వివరించి తెలిపెదను. కారణం బేమన, నీవిపు డొకకఠినకార్యమును గావింపనున్నది. మఱియు నా కార్య మెంతయావశ్యకమైనదో యామందిరపు స్థితి నాలించుటవలన నీకు బోధపడఁగలదు.

రజతే:—అమ్మహారాజు కుశలపూర్వకముగ నున్నారు. ఇచటి సమాచారము నాలించి కోపోద్దీపిత మానసుండగుటచే నతఁ డు వ్యగ్రముగఁ గూర్చుండఁజాలకుండెను గాని, మీరు వా రిని వీడ్కొను సమయంబున శపథము పెట్టి వచ్చినవిషయము వారికి నిరంతరము జ్ఞప్తికలిగి యుండుచున్నది. నిజముగ వారు మిమ్ము నిర్మలాంతఃకరణముతోఁ గోరుచుండిరనుట యతి శయోక్తి గాదు. వారు కొలఁది గొప్ప సేనను సామర్థ్యము గలిగియుండినను పై హేతువువలననే మిన్నకుండుచుండిరి.

అభ:—అవును. నే నాభూపాలునితోఁ గుమారికడమునకుఁ బోయి యింతి గైకొనుచుండుఁడనియు మే మొనరించు కార్య

ములను గాంచుచుండు(డనియు బోధించి వచ్చితిని బహుశః మన వృద్ధమిత్రు(డు కుమారిగడమున కేగియుండునని తలం చెదను.

రజతేం:— కాను. వారు కుమారిగడమున కేగియుండిరి. మఱియు నేనివ్వడచటినుండియే వచ్చుచుంటిని. రోహిణీగడమునందు జ్యోతిష్యులుగారుమాత్రమే కలరు. వారికి రాజకీయకార్యములనుండి స్వల్పావకాశముమాత్రమే దొరకుచున్నది. తత్కారణంబున( దిలస్వాధ్యక్షు(డు వారిని వంచించి యెవ్విధంబుననో చెరసాలనుండి పారిపోయియున్నా(డు. ఈసమాచారము కుమారిగడముకు( జేరినంతనే భవిష్యమం దెట్టియుత్పాతము లేనియు సంభవింపవచ్చునను తలంపుతో జాలిమసింహు(డు రోహిణీగడమునకు( బుత్తెంపబడెను. మరల శాసించువఱకు నతఁ డచటనే యుండుట కాజ్ఞాపింపబడియుండెను. మఱియు నిచటి వృత్తాంతముల నెరింగివచ్చుటకు నే నిటకు( బుత్తెంపబడితిని.

అభయ:— మంచిది. తిలస్వాధ్యక్షుని విశ్రామమందిర వినాశకారణమును వక్కాణించుచుంటి నాలింపుము.

తదనంతర మభయసింహు(డు తాను సురంగములోనికి( బోవుటయు, నచట మాయారాణితో( గలసికొని సంభాషించుటయు, మృగాంకవతీముకుందసింహు(డు మున్నగువారలు బంధింప(బడుటయు( దాను వారిని బంధవిముక్తులనుగ నొనరించుటయు, నధ్యక్షుని విశ్రామమందిరము విధ్వంసమొందిన కారణమును నాతరవాయివృత్తాంతమును జెప్పనారంభించెను. రజతేంద్రసింహు( డా సమాచారములన్నింటిని గడుశ్రద్ధ నాలించుచుండెను. అభయసింహు( డావిషయములన్నియు( జెప్పి ముగించినపిదప రజతేంద్రసిం

హుఁడు వానితో, "మాయారాణి, మృగాంకవతీరాజేశ్వరులకు సహోదరి కాదను నొక విచిత్రవార్త నేఁడు వినవచ్చినది. (కొంచెము యోజించి) ఈయదార్థవృత్తాంతమును దెలిసికొనుట కామెను శీఘ్రముగ బంధించు టుచితము. ఆదురాత్ముఁడగు తిలస్మాధ్యక్షుని గూడ వెదకి చెఱఁబెట్టవలె" ననెను.

ముకుంద:—అటులనే జరుగఁగలదు. మున్ను మనము యోజించి యుండిన విధంబున నే నిపుడు ప్రచ్ఛన్నముగ నుండుటకుఁ గోరెదను.

అభయ:—మనమిపు డేమి కావింపవలసియుండెనో దాని నన్నిటి కంటె ముందుగ యోజించి నిశ్చయించుకొనవలసియున్నది. (ముకుందసింహునితో) మీయభిప్రాయమెట్టిదో తెలుపుఁడు!

ముకుంద:—అభిప్రాయమెఱుంగుటయందును నాలోచించుటయందును కొన్నిగంటలకాలము గడచిపోవును. కావున నాకార్యమును మీకే విడచితిని. మీరు వచియించిన విధంబున నన్ని కార్యములును జరుగఁ గలవు.

అభయ:—(కొంచెము యోజించి) అగుచో, మృగాంకవతీరాజేశ్వరులను వెంటఁదోడ్కొని మీరు జామేలియాకు వెడలిపోవుఁడు. మఱియుఁ దిలస్మోద్యానమందుఁ బ్రవేశించి మిమ్ములను బ్రకటించుకొనుఁడు. అచట మీకు వ్యతిరేకులెవ్వరు లేకుందురని తలంచెదను.

ముకుంద:-మీరింకను వ్యతిరేకులని వచియించుచుంటిరా? నన్ను గాచినతోడనే సేవకబృంద మతి ముదంబొందఁగలదు. వారికి నాపరిచయము మున్నే కలిగించియుంటినిగదా!

అభయ:—ఎప్పుడు? నాకావిషయము గొంచెమైనను దెలియదు!

ముకుంద:-దాని నెరింగించుటకు మీతో నాకు సమావేశము మరల కలుగనాయెను. ఆవృత్తాంతమంతయు మృగాంకవతీరాజేశ్వరులును మోహన జటాశంకరులు నెరింగియున్నారు.

అభయ:—మంచిది. ఆసమాచారమంతయు సవిస్తరముగ నెరింగింపుఁడు.

ముకుంద:— అది మిక్కిలి వేడుకయగు విషయము. నేను దానిని సాకల్యముగ వివరించుచుంటిని ఆలింపుఁడు. నే నొకనాఁడు రాత్రివేళ జటాశంకరుని వెంటఁదోడ్కొని మాయారాణి నివసించు శిలాప్రాసాదమునకు కెండపడగగల తోఁటలోని కేగితిని. నే మిరుప్పురము సకాబులవలన మోములను మఱుఁగు పఱచుకొనియుంటిమి. ఆరేయి యాతోఁటమాలియ భార్యకుఁ గొన్ని రూప్యముల నొసంగి, రేపటిరేయి యర్ధరాత్రమున నీతోఁటయందలి గుప్తద్వారమును తెఱచి యుంచవలెననియు, మృగాంకవతి యిచటికి రాఁగోరుచున్నదనియు, బాగుగ బోధించి, యటు లొనరించుటకు దానిని సమ్మతింపఁ జేసితిమి

నిజముగ మృగాంకవతి యచటికిఁ బోఁ గోరుటలేదు. కాని, యెవ్విధంబుననైనను మృగాంకవతి యాతోఁటలోని కేతెంచు కల్లవార్త మాయారాణికిఁ దెలియఁగలదనియు, దానివలన నామె మృగాంకవతిని బంధించు తలంపుతో నాతోఁటయందు సంసిద్ధముగ నుండుననియు మృగాంకవతికి మాఱుగ నేనును జటాశంకరుఁడును దానిలోనికిఁ బోవలయుననియు నాఆశయము.

ఆకారణము నేను ముందు వచియింపఁబోవు వృత్తాంతము వలన దెలియఁగలదు. ఆతోఁట మాలియభార్య యారహస్యమును గుప్తముగ దాఁచియుంచుటకుఁ గోరుచుండెను. మే మారహస

మును వెల్లడించి బాధింప బనుటకుఁ గోరుచుంటిని. ఈ కారణముచే మఱునటిదిన మర్ధరాత్రిసమయంబున నే మా తోఁటలోనికిఁ బోవక మఱియొక రహస్యమార్గమున మాయారాణి శయనాగారములోనికిఁ బోయిచేరితిని. జనాశంకపు గది వెలుపల రహస్యమార్గ మం దొకస్థానమున విడచి నే నాగదియందుఁ బ్రవేశించితిని. దానియందు మాయారాణి యొంటరిగఁ బరుండి నిద్రించుచుండెను. ఆగదియం దొక గాజుకుప్పెయందలి దివ్వెమాత్రము వెలుఁగుచుండెను. నే నాగదియందుఁ బ్రవేశించినతోడనే మొదట నాదివ్వెను జల్లార్చివైచితిని. మఱియు నావెంటఁ గొనిపోయిన కప్ప తాళమును నాగది కవాటపు చిలుకునకుఁ దగిలించి లోపలివైపునుండి బంధించివైచితిని.

ఆగది వెలుపలఁ గొందఱుస్త్రీలు కావలి కాయుచుండిరి. నే నా ద్వారమునఁగాక వేఱొక సురంగమార్గమున నాగదియందుఁ జొచ్చితిని. ఆసురంగ ముఖద్వార మాగదిలోనికిఁ గలదు. ఆగది గోడ లొకవిధంబగు మ్రానిచెక్కలతో నిర్మింపఁబడియుండెను మఱియు నాగదియం దొక గుప్తద్వారము గలదను ననుమానమైన నెవరికిఁ గలుగకుండును. ఆద్వారమొక మీటునొక్కుటవలన దెఱవఁబడుచున్నది. నే నాగది ద్వారమునకు బిగము వైచిన పిదప నెఱింగియుండియు నొక గాజుకుప్పెను భూమిపైఁ బడవైచితిని. దానిధ్వని వలన మాయారాణి తుళ్లిపడి నిద్రనుండి లేచి కూర్చుండెను.

ఆగదియందుఁ జీఁకటి దట్టముగ వ్యాపించియుండుటచే మాయారాణి రూపము నాకు సూపట్టకుండెను. తత్కారణంబున నా దుష్టురాలే యేకార్యములను గావించియుండెనో దానిని వచియింపఁజాలను. నే నడుగులుసవ్వడి వెడలునటు లాగదియం దిటునటు

సంచరింపసాగితిని. మఱియుఁ దడవులాడుచుఁ గొంతసేపటికి మాయారాణి సమీపమునకుఁ జేరి యామె చేగుత్తి దృఢముగఁ బట్టుకొంటిని. అంత నాపాపాత్మురాలు గట్టిగ నఱచుటచే నామె చెంపపై నత్తువఁగొలఁది మొత్తి యచటినుండి తొలఁగితిని.

పిదప నాయొద్దనుండిన దొంగలాంతరును వెలిగించి ప్రకాశమును గలిగించితిని. నాకరప్రహారమువలనను భయాతిరేకంబువలనను మాయారాణి మూర్ఛాగతయై భూమిపైఁ బడియుండుటఁ గనుగొంటిని. నే నాకవాటములకు వైచిన బీగమును వెడలించి పిదప నా కుటిలచిత్తయగు మాయారాణిని లేవనెత్తి పర్యంకముపైఁ బరుండఁ బెట్టితిని. మఱియు నాగుప్తమార్గంబున నచటినుండి వెలుపలకు వెడలిపోయితిని. ఆదురితాత్మురాలగు మాయారాణికిఁ దెలివిగలిగిన పిదప సంభ్రమభయాకులచిత్తయై గదివెలుపలకు వెడలునని యుఁ బరిచారిక లానమాచారము నాలించి యాజాడ కనిపెట్టుట కాయుద్యానమందు నలుగడల సంచరింతురనియు, దాన, ముందు మే మొనర్పఁదలంచిన కార్యరహస్యము మాయారాణికిఁ దెలియఁగలదనియు మా అభిప్రాయము.

తదనంతరము నేనును జటాశంకరుఁడును నొక సంకేతస్థానమున నాతోఁట మాలియభార్యతోఁ గలసికొని "నేఁ డొండొక కారణమున మృగాంకవతి యిచటికి రాఁజాలదయ్యెననియు రేపటిదిన మర్ధరాత్రిసమయంబున నవశ్య మేతెంచుననియు, నాగుప్తద్వారమును దెఱచియుంచవలెననియు బోధించితిమి. తుదకు మేము గోరిన విధంబుననే యావృత్తాంతము మాయారాణికిఁ దెల్లమయ్యెను. మఱియు మఱుచటిదినమున నాగుప్తమార్గమున దోఁటయందుఁ బ్రవేశించినతోడనే మృగాంకవతిని బంధించుటకుఁ గొందఱు పరిచారికలు మున్నగువార లచట సంసిద్ధముగ నుండిరి.

బోనని నామందిరమున కేగుటకుఁ దలంచుచుంటిని. మఱి యీ నచటినుండి తిలస్మమందుఁ జిక్కియుండిన రాకుమారు లిరువురకు యథాసాధ్యముగఁ దోడ్పడఁ బ్రయత్నించుచుం దును. ఆరాకుమారు లిరువురచేత నాతిలస్మము ఖండింపఁబ డుట బ్రహ్మలిఖితంబైయున్నను నానహాయమువలన వారి కాతిలస్మఖండనమందు విశేషపరిశ్రమ గలుగకుండును. మఱి యుఁ గుమారిచంద్రికళామదాలసలనుగూడ దిలస్మోద్యాన ములోనికి గొనిపోఁదలంచుచుంటిని

మృగాంక:—కాదు కాదు! ఆదురాత్మురాలగు మాయారాణితో నావైరమును దీర్చుకొనకయే యాతిలస్మోద్యానములో నడు గిడుదాననుగాను. మఱియు నానహోదరి కమలాదేవి యిం తదనుక నీవశ్యవంచమందు జీవించియుండిన నామెను వెదకి కనిపెట్టవలసియున్నది. చంద్రికళామదాలసలను గూడ మీ గృహమునకుఁ దోడ్కొనిపోవు టుచితముగాదు. మీ రీవి షయమును పర్యాలోచించి చూడుఁడు. మఱియు నాయిరు పురవిషయమున మీరు నిశ్చింత నుండుఁడు. ఇప్పుడు నాయ ధీనమందుఁగల వరోవర తిలస్మమందిరమున వారిరువురు సం రక్షితముగ నుండఁగలరు. వారికచట నెట్టికష్టమును హాని యుఁ గలుగఁజాలదు. ఇఁక నావచనములకు సమ్మతించి నా యిష్టముచొప్పున నన్ను విడచిపెట్టుటకుఁ గరములఁజోడించి ప్రార్థించుచుంటిని.

ముకుంద:—(కొంచెము యోచించి) నీవచనములం దధికాంశము సత్యమును సమంజసమునైయున్నది. కాని, మర్యాదహీన ముగ నీవిటునటు గుమ్మరుట నా యభిమతముగాదు. నీ వైయారితనమునం దెంత యభిరుచిగలిగియుండినను, నా

నేర్పునందు నీ వెంతప్రావీణ్యమును సంపాదించియుండినను నాయొక్కయుఁ దదితరులయొక్కయుఁ బ్రతిష్ఠవైపునకు దృష్టి నిడుటుచితము. నేను నీయభిలాషకు బాధకుఁడను గాఁజాలను. కాని, నేను వచియించియుండిన మార్గమే యుత్తమమార్గము యోగ్యముగను దలంచుచుంటిని........"

మృగాంక:—(కొంచెము లజ్జించి) మృగాంకవతీరాజేశ్వరుల రూప మెవ్వారైనను గాంచియుండిరని కాని, యప్రతిష్ఠయు లజ్జాకరంబును నగు నేకార్యమునైనఁ గావించియుండిరని కాని విని యుండిన మీ యిచ్ఛానుసారముగ మమ్ము దండింపవచ్చును.

ముకుంద:—(అభయసింహునితో) ఇందు మీ యభిప్రాయమేమి?

అభయ:—నే నీవిషయమున నేమియు వచియింపఁజాలను. కాని, మృగాంకవతి ప్రార్థన నంగీకరించుచో వారిజాగ్రత్తకై నా సవారులలో నిరువురను విడచెదనని దృఢముగ వచియింపఁగలను.

ముకుంద:—మీరివ్విధంబున బలుకుచుంటిరి. కావున మృగాంకవతి మాటకు నమ్మతింపవలసియే యున్నది. మంచిది! వారి సంరక్షణకై కొంతమంది సిపాయిలను నేనుకూడ నియమించెదను.

మృగాంక:—నాయొద్దఁగల సైనికులే చాలుదురు. మాసంరక్షణకై వేఱుసిపాయిల యావశ్యకత యెద్దియులేదు. కాని, మీరింత కాలమునుండి మృగాంకవతిని గొల్చుచుండిన సమాచారము నాలించి మిక్కిలి సంతసించితిననియు ముందుఁగూడ నటులనే ప్రవర్తించెదరని నమ్ముచుంటిననియు వారిపేర మీకొక లేఖనుమాత్రము వ్రాసి పంపుఁడు. ఇదియుఁగాక మఱియొక విషయమునుగూడ మిమ్ముఁ గోరవలసియున్నది.

ముకుంద:—అదియెట్టిది?

మృగాంక:—నావృత్తాంతమును మీకు వర్ణించుసమయంబున మాయారాణికి సంబంధించిన యొక తిలస్మామందిరమందు రాకుమారుఁడును, వారిసంగాతకులతోపాటు శౌర్యనిధులగు నాసిపాయిలు కొందఱును బంధింపఁబడి యుండిరని తెలిసియుంటిని.

ముకుంద:—ఔను. నాకది [illegible]. వారలెల్లరు నవ్వుచు నవ్వుచు నొక[illegible]కి [illegible]కియుండిరి.

మృగాంక:—[illegible]. రాకుమారుఁడును వారిసంగాతకులును విడుదల నొం[illegible]. కాని, నాసిపాయిలజాడ యింతదనుక దెలియ[illegible]. వారలు తిలస్మాస్థానమం దెచటనో తప్పక బం[illegible]యుండెదరు. మీరు వారిజాడ కనిపెట్టఁగలరు. ఇదిగాక, వారలట్లు నవ్వుచు నవ్వుచు నామందిరమందు దుమికుటకుఁ గారణమేమో యింతదనుక నాకుఁ దెలియదయ్యెను. ఈవిషయమును రాకుమారుని ప్రశ్నించి తెలిసికొనుటకును నాకు తరుణము చిక్కనాయెను.

ముకుంద:—ఆసిపాయిలు మృతినొందకుండిన వెనకి వారిజాడ తప్పక కనిపెట్టుదుననియు, వారలట్లు నవ్వుచు నవ్వుచు మందిరమందు దుమికిన కారణమును దెలిసికొని వివరింతుననియుఁ బ్రతిన చేయుచుంటిని. మఱియు సన్నిధంబున హాసించుచు మందిరమందు దుమికినవారిలో నొకఁడగు మోహనసింహుఁ డిపుడిచటనే కలఁడుగదా! వానిని ప్రశ్నించి యాకారణ మేల తెలిసికొనరాదు?

మోహన:—క్షమింపుఁడు. నేనావిషయమును మహేంద్రసింహుని సమక్షమునగాని తిరోధానమందు వచియింపఁజాలను. అవి

షయమును వెల్లడింపక దాఁచియుంచుటకుఁ గఠినముగ నాజ్ఞాపింపఁబడుటయేగాక నావలన శపథమును గొనియున్నాఁడు.

మృగాంక:—ఇదిమిక్కిలి యాశ్చర్యకరంబగు విషయము. పోనిండు పిదపఁ జూడనగును. సెలవిండు. నాప్రార్థనను స్వీకరించితిరా? రాకేశ్వరియు నావెంట నుండును.

ముకుంద:—సరియే! నాకది సమ్మతమే! కాని, నీవొనరించు కార్యములను గడు జాగరూకతతోఁ జేయుచుండుము. మఱియు మీకుశల వృత్తాంతములను పలుసారులు నాకు సూచించుచుండ వలెను.

అభయ:—నాప్రతిజ్ఞాను సారము నాసైనికులలో నిరువురను మీయధీన మొనరించు చుంటిని. వారిని మీకు సహాయార్థము కైకొనుఁడు.

మృగాంక:—అటులయిన, దయచూని, మోహనసింహ జటాశంకరులను నాకొసంగుఁడు.

అభయ:—జటాశంకరుఁడు మీసైనికుఁడే కదా! వానిపై నింకను నాకెట్టి యధికారమును లేదు. అతఁడవశ్యము మీవెంటనుండఁగలఁడు. అతఁడుగాక మరి యిరువుర్సైనికులను గోరుకొనుఁడు.

మృగాంక:—మీకు మాపై విశేషానుగ్రహము గలదనుట నిర్వివాదాంశము. కాని, నాకెక్కువగ సైనికుల యావశ్యకము లేదు.

అభయ:—మంచిది. తరువాత జూడనగును. (మోహనసింహునితో) నీవు మృగాంకవతి కార్యములను నెరవేర్చుచు నామె వెంట నుండుము.

మోహన:— మంచిది. అటులనే కావించెదను.

అభయ:— మనమిఁక యీసభను చాలింతము. ఆకసమం దరుణ కాంతు లెటుల వ్యాపించు చున్నవో చూడుఁడు. మృగాంకవతీ రాజేశ్వరులకు వాహనముల సంగతి యేమిటి?

మృగాంక:— నేను కొంతదూర మేగిన పిదప మార్గమం దాయేర్పాటులను గావించు కొందును. మీరు నిశ్చింతగ నుండుఁడు.

మరలఁ గొంతసేపటి వఱకు వారలు సంభాషించిన పిదప నందరులేచి నిలచిరి. మఱియు మృగాంకవతీ రాజేశ్వరులు దక్షిణ దిశకుఁ బ్రయాణమై పోఁదొడఁగిరి. మఱియుఁ గొంతదూరము వెడలిన పిదప నొక ఘనారణ్యమందుఁ బ్రవేశించి యదృశ్యు లయిరి.

౧౨.

ఒకజాము రేయి గడచి యుండెను. నేటి రేయి చీఁకటి యను దినముకంటె మిక్కుటముగ [illegible] యుండెను. ఆకసంబున లెక్కించుట కనువగు [illegible] నాలుగైదు తారకముల నుండి స్వచ్ఛకాంతి వెడలు చున్నను పవలంతయు నతివేగంబున వీఁచి యుండిన తెంపిరలచేఁ బైకిఁ జెలరేగి మేలుకట్టువలె నలుదెసల వ్యాపించి యుండిన ధూపరాగమునుండి యాప్రకాశము భూమి వఱకు వ్యాపించుట కసమర్థంబగుచుండెను. దినమంతయుఁ దమతమ పనిపాటలవలన నలసి తుపానువలనను సుడిగాడ్పులు వలనను వ్యాకులమునొందిన మనుజులీసమయంబున రాజమార్గములందు సంచరించుటకిష్టపడకఁ దమతమ కుటీరముల యందును మందిరముల యందును సౌధరాజముల యందును విశ్రాంతిఁ గైకొను చుండిరి. ఈహేతువుచేఁ గాశీపుర బహిఃప్రదేశ మందలి తోటలన్నియు జనశూన్యంబయి విచిత్ర నిస్తబ్ధత కాలవాలమై యుండెను. కాని, ఒకపురుషుఁడుమాత్ర మాపట్టణమున కుత్తరపు టెల్లయందుఁ బ్రవహించు

చుండిన వరుణానదిని దాఁటి త్రిలోచన మహాదేవుని మందిరము వైపునకు ద్రుతపదంబుల నేగుచుండెను. అతఁడర్ధరాత్రము గాక మున్నె మోహిని మందిరసమీపమునకుఁ బోయి చేరెను. ఆమందిర మం దిపుడు సులోచనమాత్రము నివసించు చుండెను. ఆపురుషుఁడు వన్నగా నామందిర సింహద్వారము నొద్దకుఁబోయి యాద్వారము బంధింపఁబడి యుండుటఁ గనుగొనెను. కాని, దానియందలి యొక చిన్నగవాక్ష మింకను దెఱవఁబడి యుండెను. అతఁడు దానలో నుండి తొంగిచూచుట వలన లోపలి ప్రక్కను నిద్దురు మనుజు లిటు నటుఁ బచారుచేయుచుఁ గావలి కాయుచుండుటఁ దెలిసికొనెను.

ఆపురుషుఁడు నిర్భయముగ నాగవాక్ష మార్గమున లోనఁ బ్రవేశించి యచట కావలికాయు చుండినవారికి మిక్కుటయె వారితో నేమియుఁబలుకక యె దనచొక్కాయి జేబునందుఁ జేయిఁ జొనిపి యేమియో వెదక నారంభించెను. ఒకభటుఁ డాశ్చర్యభరితుఁడై వానితో "నీవెవరవు? నీవేమికోరుచుంటి"వని ప్రశ్నించెను. వాని ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరముగ నాయాగంతుఁ డొకజాబును తీసి వానికొసంగి "త్వరపడుము. ప్రస్తుతమీయింటి యందుఁగల వారిలో నెవ్వరు యజమానులో వారికి వెంటనే యీజాబు నొసంగ వలె" ననెను.

భటుఁడు:—మొదట నీనామమును దెల్పి యీజాబు నెవరు బుత్తెంచిరో, దీనియందేమి వ్రాయఁబడి యుండెనో వివరింపుము.

ఆగంతు:—నీప్రశ్నములకుఁ బ్రత్యుత్తరమును బడయఁజాలవు. మఱియు నీలేఖను మీయేలికకుఁ జేర్చుటకు విలంబము చేయరాదు. ఇపుడు మాయజమాని గదియందు విశ్రాంతి తోఁబరుండి గుఱకలు కొట్టుచుండెననియు, మేల్కొల్పరాద నియు నీవొకవేళ చెప్పగలవు. కాని, యీకార్యము మిక్కిలి

విలువ గలది. క్షణకాలమైనను వ్యర్థముగఁ బోరాదు. నీవిం కను నధిక ప్రసంగములను గావించుచో నేమియుఁబలుకులు పలుకక వెంటనే యిచటనుండి వెడలిపోవుదును. మఱియు దాని ఫలితము మిక్కిలి చెడుగాఁ దేలఁ గలదు. ఇదియును గాక తెల్లవాఱుటకుమున్నె యీమందిరమున నివసించు వారలెల్లరు యమసదనమున కతిథులై యేగగలరు. తుదకీ యపరాధమంతయు నీదిగా భావింపఁబడును. పోనిమ్ము. నాకీ సంగతులతో నిమిత్తమేమి? నేను వెడలి పోవుచుంటిని.

భటుఁడు:—ఇటు వినుము! నీవేల నుగుడిపోయెదవు? నీజాబునిప్పుడే మాయజననురాలికిఁ జేర్చెదను. కాని, యట్టియాపద యేది సంభవింపనుండెనో దానికిఁ గారణమెద్దియో కొంత వివరింపఁ గూడదా?

ఆగంతు:—నేను నీప్రశ్నముల కుత్తర మొసంగఁజాలనని మొదటనే తెలిపియుంటిని కదా? నీవు నన్ను మరల ప్రశ్నించుచు వృథాపుచ్చు సమయము మీకెంతమాత్రము కూడిరానిదని నిశ్చయముగ నమ్ముము. శీఘ్రముగ మీజాబును మాయజననురాలికిఁ జేర్పుము. నేను మీక్షేమమునుగోరి వచియించుచుంటిని. కాని, వేఱు కాదు.

ఆయాగంతుని యదలింపు పలుకులతోఁ గూడిన వేగిరపాటున కాకావలి భటులును నచటనుండిన యితర సిపాయిలును నివ్వెరపడఁ దొడంగిరి. మఱియు వానిని మరల నేమైనను ప్రశ్నించి తెలిసికొనుటకు సాహసింపఁజాలకుండిరి. జాబును చేతగొనిన యా కావలిభటుఁడు తనలో దానెద్దియో తలపోయుచు నా పూఁతోఁట యందుఁగల మందిరమువైపునకు బయలుదేఱెను. మఱియు నెల్లన వృక్షములనుండి మఱుగుపడి యరగంట కాలము గడచినను

మగుడి రాఁడాయెను. అంతవఱకు నాయాగంతుఁడాద్వారముచెంత నొకప్రక్కను నిలచియుండెను. తక్కినభటులు వాని నెద్దియో ప్రశ్నించుటకుఁ దలంచుచుండిరి. కాని, శిరమువంచి యతఁ డెద్దియో విచారించుచు దీర్ఘాలోచనమున జిక్కియుండినటుల భూమివైపునకుఁ బరికించుచుండుటచే వార లేమియుఁ బ్రశ్నింపఁజాలకుండిరి.

ఒక యరగంటకాలము గడచినపిదప నాభటుఁడు మగుడి వచ్చి యాయాగంతునితో, "నడువుము. నిన్ను సులోచన పిలుచుచున్న" దనెను.

ఆగంతు:-(ఆశ్చర్యముతో) సులోచనా? ఇపు డామెయే యీ యింటికి యజమానురాలుగ నుండెనా? నేను మాయారాణితోఁ గలసికొనుటకుఁ గోరుచుంటిని.

భటుఁడు:-ఇపు డిచట సులోచనతక్క యజమాను లెవ్వరును లేరు: మీలేఖ సులోచన కొసంగుటకుఁ దగినది కాదా! ఆజాబును చదివినంతనే భయాసంభ్రమాను లామె రూపమును మార్పివైచినవి.

ఆగంతు:—కానిమ్ము! అంతహానికరమైనదిగాదు. కాని, నడువుము. నేను వచ్చుచుంటిని.

ఆయాగంతుఁ డాభటునివెంట నాతోఁటకు మధ్యభాగమందుఁగల మందిరమువైపునకుఁ బోఁదొడంగెను. పలువిధంబులగు పూలమొక్కల వరుసలకు మధ్య నేర్పఱచియుండిన సన్నని దారి ముందు నడచుచు వార లామందిరము వెనుకవైపునకుఁ బోయి చేరిరి. మఱియు నాలుగైదు మెట్లపైనెక్కి యొకచిన్న వసారాయందుఁ బ్రవేశించిరి. ఆవసారాకు రెండువైపుల రెండుగదులు గలవు. కుడితట్టునగల గది యిపుడు బంధింపఁబడియుండెను. ఎడమవైపు గది తలుపులు తెఱవఁబడియుండెను. దానిలోపల నొకదివ్వె వెలు

గొందుచుండెను. వారిరువురు నాగదియందుఁ బ్రవేశించిరి. అచటి నుండి మేడపైకిఁ బోవుటకు సోపానములు గట్టఁబడియుండెను. వార లామార్గమున సౌధోపరిభాగమున కేగి యొకగదియందుఁ బ్రవేశించిరి. ఆగదియందు పలురంగులుగల మెత్తని తివాసి యొకటి పఱచఁబడియుండెను. ఆతివాసీదక్క నాగది భూమిపై నెట్టిసామగ్రియును లేదు. ఎదుటిగోడయందు ద్విశాఖలుగల దివ్వె యొకటి గలదు. దాని నుండలి గాజుకుప్పెలయందు మైనపువత్తులు వెలుగుచు నాగది యంతయుఁ బ్రకాశవంతముగఁ జేయుచుండెను. ఆగదికి మొకముత్తట్టున మఱియొకగది కలదు. దాని ద్వారముపైన బలుచని యెఱ్ఱ పట్టుతెర యొకటి వ్రేలాడుచుండెను. ఆయాగంతుఁడా తెర వైపునకు మోమిడి నిలచియుండెను. ఆగదియందు వారిరువురుదక్క నితరులెవ్వరును లేరు.

వారిరువురు జాలసేపటివఱ కచట నిలువవలసివచ్చెను. ఈ లోపున నాయాగంతుఁడా తెరచాటుననుండి తన్నెవరో బాగుగ నిదానించి చూచుచుండెనని తెలిసికొనెను. కొంతవడి కా తెర మఱుగుననుండి చక్కగ నలంకరించుకొనిన యిరువురు పరిచారికలు విచ్చుకత్తులను చేత ధరించి వెలువలకు వెడలివచ్చిరి. తదనంతరము బహుమూల్య రుచిరాంబరములను ననర్ఘమణిమయాభరణములను ధరించి సులోచన యా తెరచాటుననుండి బయల్వెడెను. ఆమె మొలయందుఁ దిలస్మాకైజాతు గలదు. దాని జంటవస్తువగు నుంగరమును నామె వ్రేలియందుఁ జూపట్టుచుండెను. సులోచన యాయాగంతుని దెసఁ బరికించి, "నీ వెవరిపనుపున వచ్చితివి. నీపే రేమి? నిన్నెచటనో గాంచియుండినటుల దోఁచుచున్నది. కాని, యెవ్వ డెచటఁ గాంచియుంటినో బొత్తిగా జ్ఞప్తికి రాకున్న"దనెను.

ఆయాగంతుని వయస్సు రమారమి నలుబదియైదువత్సరము లుండును. వానియాకారము పొడవు. కాయము చిక్కియున్నను వి

గుల దృఢసుయినది. దేహచ్ఛాయ మెరుపు. హేము సుందరంబై ప్రకాశమానంబుగ నుండెను. కన్నులు కడు విశాలములు. ఇవుడవి కొంచెదిగ నెర బాఱియుండెను. అతఁడు ధరించియుండిన వలువ లంత విలువగలవి గాకున్నను మిక్కిలి దీటుగను దేటగ నుండెను. తెల్లని పాఱుజామయు మడిమలక్రిందకు దిగఁబడిన యంగరకాయయు, దానిపై వదులుగనుండిన నడికట్టును, పెద్ద తలపాగయు నతఁడు ధరించియుండెను. దీర్ఘదృష్టిఁ బరికించిన తనఁడొక యల్పుఁడని గాని తుంటరియనిగాని వలుక వీలులేదు.

సులోచన వచనంబుల నాలించి యాపురుషుఁడు చిరునగవుతో, "యింతియేకాదు. నీవు నన్నింకను ప్రశ్నింపఁగలవు. కాని, యితరులయెదుట నీప్రశ్నములకుఁ బ్రత్యుత్తర మొసంగఁజాలను. కారణంబేమన, నేనొక రహస్యకార్యమునకై యేతెంచియుంటిని. నీకెట్టిభీతియుఁ గలుగకుండిన (భటునివైపునకును బరిచారికలదెసకును సంకేతించి) వీరి నిచటినుండి వెడలఁద్రోలుము. పిదప నీప్రశ్నములకు సదుత్తర మొసంగెద"ననెను.

ఆయాగంతుని వచనంబుల నాలించినంతనే సులోచన, తన మొలయందుఁగలఁ బిలస్మకైజారుపైఁ దన కధికవిశ్వాసము గలిగి యుండినటులఁ దనదృష్టి దానిపైఁ బ్రసరింపఁజేసెను. తదుపరి నా భటునివైపునకును బరిచారికలదెనకును బరికించి యచటనుండి వెడలిపోవుటకు సన్నజేయుచు, "కాదు కాదు! నేను నీవంటివానికి భీతిల్లుటకెట్టి హేతువును బొడకట్ట" దనెను.

ఆగంతు:—(భటుఁడు మున్నగువారలు వెడలినపిదప) మంచిది నీవేమి ప్రశ్నింపఁదలంచితివో యివుడు ప్రశ్నింపుము.

"నీ వెవరివనువున వచ్చితివనియు నీపేరేమనియు మరల ప్రశ్నించుచుంటిని."

"నన్ను 'సుందరలా'లని పిలుతురు. నిన్నెవరు 'పుష్పమంజరి'యని జనము పిలుచుచుండెనో, మఱియు బజారులో నంగడియందుఁ గూర్చుండి క్రీఁగంటిచూపులఁ బర్వఁజేయుచు వందలకొలఁది కోడకాండ్ర డెందములను సంక్షుభిత మొనరించుచుంటివో యా కాలమున బహుశః నీవు నన్ను చూచియుందువు. విత్తమెక్కుడుగా నుబ్బరమగుటతోడనే వెనుకటి నెయ్యఁగాండ్రను మఱచుట వనుచుఁజేఁత వడుచులకుఁ బరిపాటియైనదే! గుంజిగుంజి ధనమును లాగుకొను కాలంబున నుసురులుకంటె మిక్కిలి మక్కువగ దోఁచు వలపుకాఁ డొకప్పుడు చూపట్టిన వాని నెప్పుడో యెచటనో చూచియుంటినని పలుకుటయు నంపుడుకత్తెలకు సొంపగుమాటయే! ఎత్తిపొడుపుమాటల నీమానసమును నొవ్వఁజేయు తలంపుతో నేనిటులఁ బలుకుటలేదు. నీవిపు డున్నతస్థితియందుంటివి. కావున, వెనుకటిస్నేహమునుదలంచి నన్ను మన్నించెదవను విశ్వాసముతోఁ బలుకుచుంటిని."

"(అనూయతోఁ గనుబొమలు విఱచుచు) మంచిది. నిన్ను నే గుర్తించితిని. నీవిపు డేమికోరుచుంటివో వివరింపుము."

"(నవ్వుచు) నన్ను వీడ్కొల్పుటకుమాత్రము గోరుచుంటిని. మిన్నక నే నిచటినుండి వెడలిపోవుదును."

"నాయభిప్రాయ మదికాదు. నాభటునిచేఁ బంపిన యీజాబునందలి రహస్యములను నే నెఱుంగఁగోరుచుంటిని. మఱియు దీనియందుఁ గమలాదేవి వెల్లడియగుటవలన గొప్ప యనర్థము వాటిల్లనుండెననియు, నామె ప్రతికక్ష పక్షపాతు లొక్కుమాఱుగఁ దమప్రాణములను గాపాడుకొనుచుఁ బారిపోవుటుచితమనియు లిఖింపఁబడియున్నది. (జాబునఁజూపి) ఆజా బిదియేకదా!"

"ఔను. మఱియుఁ బదిరెండు గంటలకాలముకుఁ బిదప సేమ సేయుటకును సాధ్యము గాదనియు వ్రాయఁబడియున్నది."

"నిక్కువము. కాని, కమలాదేవి యెవరు? ఆమె వెల్లడియగుటవలన మా కేట్టినష్టము కలుగఁగలదు?"

"(ఆశ్చర్యముతో సులోచన మోహనునివైపునకుఁ బరికించుచు) ఏమి! నీవు కమలాదేవికి సంబంధించిన రహస్యముల నెఱుంగవా? మాయారాణి యారహస్యములను నీ కెఱింగింపకుండెనా? అగుచో, నారహస్యములను వెల్లడించుట యనుచితముగ నేనును దలంచుచుంటిని. మాయారాణి యిపు డెచటఁగలదో చూపుము. నే నామెతోఁ గొంత సంభాషింపవలసియున్నది."

"ఆమె నీకెటులఁ జూపట్టగలదు? ఆమెకుఁ గలిగియుండిన యత్యున్నతపదవిని నీ వెఱుంగవా? మఱియు నామెను బరపురుషు లెవ్వరేనియుఁ జూడఁగలరా?"

"నాకు సర్వమును దెలియును. నాకామె మఱుగుపడఁ జాలదు."

"అటులనే కావచ్చును. కాని, యిపుడామె కార్యార్థ మెచటికో వెడలియున్నది."

"అగుచో, నేనును వెడలిపోయెదను. నీవు సాధ్యమగునంత శీఘ్రముగ నిచటినుండి పారిపోయి ప్రాణములను గాపాడుకొనుట కుపదేశించుచుంటిని."

ఇవ్విధంబునఁ బలికి సుందరలాల్ లచటినుండి వెడలుటకు సిద్ధపడెను. సులోచన వాని నాపుచు, "యిటుచూడుము! మనము పురాతనస్నేహితులమని నీవిపుడే పలికియుంటివిగదా! ఆస్నేహమును తలంపునకుఁ దెచ్చుకొని, కమలాదేవికి సంబంధించిన రహస్యములను నాకుఁ జెప్పఁజాలవా? మఱియు మా కెట్టియాపద రాఁగలదోయుండెనో దానినిగూడ స్పష్టరూపంబున వచియింపఁజాలవా?"

"నీకును నాకును బురాతనస్నేహము గలదని తప్పక స్థిరపఱచఁగలను. మఱియు నింతదనుక నీయందలి ప్రేమ నన్ను విడచిపో

కున్నదనియుఁ బలుకఁగలను. కాని, (కొంచెము యోజించి) మంచి ది. నేనొకజాబు నొసంగుచుంటిని. కైకొనుము. దానిని జదువుట వలన వృత్తాంతమంతయు బోధపడఁగలదు. కాని, (గదిద్వారముపై వ్రేలుచుండిన తెరవైపునకుఁ జూపి) యా తెరచాటున నేపరిచారికయే నియుఁ దాఁగి మన సంభాషణము నాలించుటలేదుగదా యను శంక వొడముచున్నది."

"లేదు లేదు నీసందేహమును బాపుచుంటిని. చూడుము."

అని పలికి సులోచన ద్వారముచెంతకేగి యా తెర నొక ప్రక్కకుఁ దొలఁగించి యా ద్వారమును బంధించివేచెను. సుందరలాలు సులోచనచేతనుండు జాబుగైకొనియుని చూపి "దీనిని మాయారాణికి నిచ్చుటకై నీ సంగతిని నిశ్చయించుకొన వచ్చితిని. కాని, నీ వామె ప్రాణతుల్యముగ భావించుచుండుటచే నిన్నిట్లు నమ్ముకొని యిట్లు చెప్పితిని. ఆమె నన్ను ప్రేమించి యుండుటయేగాక తనప్రాణములకంటె మిన్నగ దలఁచుచున్నది."

"అక్కజము! తిలస్మమహారాణియగు మాయారాణి విషయమున నిట్టి విటంవపుమాటలను పలుక సాహసించుచుంటివి? నిస్సందేహముగ నీవు వట్టి కల్లరివి. మోసగాఁడవు. నిన్ను ప్రేమించుట కామె కగత్య మేమిగలదు? నావలె నామె వేశ్యాకులమును బ్రకాశింపఁజేయునది కాదుగదా!"

"(నవ్వుచు, జాబుండినచేయి వెనుకకుఁ దీసికొని) ఆఁ ఆఁ నీ వసలువృత్తాంతమే యెఱుంగకుండిన నిఁక నామాట లెట్లు గ్రహింపఁగలవు? నీవు మాయారాణికి సఖివని, పిలిపించుకొనుటకుఁ దగియుంటివి. కాని, యామె నిన్నొక పరిచారికవిధమున నైనఁ జూచుచుండుట శోచనీయము. ఈ హేతువుచేతనే యామె తనరహస్యములను గొంచెమైనను నీకు వివరించియుండలేదు. మఱియు మా

ముతో నే నీజాబును వ్రాసియుంటిని. మఱియు దీని నెవరిచేతనైన వృత్తెంచి రాఁగల విపత్తినుండి యామె నుద్ధరించుట నాయభిప్రాయము. కాని, పశ్చాత్తాపకరము! నేను స్వయముగ నేతెంచియు నామెను కలసికొనజాలనైతిని. సరియే! నీవీజాబును చదువుకొమ్ము. మఱియుఁ గూర్చుండుము. నేను కూడ గూర్చుండుటఁ కనుమతింపుము. చాలసేపటినుండి నిలచియుండుటచే నాపాదములు మిక్కుటముగ నొచ్చుచున్నవి."

సులోచన యాజాబును జేతఁ దీసికొని సుందరలాలుతోఁ గూర్చుండుమని పలికి తాను నచటఁ గూర్చుండెను. మఱియుఁ గవరు చించి దానియందలి లేఖను వెడలించెను. ఆకవరు జించుట తోడనే దానినుండి యొకవిధంబగు మధురసుగంధము వెడలి యామె మానసమున కనలేని సంతృప్తిని గూర్చెను. నేఁటిదనుక నామె మెదడునం దట్టి కమ్మని పరిమళము ప్రవేశించియుండలేదు. జాబును చదువుటకు ముందుగ నామె దాని నెన్నిమాఱులో వాసనజూచి, కన్నులు మూసికొని, "వహ్వా! వహ్వా"యని పలుకఁదొడంగెను. మానసమునకును మస్తిష్కమునకును దృప్తిని గూర్చుటయే గాక, యత్యానందముతోఁగూడిన మైకము గలిగించుగుణ మాసుగంధముందుఁ గలదు. అందుచే నామె యాజాబును చదువుటకు మున్నె చైతన్యత్వ విచారములకు సంబంధించిన మేధాశక్తి బొత్తిగాఁ దొలఁగిపోవుచుండెను. మఱియు ననతికాలములోనే యామె మూర్ఛాగతయై గోడ నానుకొనిపోయెను. ఆమెస్థితిని గమనించి సుందరలా లేమియు యోజింపకయే సమీపమున కేగి తిలస్మకై జారుకు జంటవస్తువగు నుంగర మామె వ్రేలినుండి తీసికొని నోట దాఁచివైచెను. మఱియుఁ దన చొక్కా జేబునుండి యట్టిస్వరూపముగల మఱియొక యుంగరమును వెడలించి దాని నామె వ్రేలికి

దొడిగెను. తదనంతరము నడికట్టునందు మఱుగుపఱచియుంచిన కైజారును దన మొలనుండి తీసి సులోచన మొలయందుంచి యామె తిలస్మకైజారును తనమొలయందు జొనిపికొని నడికట్టువలన దాని మఱుగుపఱచి యుంచెను. సుందరలాలాయుంగరమును కైజారును సరిగా దిలస్మకైజారు నుంగరములవలె నిర్మించి యాకార్యముకొఱకే గొని తెచ్చియుండెను. వాని నెంతసూక్ష్మదృష్టిని పరిశీలించినను నెవరి కెట్టినందేహము గలుగకుండునటు లవి నిర్మింపఁబడి యుండెను.

కైజారును నుంగరమును మార్చివైచిన పిదప సుందరలాలాపరిమళముతోఁ గూడియుండిన జాబును గూడ దీసికొనెను. మఱియుఁ దానికి బదులుగ నట్టి రూపముగల మఱియొకజాబు నామె కరమం దుంచెను. దానినుండియు నట్టివిధంబగు సుగంధమే వెడలుచుండెను. కాని, మూర్ఛగొల్పు గుణములేక మూర్ఛను బాఱఁద్రోలుగుణము దానియందు గలదు. కేవల మింతమాత్రపు వ్యత్యాసమాజాబులు రెండింటియందుఁ గలదు.

సుందరలాలాకార్యమునుండి తీరిక గనినపిదప మరలఁ దన స్థానమునకుఁ బోయి కూర్చుండి సులోచన చైతన్యయగు మార్గమును నిరీక్షించుచుండెను. కొంతవడి కామె చైతన్యయై కన్నులను దెఱచి, సుందరలాలువైపునకుఁ జూడఁదొడంగెను. మఱియు నాజాబును మరల మరల వాసన జూచుచు, "దీనివాసన మిక్కిలి బాగుగను బ్రియముగను దోఁచుచున్నది. కాని, నాకేమాయెను? నేను మూర్ఛాగతురాలనైతినా? యని ప్రశ్నించెను.

"(నవ్వుచు) వహ్వా! బాగు! ఒక్కమాటు కన్నులుమూసి తెఱచుట, మూర్ఛావస్థయని తలంపఁబడుచుండిన నటుల కావచ్చును. నీవొక క్షణకాలమైనను కన్నులు మూసియుండవు. అదియైనను దీని పరిమళమందలి మాధుర్యమువలన."

"(నవ్వుచు) నీవు మాయారాణికి మేనమామవు గాని-చో నేమైనను వచియించుటకు సాహసింతును. మా ప్రాణములను గాపాడు చింతయందుఁ జిక్కియుండియు నీవిట్టి విధంబున మేళమాడుట యుఁ దగదు. మంచిది. దీనియం దేమి లిఖింపఁబడియుండెనో చదివి చూచెదనుగాక! (జాబును చదివి) ఆహా! దీనియందు వ్రాతపంక్తులు విస్తారముగఁ గాన్పట్టుచున్నవి. కాని, వానియందలి యభిప్రాయ మిసుమంతయు నాకుఁ దెలియకున్నది."

"చాలును! మాయారాణికి నీపైఁగల స్నేహభావము వట్టి బూటకంబని నాకిపుడు నిశ్చయమయ్యెను. ఆమె నిన్ను బాగుగ నమ్మియుండిన తనరహస్యముల నేల దాఁచియుంచవలెను! తనరహస్యముల నామె నీకు వెల్లడించియుండిన నీజాబునందలి సంగతులతి సూక్ష్మముగ గ్రహింపఁజాలియుందువు. ఆమె తనరహస్యములలో ముప్పాలువంతైనను నీకుఁ దెలిపియుండదు."

"నిక్కవము. నాకును నటులనే తోఁచుచున్నది. నీవు నాపైఁ గరుణఁబూని యిచటినుండి పారిపోవుట కుపదేశించుచుంటివి. కావున వట్టిదయతోడనే దానికారణము గూడ విశదీకరింపుము నేనిపు డేమి సేయవలెనో—యీయాపదనుండి తప్పించుకొనుటకుఁ దెర వెయ్యదియో—ఎచటికిఁ బారిపోవలయునో—నా కేమియుఁ దోఁచకున్నది."

"నేను దీని కేమియుఁ బ్రత్యుత్తరం బొసంగఁజాలను. కారణం బేమన, నే నేయుపాయాంతరమేనియుఁ దెలిపినను లేక, వెంటఁ దోడ్కొనిపోయి నిన్ను గాపాడెదనని యభయ మొసంగినను, నీవు నన్ను నమ్మఁజాలవుగదా! ఇదియుఁగాక నీమానస మిపుడు రాజకీయవిషయములందు బాగుగఁ జిక్కియున్నది. ఇట్టి కుటిలసమయ మందుఁ జిరకాలమునకుఁ బిదప నిన్ను నేను కలసికొనుట తటస్థించి

పది. ఏమయినను, ముకుందసింహుని వర్తమానపత్రికాహరుఁడు కాశీనగరకుఁ డీమందిరమును తనయధీన మొనరించుకొని దీనియందు నివసించువారిని బంధించునని చెప్పక తీరదు. మాయారాణి యీమందిరమందుఁ నివసించుచుండిన యీధీవార్త ముకుందసింహ నరపాలునకుఁ దెల్లంబగుటయే యీవేఁకరములన్నింటికి ముఖ్యకారణము. వానిచేఁ బుత్తెంపఁబడిన మనుజుఁ డింకను నిచటికిఁ జేరకుండినను తెల్లవాఱునరి కిచటికిఁ జేరఁగలఁడు. (కొంచెము యోచించి) ఏమి సేయుదును? నిన్నుఁ గనుగొనుటవలన మన పురాతనపున్నాగము క్రొత్తదై నీకుఁ దోడ్పడుటకు నన్నుఁ బురికొల్పుచున్నది."

"నీవు నాకిపుడు తోడ్పడుచో నాజీవితాంతముదనుక నీయుపకారమును మఱవకుండుటయే కాక, నీదాననై నిరంతరము నీయాజ్ఞ ప్రకారము నడచుచుందునని ప్రతిన చేయుచున్నాను."

"మంచిది. నేను నీకుఁ జేయఁగల సహాయమెద్దియో వివరించుచుంటిని శ్రద్ధతో నాలింపుము. ముకుందసింహుని యొద్దనుండి వర్తమానము గొని తెచ్చుచుండిన చారుని నేను బాగుగ నెఱింగియుంటిని. నాకును వానికిని చిరకాలమునుండి పరిచయము గలదు. తెల్లవాఱునరి కతఁడు వారణాసీవిహారమునకు వచ్చి చేరఁగలఁడని నావిశ్వాసము. వానిని మన సైన్యాధిపునిచేనైనను బంధింపఁగలిగిన కొన్నిదినములవఱకు నీ వీయాపదనుండి తప్పియుండఁగలవు. మఱియు ముకుందసింహ నరపాలుఁడు కొన్ని దినములదనుకఁ దన చారుని రాక కెదురుతెన్నులఁ జూచుచుఁ గూర్చుండి యుండును. ఈ యంతరమందు నీవెచటికిఁ బోవలయునో—ఎటుల నీప్రాణములఁ గాపాడుకొనఁగలవో యావిషయములను బాగుగ నాలోచించి నిశ్చయించుకొనఁగలవు."

"నీయాలోచన మిక్కిలి బాగుగ నున్నది. కాని, నీవు స్వయముగ వానిని బంధింపఁజాలవా?"

"(నవ్వి) కాదు. అటులఁ గాఁజాలదు. నీవు కొందఱ భటు లను వెంటఁదోడ్కొని నావెంట నడువుము. పట్టణము వెలుపలకుఁ బోయిన పిదప మార్గమధ్యమందుఁ గూర్చుండి యాచారుఁడరుదెంచిన వెంటనే సంజ్ఞాపూర్వకంబుగ మీకు వానిని జూపింతును. తరువాత మీయిష్టప్రకార మొనరించుకొనుఁడు. వానికిని నాకును చిర పరిచయము గలదని యిప్పుడేకదా తెలిపియుంటిని."

"మంచిది. నీవింతమాత్రవు సాహాయ్యముం జేయఁగలిగిన నే నచటికిఁ బోవు నగత్యమేమి? కొందఱు భటులను నీవెంటఁ బుత్తెంచెదను. సమయము దటస్థించినపుడు నీవు............"

"చాలుఁ జాలును. వచియించుటకు సిగ్గైనను దోచుటలేదు; నీయభిప్రాయము నే నెఱింగితిని. నా మేనకోడలగు మాయారాణి విధంబుననే నీవును స్వార్థపరురాలవు. ఒరుల నాపదయందుఁ జిక్కఁజేసి తనకార్యమును నెరవేర్చుకొనుటయుఁ దాను తటస్థముగ నుండుటయు మాయారాణికి స్వాభావికమైయున్నది. నే నీవిషయ మెఱింగియుండినను బ్రయోజనమేమి? నాప్రియపత్ని కామెపై నమితవాత్సల్యము గలిగియుండుటచే నిరుపాయుఁడ నగుచుంటిని."

సుందరలాలుని వచోపటిమ కడు విచిత్రమైనది. వానివచనములయందలి వైచిత్ర్యతరము తథ్యమను భావ ముదయింపఁజేయుట కవి తగియున్నవి. సంభాషించుసమయంబున వాని మోమునందు దీపించుచుండిన హావభావము లెట్టిచతురునినైన వంచించుటకుఁ దగియున్నవి. సులోచనకు నచ్చిగఁ బలుకు వానిమాటలయెడ విశ్వాసము జనించుటచే ముకుందసింహునిచేఁ బుత్తెంపఁబడిన మనుజుఁడు తప్పక బంధింపఁబడునను విశ్వాసముతోఁ గొందఱు భటులను వెంటఁదోడ్కొనిపోవుట కామె సమ్మతించెను. మఱియు నామె యొకతేవ తనమైఁదఁ దలి లీనస్మైజరు చెప్పునకుఁ గఁభీరదృష్టిఁ

బెదరించుటచేఁ దనభటులకంటె నాక్కైజారుపై నామెకధికవిశ్వాసము గలిగియుండినటులఁ దేటఁబడుచుండెను. కాని, యాక్కైజారు మార్పఁబడియుండెనని పాప మామె యేమి యెఱుంగును?

సులోచన తన నేర్పుపెంపున సుందరలాలును పలువిధంబుల బుజ్జగించుచు, నతఁడు తనకుఁ దోడ్పడునటుల సమ్మతింపఁజేసికొనెను. మఱియుఁ దాను వానివెంట నేగుటకు సిద్ధపడెను. ఒక యరగడియ కాలములో మగుడివచ్చెదనని సుందరలాలుతోఁ బలికి యామె తెర వ్రేలాడుచుండిన ద్వారమందుఁ బ్రవేశించెను. మఱియు నరగంటకాలము దాఁటకమున్నె యచటికి మగుడివచ్చి సుందరలాలుతో, "నడువుము. నేను సర్వవిధంబుల సంసిద్ధముగ నుంటి" ననెను. సులోచన యిప్పుడును నింతకుఁబూర్వము ధరించియుండిన వస్త్రాభరణంబులతోడనే యుండెను. కాని, యామె చేతియందొక కాటుకరంగు పచ్చడము మాత్రము గలదు. ద్వారము దాఁటుటతోడనే శిరముపైనుండి కప్పుకొనుతలంపుతో నామె దానిని వెంటఁ దెచ్చియుండెను.

తదనంతరము సులోచన సుందరలాలును వెంటఁదోడ్కొని మేడపైనుండి క్రిందికిఁ దిగెను. మఱియు మొలికలుగ నేర్పడియుండిన దారిని నడచుచు సింహద్వారమునొద్దకుఁ బోయి చేరెను. అచట నామె యాపచ్చడముతోఁ దన్ను మఱుఁగుబఱచుకొని, ద్వారమును దాఁటి ప్రయాణమును సాగించెను. ఇపు డచట నిత్యము పహారా నిచ్చుచుండు భటులుగాక మఱి యెనమండ్రుగురు భటులు సకలాయుధములతో సుసజ్జితులై ద్వారమునొద్ద సంసిద్ధముగ నుండుట మన సుందరలాలు కనుగొనెను. సులోచన యేమియు నాజ్ఞాపింపకయే వారలు సులోచనాసుందరలాలులవెంట బయలుదేరిరి. ఒక యరగడియకాలములోనే సులోచన యిట్టియేర్పాటులను గావించియుండెఁగదాయని సుందరలాలు భావించుకొనెను.

ఇరువదుగురు క్రమముగ గంగానదీతీరమునకుఁ బోయి యచటినుండి కాశీనగరపు సరిహద్దునందుఁ బ్రవహించుచుండిన వారుణానదివైపునకుఁ వడివడి పోఁదొడంగిరి. మఱియు నరగంటకాలములో నచటికిఁ బోయి చేరిరి. అప్పటికి నిశానాథుఁ డుదయించియుండెను. ఆనదిని దాఁటుటకై దానిపై నిరువదిగజముల యెత్తున నొక దృఢమగు యఱ్ఱటెడ కట్టఁబడియుండెను. ఆవంతెనకు రెండువైపుల బాటసారులు విశ్రాంతి గైకొనుటకు వన్నెంకు వసారాలు నిర్మింపఁబడి యుండెను. మఱియు వానిలోని కెక్కిపోవుటకుఁ జిన్న చిన్న మెట్లు కట్టఁబడియుండెను. ఆవదుగురు మనుజు లావంతెనపైఁ బ్రవేశించినంతనే సులోచన సుందరలాలువైపునకుఁ బరికించి, "మన మిచ్చటనే నిలచియుండవలెనా? లేక నావలితట్టున కేగవలెనా!" యని ప్రశ్నించెను. "మన మావైపునకుఁ బోయినగాని మనకార్యము దీరినా"యని సుందరలాలు బదులు పలికెను.

ఇరువదుగురు మనుజు లావంతెనపై నావలిగట్టునకుఁ బోవ బయలుదేరిరి. వారలు నావంతెనమూరంకంటె నధికముగఁ జనియుండరు. అంత నెదుటిమార్గమునుంటి యిరువురు సవార్లు పరుగెత్తుచు వచ్చుచుండిన గుఱ్ఱముల గిట్టలచప్పుడు వారికి వినిపించెను. ఆధ్వని నాలించుటతోడనే సుందరలాలు సులోచనఁ జేరి, "చూడుము. మనము చాలసేపటివఱకు వేచియుండు నగత్యము గలుగలేదు. నిస్సందేహముగ వారలు మనము పట్టదలంచిన సవార్లే యగుదురు. వారలు వారువములపై నధిరోహించి వచ్చుచున్నారు. మనము కాలినడకను బోవుచుంటిమి. కావున వారలు వెడలిపోకుండగ మనము త్వరపడవలె"ననెను.

సులోచన వెంటనే తిలస్మికైజారని తలంచుచుండిన దానిని తనచేతులనుండి యూడఁబెఱికి తనసిపాయిలవైపునకుఁ బరికించుచు,

"జాగ్రత్త! ఆసవ్వారులు వెడలిపోఁగూడదు. వారిని బంధించుటకే నేన మిచటకు వచ్చియుంటి"మని పలికెను.

మాటలాడునంతలో నాసవ్వారు లిరువురు వారిసమీపము నకుఁ వచ్చి చేరిరి. సులోచన భటులు వెంటనే యొరనుండి ఖడ్గము లనుదూసి గంభీరస్వరంబుతో, "జాగ్రత్త! ముందున కొకయడుగై నను నిడరా"దని యాహ్వానముల నదలించుచుఁ బలుకుచుండిరి. అంత వెనుకవైపునుండి కొందఱు మనుష్యులు పరుగిడి వచ్చుచుండి నటుల వారికిఁ దోఁచెను. సులోచన సంభ్రమాయత్తచిత్తయగుచు, "యిదియేమిటి? మన మిచటినుండి తప్పించుకొని పోవుటకుఁ గష్ట సాధ్యముగ దోఁచుచున్నది. మన మిరుదెసలనుండి పగవారిచే ముట్ట డింపఁబడితిమి. కానిమ్ము! నాతిలన్ముకైజా రెచటికిని బోయి యుండ లేదుగదా? యని తలంచుచు నామె కైజారు పిడిని గట్టిగా నొక్కె ను. దానినుండి యెట్టిప్రకాశమును వెడలి రాకుండుటచే సులోచన సంశయాకులచిత్తయగుచు వెనుకకుఁ దిరిగి సుందరలాలువైపునకుఁ బరికించెను. కాని, యతఁ డచటనుండినకదా చూపట్టుట? ఇవు డా మెకుఁ గలిగిన భయాసంభ్రమాశ్చర్యములకు మేరలేదు. మఱియుఁ గొంతసేపటివఱకుఁ దన్ను దా మఱచియుండెను. ఇంతలో వెనుక తట్టునుండి కొందఱు మనుజు లరుదెంచి సులోచన భటులపైఁ దల వడిరి. సులోచన భటు లెందఱుగలరో యాయాగంతులును నంత మందిమాత్రమే కలరు. కాని, సులోచన భటు లాయాగంతుల నెదిర్చి పోరునప్పుట కంత నేర్పరులును బలాఢ్యులును గారు. సులో చన యచటినుండి పారిపోవుటకుఁ దలంచెను. కాని, యట్టితరుణ మామెకుఁ జేజిక్కకుండుటచే భయాతిశయంబున నఱచి భూమిపైఁ బఱికిలఁబడెను. ఆసవ్వారు లిరువురు సులోచన యఱపు నాలించి యామె యొక వనితయని గ్రహించుకొనిరి. వారిలో నొకఁ డశ్వ

మునుండి వెంటనే క్రిందికి దిగి యామె చేతియందలి కైజారును లా గుకొని బలపూర్వకముగ నామెను దన సందలిలోనికి దీసికొని రెం డవసవ్వారుని గుఱ్ఱముపై వానిముందుఁ గూర్చుండపెట్టి తాను దనయశ్వముపై నధిరోహించెను. మఱియుఁ బెద్ద యెలుఁగుతో, యిచట సులోచన యొకతెయే గలదా? ఇంక నెవరైనను గలరా? యని యెవరినో ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరముగఁ గొంత దూరమునుండి, "యిచట నేస్త్రీయైనను చేఁ జిక్కిన నామెను బంధిం చికొని పోవుఁడు. మఱియు నామెయేసులోచనయని యెఱుంగుఁడు." అని వినిపించెను. ఆకంఠధ్వని సుందరలాలునిదిగ సులోచన తెలిసి కొనెను. వెంటనే యాసవ్వారు లిరువురు నుత్తరదిశకు దారిపట్టి బయలుదేరిరి.

ఈసమయంబున నమృతాంశుఁడు దన ధవళకాంతిని నలుదె నల వెదజల్లుచుండెను. సులోచన బంధింపఁబడెనను సమాచార యామె భటులకుఁ దెల్లమగుటతోడనే వారలు తమ పిక్కబలమును జూపుచు నచటినుండి విశావికలుగాఁ బారిపోయిరి. ఆపోరాటమందుఁ సులోచన భటు లిరువురు గాయపడిరి. తక్కిన భటు లార్గురుఁ దమ తమ ప్రాణములను జేతధరించి పలాయనులైరి. తదనంతరము మన సుందరలా లావరాశ్రమశాలురగు యాగంతుల యెదుటి కేతెంచి, "సెబాసు! శూరాగ్రేసరులారా! మీకార్య మతినేర్పుతో నిర్వ హించి నాకానందమును గలిగించితిరి. మంచిది. నానిమిత్తము గొని తేబడిన యశ్వ మెచటఁగల"దని ప్రశ్నించెను.

ఆయాగంతులు సుందరలాలును గాంచినంతనే చేమోడ్చి శిరము వంచి వినమ్రభావంబుతో నిలచియుండిరి. వారిలో నొకఁ "డిపుడే యశ్వమును గొని తెచ్చెద"నని పలికి యుత్తరదిశకుఁ వెడ లిపోయెను.

ఆమనుజుఁడశ్వమును గొని తెచ్చినపిదప సుందరలాలాగుఱ్ఱముపై నధిరోహించి తక్కినవారిని గలయఁగని, "మంచిది. మీ రిపుడు రాయపురమున కేగుఁడు. నాకార్యమును దీర్చుకొని మిమ్మచటఁ గలసికొందు"వని పలికెను.

సుందరలాలచటినుండి యుత్తరదిశకు దారివట్టెను. మఱియు నావారధి దాఁటి తనగుఱ్ఱమును బవ్వెత్తించుచు నొక క్రోశదూరము వెడలిన పిదప సులోచనను బంధించుకొని పోయిన నవ్వారు లచట నిలచియుండుటఁ గనుగొనెను. సుందరలాలు వారిని గాంచి నంతనే దరహాసవదనుఁడై "మిత్రులారా! సెబాసు! మిమ్మెంతగ బొగడినను నది స్వల్పమేయగును. మంచిది. మనమిచట నిలుచుట యుచితముగాదు. నడువుఁడు. పోవుద"మనెను.

౧౪.

ఇపుడు మాపాతకమహాశయులను కుమార మహేంద్రసింహుఁడు కొన్నిదినములవఱకు మృగాంకవతి వశమందుఁ జిక్కియుండిన సరోవరాద్భుత తిలస్మమందిరమునొద్దకుఁ దోడ్కొని పోవుచుంటిమి.

ఇక్కాలంబున నామందిరమందు మృగాంకవతికిఁ బ్రియసఖ యగు నీరద నివసించుచుండెను. సేవకులును నూడుపుకత్తెలును సైనికులు నెల్లరు నామె యధీనమందుఁ గలరు. కారణంబేమన, మృగాంకవతి నీరదను దనప్రాణముకన్న మిన్నగఁ గోరుచుండెననియు, నామె వచనంబులను మృగాంకవతి యెన్నఁడనాదరణము చేయఁజాలదనియు వారలెల్లరు బాగుగ నెఱింగియుండిరి. మృగాంకవతి యాజ్ఞానుసారము నీరద కొన్నిదినంబులవఱకు మృగాంకవతి రూపమును దాల్చికొని యామందిరమందు నివసించుచుండెను. మృగాంకవతి

నీరద నచటికే వృత్తెంచియుండెనని యామె సేవకులు మున్నగువ్వా రలు [illegible]ంచుచుండిరి. కాని, యామెయే నీరదయని యెవరికిని దెలియదు. మఱియు నట్టిసు దేహమైనను నెవరికి జనియించియుండలేదు. కాని, ఏనాc[illegible] మృగాంకవతి మోహినిని బంధించి నీరద వెంటc [illegible] చియుండెనో యానాcటినుండియు నీరదతను [illegible]రూపముతో నచట నివసించుచుండెను. మఱియు సమయ సమయంబులయందు మృగాంకవతి వృత్తాంత మామెకుc జేరుచుండెను.

ముకుందసింహ నరపాలుc డెపుడు మోహనసింహ జటాశంకరులను వెంటcదోడ్కొని పోయి చంద్రికళామదాలసలను బందిగమునుండి విడిపించి తెచ్చెనో, యపుడు మృగాంకవతి యిచ్ఛానుసారమా[illegible] [illegible] నీతి[illegible]మందిరములోనికిc జేర్పcబడిరి. మోహనజటాశంకరుల నిరువురను వెంటcదోడ్కొని ముకుందసింహనరపాలుcడు [illegible]ముగc జంద్రకళామదాలసల వెంట నచటి కేతెంచి యుండెను. ఇవు డాసమయంపుc గొలcదివృత్తాంత మిచట లిఖించుట [illegible] వ్యముగc దలంచుచుంటిమి.

చంద్రికళామదాలసలను వెంటcదోడ్కొని ముకుందసింహ న[illegible] [illegible]రసమీపమునకుc జేరి యాసమాచారము నీరద [illegible] జటాశంకరు నామెయొద్దకుc బుత్తెంచెను. ఆ సమయంబున నేకాంత్యవశంబుననో నీరద యాతటాకము వెలుపల కేతెంచి యుండినదగుటచే నచట జటాశంకరునితో నామెకు సమావేశము గలిగెను. నీరద జటాశంకరుని గాంచినంతనే ప్రమోదభరితమానసయై మృగాంకవతి కుశలవృత్తాంతమును వానిని బ్రశ్నించెను. దానికిc జ[illegible]త్తరమున నీరదామృగాంకవతు లేనాcడు తుదిసారి కలసికొనియుండిరో యానాcటినుండి యిప్పటివరకుcగల వృత్తాంత

షులన్నింటిని వివరించి యామెకుఁ దెలిపెను. కాని యందు ముకుంద సింహుని వృత్తాంతమును గలదు. చంద్రికళా [illegible] మునుండి విడిపించి మృగాంకవతి యిచ్ఛాపూర్వకము [illegible] నిచటికిఁ జేర్పుటకై ముకుందసింహనరపాలుఁడు స్వయముగ నేగెంచి యిచటికిఁ గొలఁది దూరమున విడసియుండెననియు పతిఁడు నిన్ను గలసి కొనుటకుఁ గోరుచుండెననియు జటాశంకరుఁ డామెకుఁ దెలిపెను.

ముకుందసింహ నరపాలుఁ డింతదనుక జీవించియుండెననిగాని నతఁడు మాయారాణివలన బంధింపఁబడియుండెననిగాని నీరదకిను మంతయుఁ దెలియదు. అట్టి యనుమానమైన నామె కెన్నఁడును గలిగియుండలేదు. నేఁడు జటాశంకరునివలన నావార్త నాలించుటచేఁ గలిగిన సంతోషాతిరేకంబున నామె కొంక విచిత్రగతి నొందెను. అట్టిస్థితిని బరికించి జటాశంకరుఁ డామె మోమువంక నిదానించి చూచుటచే ముకుందసింహనరపాలుని బంధవిమోచనవృత్తాంతము మృగాంకవతికంటె నీరదకధికసంతోషప్రదమయ్యెనని, యాతఁడు దెలిసికొనెను. మితిమీఱిన సంతోషాతిశయంబుచే నీరద ప్రాణము లెగసిపోవనుండెననుటయు నాశ్చర్యకరంబు వివరము గాదు. మఱియు వాస్తవమునందది సరిదైన [illegible] సామ్రాజ్య [illegible] యామా యకత్వముతోఁ గూడిన నీరద ముఖమండలమున సంతోష చిహ్న ములు స్పష్టరూపంబున గోచరించుచుండెను. కాని, దాసీలోపా టామె కుత్తుకడగ్గుత్తికవడుటచే నోటనుండి మాట వెడలకుండెను. ఆమె జటాశంకరునితో నేదియో వచియించుటకు దలంచుచుండెను. కాని, చెప్పఁజాలకుండెను. నేత్రములనుండి యశ్రుబిందువులు జాలువా ఱఁదొడంగెను. తనూలత మాటిమాటికి బులకితంబగుచుండెను. నీర దయందుఁ దోఁపుచుండిన తాత్కాలికావస్థఁ బరికించుటతోడనే జటా శంకరున కమితాశ్చర్యము గలుగుచుండెను. కాని, గృహాయణ

మానిపై నెరించియుండిన కీడు తొలఁగిపోవుటచే సమీపబంధువు లకంటె వారినిఁ గొలుచువారికిఁ దఱచుగ విశేషసంతస మలవడుట సహజమని తలంచి జటాశంకరుఁ డావిషయమును తన మనంబు నుండి తొలఁగించివైచుకొనెను. మఱియు నీరద కలిగియుంచియుండిన సంతోషమును నెవ్విధంబుననైన డిందుపఱుపవలెననియుఁ గానిచో నీమె కట్టి శారీరకకష్టమేనియు సంభవింపవచ్చుననియుఁ దలంచి నీరదవైపునకుఁ బలికించుచు, "ముకుందసింహనరపాలుఁడు బంధవిముక్తుఁడయ్యెను గాని, యతఁడు జీవించునను నాశ లే"దనెను.

"(త్రుళ్లిపడి) అదియేమిటి? అదియేమిటి?"

"మాయారాణి యివు డెద్దియో యొక యుపద్రవమును కలిగింపక మానదని తలంచి నే నిటులఁ బలికితిని. ఇదియుఁగాక, ముకుందసింహుఁడు కొన్నిసంవత్సరములకుఁ బూర్వము మృతినొంది యుండెనని విశ్వసించుచుండిన ప్రజలహృదయం దివు డెట్టిభావముద యించునో చూడవలసియున్నది. కానిమ్ము! ఏమి కానున్నదో కనుగొందము. నీవిఁక నాలసింపకుము! అతఁ డెదురుచూచుచుండును."

జటాశంకరుని వచనంబులకు బదులుపలుకుటకు నీరదకు తరుణము చేఁ జిక్కదాయెను. ఆమె మాఱుపలుకక జటాశంకరుని వెంట బయలుదేరెను. ముకుందసింహ నరపాలుఁడు మున్నుగువార లచటి కలదవ్వున నుండుటచే నరగడియకాలము గాకమున్నె సులోచన యచటికిఁ బోయి చేరెను. మఱియు నచట ముకుంద మోహనసింహులను చంద్రకళామదాలసలను గనులారఁ గాంచెను.

సులోచన హృదయసాగరమున సంతోషతరంగమాలికలు విజృంభించుచుండెను. ఆమె యంతరంగమున బలువిధంబులగు యోజనలు పుట్టుచుండెను. ఆమె తన్నుఁ బ్రకృతిస్థగ నొనరించుకొని యుండినను, ముకుందసింహుని సమీపమునకుఁ జేరినంతనే తటాలున వానిపాదములపై నొరిగెను.

ముకుంద:—(ఆమెను లేవనెత్తి) నీరదా! నేను బందిగముఖుండనై విము దల నొందుటచే హద్దుమీఱిన యానందము నీకు జనించె నని తలంచుచుంటిని. నీయెడల మిక్కిలి ప్రసన్నచిత్తుఁడనై తిని. అందు ముఖ్యముగ నీవు మృగాంకవతిని నిర్మలమానసంబుతోడను ప్రేమతోడను ననుసరించుటచే నా కమితానందము గలుగుచున్నది. మఱియు మృగాంకవతి కారణమున నేనిపుడు జీవములతో నుండఁగలిగితిని. కానిచో, నిప్పటికి నా పేరు మాసియేయుండును. మఱియు నే నైదుసంవత్సరములకుఁ బూర్వమే మృతినొందియుండినటు లెల్లరచే భావింపఁబడుచుండును. (దీర్ఘనిశ్వాసమును విడచి) పరమేశ్వరుని లీల కడు విచిత్రమైనది. మంచిది! నేను నీతోఁ గొంత చెప్పవలసియున్నది. నీవు దానిని శ్రద్ధతో నాలింపుము. నే నిచటఁ జాలసేపటివఱకు నిలువఁజాలను.

నీరద:-(ఆశ్చర్యముతో) అగుచో, మీరిపుడిచటినుండియే వెడలిపోవుటకుఁ గోరుచుంటిరా? మందిరమునకు విచ్చేయకుందురా?

ముకుంద:—కాదు, నాకంతటి పావకాశములేదు. నేను శీఘ్రముగఁ జని కుమార మహేంద్రనరేశసింహులతోడను మృగాంకవతితోడను గలసికొనవలసియున్నది.

నీరద:—వార లింకను నిశ్చింతులై యుండలేదా?

ముకుంద:—ఉండిరి. కాని, పలయువిధంబున గాదు.

ముకుందసింహుని వచనంబుల నాలించి నీరద దీర్ఘాలోచనమునందుఁ జిక్కుకొనెను. మఱియుఁ గొంతసేపటివఱకు నేమియో యోజించుకొనుచుండెను. తదనంతర మామె శిరము పైకెత్తి వానితో, "మంచిది! మీయాజ్ఞ యెట్టిదో సెలవిం"డని పలికెను. మఱియుఁ (జంద్రికశామదాలసలవైపునకు సంకేతించి) వీరిరువురు

విడుదలనొందుటవలన నాకమితానందము గలుగుచున్నది. నే (చం
ద్రకళవైపునకుఁ జూపి) నీమ్మైకై కొంతకాలము రోహిణీగడదుర్గమం
దు దాఁగియుండవలసివచ్చెను. వీరిచటఁ గొన్నదినములవఱకు నుం
దురుగదా?" యనెను.

ముకుంద:—ఔను. అవశ్య మిచట నుందురు. వీరిరువురను నిచ
టికిఁ జేర్చిపోవుటకు నే నరుదెంచియుంటిని. ఇప్పుడు వీరిని
నీయధీన మొనరించుచుంటిని. మఱియు మృగాంకవతి యిచ్చ
టికి వచ్చి చేరుదనుక నాదరసత్కారములయందు వీరి కెట్టి
కష్టమును గలుగనీయక మిక్కిలి జాగ్రత్తతోఁ గాపాడు
చుండవలెను. నేను శీఘ్రకాలముననే కుమార మహేంద్రి
నరేశసింహులను మృగాంకవతిని వెంటఁదోడ్కొని యిచట
కుఁ జేరఁగలనని విశ్వసించుచుంటిని.

నీరద:—నే నీయిరువురను ప్రాణములకంటె మిన్నగ భావించుచుం
దును. నామేనున నూపిఱి యాడుచున్నంతవఱకు వీరి కెట్టి
కష్టమును గలుగఁజాలదు.

ముకుంద:—చాలును. నేను దీనినే కోరుచుంటిని మఱియు నీకు
మఱియొకమాట చెప్పవలసియున్నది.

నీరద:—సెలవిండు.

ముకుంద:—నావృత్తాంత మింక నెవ్వరితోడను వచియింపరాదు.
కొన్నిదినములవఱకుఁ బ్రచ్ఛన్నంబుగనుండి కొన్నికార్యము
లను గావింపఁదలంచుచుంటిని. ఇందుచేతనే నేను నీమందిర
మున కేతెంచక నిన్నిచ్చోటునకు రావించి చెప్పవలసిన
విషయములను జెప్పియుంటిని.

నీరద:—చిత్తము. సకలకార్యములు మీయాజ్ఞానుసరణి జరుగఁగలవు.

ముకుంద:—మంచిది. మేమిఁక వెడలుచుంటిమి.

నీరద, చంద్రికళామదాలసల నాతిలన్నమందిరములోనికిఁ దోడ్తెచ్చెను. మోహనసింహజటాశంకరులు వారిని మందిరమువఱకుఁ జేర్చుటకు వెంబడించిరి.

నీరద చంద్రికళామదాలసలను మిగుల సన్మానపూర్వకంబుగఁ జూచుచుండెను. పాపమాయబల లింతదనుకఁ బలువిధంబులగు కష్టములను గుడువవలసివచ్చెను. అందుచే నాపూఁబోఁడు లిరువురు మిక్కిలి దుర్బలులుగను నీరసముగ జూపట్టుచుండిరి. పెక్కువిధంబులగు చింతలు వారిరువురను మృతప్రాయులనుగ నొనరించుచుండెను. చాల కాలమునకుఁ బిదప నిప్పుడు తమ దుస్థితినిగూర్చి విచారించుకొను భాగ్యము వారికి చేఁచిక్కెను. మఱియు నీరదయొక్క యాదరసత్కారముల కామెకు ధన్యవాద మొసంగుటకును దగియుండిరి.

చంద్రికళకు మదాలసయందును మదాలసకుఁ జంద్రికళయందును నిస్సీమప్రేమ గలదు. ఇపు డిరువురు నొకస్థానమందుఁ గలరు. మఱియుఁ దమ ప్రియులగు కుమార మహేంద్రిన రేశసింహులు మాయారాణి బందిగమునుండి విడుదలనొంది కుశలపూర్వకముగ నుండిరను సమాచారమును వారికిఁ దెలిసియుండెను. ఇందుచే నొకవిధంబగు ప్రసన్నత వారి శుష్కజీవలతపై నాశారూపంబగు రెండుమూఁడు జలబిందువులను జిలుకరించెను. పరమేశ్వరుఁడు కృపామయుండను విశ్వాసము వారికిపుడు గలుగఁదొడంగెను. కాని, మాయారాణి తమయెడల నిటులఁ బగఁబూనియుండిన కారణమును, నామె యెవ్వరైనదియుఁ దెలిసికొనుటకుఁ జంద్రకళామదాలస లిరువురు నుత్కంఠచిత్తలయి మిక్కిలి కలఁతనొందుచుండిరి. తాము బందిగమునుండి విడుదలనొందిన పిదప నావిషయములను మోహనసింహుని ప్రశ్నించి తెలిసికొనుటకు వారికి తరుణము చేఁ చిక్కదాయెను.

చంద్రకళామదాలసల కాతిలన్నమందిరమందు రెండుదినములు సుఖపూర్వకంబుగ గడచెను. మూఁడవనాఁడు నీరద యాబాలవాఁగ లిరువురను సౌధోపరిభాగమునకుఁ దోడ్కొనిపోయి వారితోఁ బలువిధంబులగు ప్రబోధవాక్యంబులను పలుకుచు పలుదెసలఁగల ప్రకృతిశోభను వారికిఁ జూపింపసాగెను. మాయారాణి వృత్తాంత మడిగి తెలిసికొనుటకుఁ జంద్రకళ కిపుడు మంచితరుణము చేఁజిక్కెను. మఱియుఁ దనప్రశ్నలకు నీరద సరియైన ప్రత్యుత్తరం బొసంగు ననియు నామెకు విశ్వాసము గలదు. చంద్రకళ నీరదవైపునకుఁ బరికించి, "సోదరీ, నీరదా! నిస్సందేహముగ నీవు మమ్ము మిక్కిలి యాదరపూర్వకంబుగ సన్మానించుచుంటివి. మేమిచట నీకారణమున మిక్కిలి సుఖశాంతులతో నుంటిమి. భాగ్యహీనలమగు మాకిట్టి యాశ్రయము లభించునను నాశలేదు. మఱియు శీఘ్రకాలములోనే మా దుర్దినములు తొలఁగిపోఁగలవను నాశయు జనించుచున్నది. ఇపుడు మా మానసంబులు కొన్నిరహస్యవిషయముల నెఱుంగుటకు మిక్కిలి తత్తరపడుచున్నవి. నీవు వానిని వివరించినచో......"

"విషయమెట్టిది? నాకుఁ దెలిసియున్నంతవఱకుఁ దప్పక వివరించి తెలిపెదను."

"మాయారాణి యెవ్వరు? ఆమె మాపైఁ బగఁబూనియుండుటకు కారణమేమి?"

"ఆమె జమేలియారాజ్యమునకు రాణి. అచట నొక గొప్ప తిలస్మము గలదు. అది కుమార మహేంద్రనరేశసింహులవలన ఖండింపఁబడునను ప్రతీతి గలదు. కాని, యా తిలస్మము ఖండనము గారాదని మాయారాణి యభిప్రాయము. తత్కారణమున నామె యనేక యుపద్రవములను గలిగించుచున్నది."

“మంచిది. మృగాంకవతి యెవ్వరు? నేనామె నామమును పలుమరు వినుచు వచ్చితిని. మఱియు నామె నాకుఁ దోడ్పడుచుండినటులను తెలియుచున్నది.”

“మాయారాణి కిరువురు చెల్లెండ్రు గలరు. (దీర్ఘనిశ్వాసము బరిత్యజించి) నీవిపు డెవరి [illegible] యామెయే మృగాంకవతి. మాయారాణికి పెద్దచెల్లెలు. ఆమె తనయక్కయగు మాయారాణి దుష్ప్రవర్తనమును సహింపక యామెనుండి వేఱుపడియున్నది. మఱియు రాకుమారు లిరువురకుఁ దోడ్పడుచున్నది. ఆ యక్కచెల్లెండ్రలో రాజేశ్వరి యనునది చిన్నది. ఆమెయు నిపుడు మాయారాణిని విడచి మృగాంకవతి ననుసరించియున్నది.”

“ముకుందసింహుఁడు జటాశంకరుఁ డెవ్వరు?”

“జటాశంకరుఁడు మృగాంకవతియొక్క [illegible] సోదరుఁడు. ఇఁక ముకుందసింహ నరపాలుఁడు జామెలియారాజ్యమున కధిపతి. మాయారాణి వానికి [illegible] ముకుందసింహ నరపాలుఁడు పరిపాలించియుండెను. [illegible] ప్రసన్నుఁడైయున్నాఁడు. మృగాంకవతి [illegible] తెలిసియుండలేదు. [illegible] నామె [illegible] ముకుందసింహుని దహనసంస్కారము [illegible] యుండెను. కాని, మాయారాణి తనభర్తకు విషమిడి [illegible] యుండెనను జనప్రవాదము మాత్రము గలదు. ముకుందసింహుఁడు కాలధర్మము నొందినపిదప మాయారాణి యీ జామెలియారాజ్యమును పాలించుచుండెను. మాయారాణి రాకుమారు లిరువుర నెప్పుడు బంధించెనో యపుడు వారిని బంధవిముక్తులనుగ నొనరించుతలంపుతో మృగాంకవతి జామెలియాకు వెడలియుండెను. తత్క్షణంబున మాయారాణి ముకుందసింహుని మరణవిషయమున ప్రజలను వంచించి వానిని చెఱఁబెట్టి

యుండెననువార్త యెట్టులనో మృగాంకవతికిఁ దెల్లమగుటచే నామె *విశేషప్రయత్నములను గావించి మాయారాణి బందిగము నుండి* వానిని విడిపించెను. కాని, తాను జీవించియుండిన సమాచార మింకను ప్రజలకు వెల్లడింపరాదనియు, దాను కొన్ని కార్యములను గావింపవలసియుండెననియు ముకుందసింహ నరపాలుఁడు దెలిపియుండుటచే నారహస్యము గుప్తముగ నుంచఁబడియున్నది. నేనీవృత్తాంతమంతయు మిగుల సంక్షేపముగ వచియించుచుంటిని. కానిచో, నీమధ్యఁ దొడరియుండిన యద్భుతసంఘటనముల నాలించిన నీకధికాశ్చర్యము జనింపక మానదు. నే నీసమాచారములను జటాశంకరునివలన నాలించినపుడు కడుపు పగులునటుల నవ్వువుట్టి వచ్చుటచే నాకొక విచిత్రస్థితి యొదవెను."

"అవియన్నియు సవిస్తరంబుగ నేల చెప్పకుంటివి? ఏమి! నీ వేయావశ్యకంబగు కార్యవశంబున నేనియుఁ బోవలసియుండెనా?"

"(నవ్వుచు) ఎచటికేగుటకును పనిలేదు. మంచిది. వచియించుచుంటి నాలింపుము."

"కారాగృహమునుండి తప్పించుకొని పోయిన ముకుందసింహుని శీఘ్రముగ బంధించి నీసమక్షమునకుఁ గొని తెత్తుననియు, నపుడు నీ చేతులార వానిశిరమును ఖండించి నిశ్చింతురాలవు గాఁగలవనియు జటాశంకరుఁడు మాయారాణితో బూటకపు ప్రతిజ్ఞను గావించివచ్చెను. తత్కారణంబున ముకుందసింహుఁడు తన బందిగమునుండి వెడలిపోయియుండినను నతఁడు జీవములతో నుండఁజాలఁడను విశ్వాసము మాయారాణికిఁ గలిగియుండెను. కాని, యిఁకను జటాశంకరునివలన గావింపఁబడు కార్యము లతివిచిత్రములై యుండుననుట కెట్టిసందియమును లేదు."

నీరదవలన జటాశంకరుని వృత్తాంతము నాలించి చంద్రకళా మదాలసల కమితాశ్చర్యము జనించెను. మఱియు నావిషయమున కొంతసేపటివఱకు నాముగ్గురు సంభాషించిన పిదపఁ జంద్రకళ నీరదతో నిట్లనియెను.

"నీవు ముకుందసింహ నరపాలుని సమీపమున కేతెంచిన సమయంబున నతఁడు మమ్ము నీయధీనమొనరించుతఱి నీవు నావైపునకు సంకేతించి, "యీామె నిమిత్తము చాలదినములదనుక రోహిణీగడదుర్గమందు దాఁగియుండవలసి వచ్చెనని సూచియించి యుంటివికదా! ఆదుర్గమందు నాదుర్దినములు గడుపుకాలములో నిక్కువముగ నీవచట నుంటివా! అగుచో, లలితామనోరమల వృత్తాంతముగూడ నీ కవశ్యము దెలిసియుండును."

చంద్రకళ వచనంబులకు నీరద బదులెద్దియో పలుకనుండెను. అంత నొకవిధంబగు ధ్వని నాలించి యామె మిక్కిలి తత్తరపాటు నొందసాగెను. మఱియు సౌధోపరిభాగమున నొకచిన్న వేదికపై శిరము క్రిందకును పాదము లాకసమువైపునకునుగల యువతీవిగ్రహమువైపున కామె భయసంభ్రమాయత్తచిత్తంబుతోఁ జూడఁదొడంగెను.

పాఠకమహాశయులామందిరపు యవస్థను మఱచియుండరు. కారణంబేమన, నామందిరముయొక్కయు దానియందలి విగ్రహములయొక్కయు స్థితిని మేము నాల్గవభాగమందు వర్ణించియుంటిమి. ఇపు డాచిన్నవేదికపైఁ దలక్రిందుగ నుండిన యువతీవిగ్రహము వర్తనము జేయుచుండుటచే నీరద యధికసంభ్రమమున లేచినిలచి, "అకటా! ఇపుడొక గొప్ప యనర్థము వాటిల్లనున్నది. ఇపుడు మన ప్రాణములు దక్కునను నాశలేదు. కటకటా! సోదరీ, మృగాంకవతీ! నీవిపు డెచటనుంటివి. అయ్యో! నే నేమిసేయుదు"నని మొఱలిడఁ దొడంగెను.

౧౫.

తిలస్నాధ్యక్షుని కారాగారంబున మహామహారాణి సులోచన లిరువురకు వాదప్రతివాదములు జరిగెననియు, నాసమయంబున నదను నరసి తిలస్నాధ్యక్షుఁ డచ్చటనుండి పారిపోయి యుండెననియుఁ దదనంతరము మహారాణి సులోచన పంపించిన పల్లెలకు బెగడొంది యచటనుండి వెడలిపోయి యుండెననియుఁ బైప్రకరణమునందు మేము లిఖించియుంటిమి.

మహామహారాణీయధ్యక్షులయందుఁ బోరాటము సంభవించి యుండినను వారిరువురు సఖ్యతపడుటయందు దీర్ఘకాలము పట్టలేదు. ధూర్తత్వము—చోరత్వము—విశ్వాసఘాతుకత్వము — అన్యత సంభాషణము—జీవహింస మున్నగు చెడుకార్యములను గావించు నరాధములు ప్రకృత్యానుసారి సుప్రసిద్ధ దొంగవాండ్రులతోఁ గలహించుకొనుచుండినను, మఱియు నావివాద మొకరినెత్తురు మఱి యొకరు కంటఁ జూచువఱకు వచ్చియుండినను, వార లతిశీఘ్రముగనే సఖ్యతపడుచుందురు. కారణంబేమన, నీచప్రవృత్తిగలవారి మానసములయందు మానలజ్జాభిమానములకుఁ దావే లభింపదు. వాఁడు నన్నవమానపఱచెను గావున, వానిసమీపమున కెన్నఁడు బోరాదని కాని, వానినుండి పగ దీర్చుకొనవలయునను యోజనగాని, వాని నెవ్విధంబుననైన వంచింపవలయునను చింతగాని యానీచాత్ములకుఁ గలిగియుండదు. వారు స్వయముగ నధములయియుండఁ దోడివారల నిందావాక్యములు వారికెట్టుల లజ్జ జనింపఁజేయును? ఈహేతువులచే వారి వైరభావము చిరకాలమువఱకు నిలచియుండదు. అటుకానిచో, నాదుష్టులు పరస్పరకలహంబులవలన నశించి యలఘులకట్టి హింసాప్రియులగు నరాధములచే బాధపడు దినములు గలుగకుండునుగదా! పరమేశ్వరుని యీవిచిత్రలీలయే మాయా

రాణి యధ్యక్షులకు వెంటనే పొందొడఁగూర్చెను. మఱియు విజ యేంద్రసింహునియొక్కయు వానికుటుంబముయొక్కయు దురదృష్ట మను వృక్షము మరల ఫలపుష్పసంభరితము గాఁదొడంగెను. ఆవృ త్తాంతమంతయు మాయారాణియధ్యక్షుల సంభాషణము వలనఁ దేటతెల్లము గాఁ గలదు.

మాయారాణి యెప్పుడు సులోచనలన తిరస్కరింపఁబడి యామె యదలింపు పలుకులకు నవనోద్యానమును సింహద్వారము నుదాఁటి గంగానదివైపునకుఁ బయలుదేరెనో యప్పుడు తన దైవ దుర్విపాకమునకు వగచుచు నెమ్మది నెమ్మదిగా జాహ్నవీతీరంబు నకు నడచి పోవుచుండిన ముక్కిడియగు నధ్యక్షునితో నామె మా ర్గమధ్యంబున గలసికొనెను. తనవెనుక నెవరో యరుదెంచుచుండిన యలికిడి నాలించి, యధ్యక్షుఁడు వెనుకవైపుఁ దిరిగి కాంచునంత వానిదృష్టి దైవోపహతయగు మాయారాణిపైఁ బడెను. ఆసమ యంబున నంధకారము నలుదెసల వ్యాపించియుండినను, చిరకాల మొకస్థానమందు నివసించియుండిన వారగుటచే నొండొరులను శీఘ్రముగ గుర్తించుకొనఁగలిగిరి. మాయారాణి వెంటనే యధ్య క్షుని పాదములపైఁ బడి యశ్రుజలంబుచే వాని యపవిత్రంబులగు పాదములఁ దడుపుచు నివ్విధంబున విలపింపఁదొడంగెను:—

“మహాత్మా! మీకిప్పుడు గొప్ప యవమానము గలిగిననుట కెట్టిసందేహమునులేదు. కాని, మీరు నాపై వ్యర్థముగ గుపితులగు చుంటిరి. దానియందు నాయపరాధ మించుకయును లేదని శపథపూ ర్వకంబుగ వచియింపఁగలను. నేను వచియించు వాక్యములను దయాన్వితహృదయులై యాలించిన పిమ్మట నాయపరాధము నావల ననే జరిగెనని తోఁచునెడల తత్క్షణము మీహస్తములతో నాశిర మును ఖండించివేయుఁడు. అటులొనరించుటకు మీరు శంకించినను

నే నీస్త్రీజారుతో నాహృదయమును జీల్చుకొని మరణించెదనని ప్రతి న చేయుచుంటిని. కారణం బేమన, మిమ్ము గృద్ధులనుగ నొనరించి యీప్రపంచమందు జీవించి యుండఁజాల. మీరుదక్క నాకన్యాశర ణ్యమెద్దియులేదు. పగతుఱచేఁ జిక్కి వారు గుడుపు పెనుబాములను సహించుచు కుళ్ళికుళ్ళి చచ్చుటకంటె నాచేతితోఁ బ్రాణములను దీసికొనుటయే శ్రేయోదాయకముగఁ దలంచుచుంటిని.”

“నీవు నన్ను వంచించి యవమానపఱచితివని నామానస మింతదనుక సాక్ష్య మొసంగుచున్నది. అయినను పాపాక్రాంతవై నిర్దోషినని ధ్రువపఱచుటకుఁ గోరుచుంటివి కావున నీయాలాపన మాలించుట కెట్టియాటంకమును లేదు. తదుపరి యపరాధియని నిశ్చయింపఁబడిన వారిని దండించుట నా కుచితకార్యము.”

“(లేచి కరములను జోడించి) మహాత్మా! నే నదియే కోరు చుంటిని.”

“అగుచో, మనమిచట నిలచి సంభాషించుట చతురతగాదు. సాధ్యమగునంత శీఘ్రముగ నీపట్టణము వెలుపలి గంగానదినిదాఁటి యావలితట్టునకుఁబోయి చేరుట శ్రేయస్కరము. పిదప నేకాంతమం దు నీవు వచియించునంగతుల నాలించెదను.”

“నే నయ్యదియే సముచితముగఁ దలంచుచుంటిని.”

మాయారాణి యధ్యక్షు లిరువురు నచటినుండి బయలు దేరి మాటలాడునంతలో గంగానదీతీరమునకుఁబోయి చేరిరి. అధ్య క్షుఁ డానదీజలంబుతో ముక్కు బాగుగఁ గడుగుకొని తనకక్షపాల నుండి పలాస్త్రీపట్టీ నొకదానిని వెడలించి దానిని ముక్కుపయి నతి కించుకొనెను. తదనంతర మొక నావికునిఁ జేరఁబిలిచి వానికిఁ గొం తధన మొసంగి మాయారాణిసమేతముగ నతఁ డానదినిదాఁటి యా వలియొడ్డునకుఁ బోయిచేరెను. అధ్యక్షుఁడచటను విశ్రాంతి గైకొనక

దాదాపొక మైలుదూరము విడలిన పిదప నొకగ్రామమందుఁ జేరెను. అచట గుఱ్ఱపువర్తకులు విస్తారముగఁ గలరు. ఆ బేహారులయొద్ద పలువిధంబులగు గుఱ్ఱములు విక్రయమునకై నిరంతరము సంసిద్ధముగ నుండును. అధ్యక్షుఁ డాగ్రామమునకుఁ జేరినంతనే మాయారాణితో, "నీయొద్ద రొక్క మేమయినను గలదా?" యని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరముగ మాయారాణి వానితో, "నాయొద్ద వెండినాణెములు లేవు. దీనారములును నవరత్నములు గలవు. నేను తిలస్నోద్యానమునుండి పారివచ్చు సమయంబున వానిని నావెంటఁ గొనితెచ్చియుంటి"ననెను.

ప్రాతఃకాల ధవళకాంతు లాకసమం దింకను వ్యాపించి యుండలేదు. అప్పటి కాగ్రామమందు గొలఁదిమందిమాత్రమే నిద్ర నుండి మేల్కాంచియుండిరి. అధ్యక్షుఁ డామాయారాణియొద్దనుండి యేఁబది దీనారములను దీసికొని యామెను నొకవృక్షతలంబునఁ గూర్చుండ నియమించి యొకసత్రములోనికిఁ బోయి చేరెను. మఱియు ననతి కాలంబులోనే సామానులుసహితముగ రెండుగుఱ్ఱములను వెలకుఁ గొని మాయారాణి కూర్చుండియుండిన తావునకుఁ దీసికొనివచ్చెను. మఱియు మాయారాణి అధ్యక్షు లాయశ్వములపై నధిరోహించి వానిని పర్వెత్తించుచు దక్షిణదిశనుబట్టి పోఁదొడంగిరి. వార లాగుఱ్ఱముల నతివేగంబుతో బర్వెత్తించుచుండుటచే వారి కాయశ్వముల చావుబ్రతుకుల చింత లేశమైనను లేకుండెనని చూపఱులకు తోఁపక మానదు. వారలొక ఘనారణ్యమందుఁ బ్రవేశించిన పిదప నాతత్తడుల నడకను గొలఁదిగ తగ్గించి పరస్పరము సంభాషించుచుఁ బోఁదొడంగిరి.

అధ్యక్షుఁడు:—మనమిపుడు నిర్భయస్థానమునకు వచ్చి చేరితిమి. మంచిది! నీవిపు డేమి చెప్పదలంచుచుంటివో దానిని వచియింపుము.

మాయారాణి:—మీ రెవ్విధంబున విజయేంద్రసింహుని కారాగారమునుండి తప్పించుకొనివచ్చితిరో దానిని దొలుతఁ దెలిసికొనఁగోరుచుంటిని. అయినను, నావృత్తాంతము వివరించుచుంటి నాలింపుఁడు. ఏనాఁడు మీరు పగతులచే బంధింపఁబడిరో, యానాఁటినుండి నేఁటివఱకుఁగల వృత్తాంతములను విన్నవించుచుంటిని. వానిని వినుటవలన మీకు సమస్తము దేటపడఁగలదు. మఱియు నే నన్నివిధంబుల నిరపరాధినని మీరు నమ్మింపక మానరు.

అధ్యక్షుఁడు:—మంచిది. ఆవృత్తాంతము లెట్టివో వివరింపుము. ఆలకించుటకు సంసిద్ధుఁడనుగ నుంటిని.

మాయారాణి తనవృత్తాంతమంతయు నధ్యక్షునితోఁ జెప్పఁదొడంగెను:—

దానియందు దభ్రుకసింహుఁడు పిచ్చివానివలె నటించుట—అతఁడు తిలస్మోద్యానమునకు వచ్చిచేరుట—పిశాచముయొక్క యద్భుత కార్యకలాపము—ముకుందసింహుఁడు చెఱనుండి బంధవిముక్తుఁడగుట—నాకే తన్ను విడచిపోవుట—జగపతి బంధింపఁబడుట—తాను తిలస్మోద్యానమునుండి పాఱిపోయివచ్చుట—తిలస్మ వృత్తాంతము—సుమార్గమందు ముకుంద మోహనసింహజటాశంకరులను, పన్నారాజ రాజేశ్వరులను గనుగొనుట—వేషధారియగు తిలస్మాధ్యక్షుఁ డచటికి వచ్చిచేరుట—వానితో సంభాషించి తాను మోసపోవుట—అధ్యక్షుని జాబుఁ జదువుట మున్నగు సకల వృత్తాంతములను వివరించి తెలిపెను. కాని, యాయధ్యక్షుని వృత్తాంతమందుఁ దాను మోసపోయిన విషయమునుమాత్రము గొంత కల్పించి చెప్పెను. అధ్యక్షుఁ డాయుదంతమంతయు శ్రద్ధతో నాలించుచు, విరమించినపిదప నామెతో, "ఆదురాత్ముఁరాలగు సులోచ

నయే యీ నేరములన్నింటికిఁ గారణభూతురాలని నేనిపుడు గ్రహించితిని. నీవు నిర్దోషివి. నీవలన నేయుపరాధమే యయ్యుఁ దొడరియుండినను నది కేవలము ప్రమాదసంజనితంబని తలంపవచ్చును. కాని, ముకుందసింహుని విషయమున నన్ను వంచించుట మిక్కిలి శోచనీయ"మనెను.

"ఔను. అది నాయుపరాధమనుట కెట్టి సందియమును లేదు. కాని, యీనేరము ప్రాఁతదైపోయినది. మఱియుఁ గమలాదేవి రహస్యము ప్రమాదవశంబున వెల్లడియగుటచే నదియు క్షమ్యము. మీరీయుపరాధమును మఱచి, నన్నియ్యాపదనుండి కాపాడుటకుఁ బ్రయత్నింపనిచో, నాప్రాణమే కాదు మీజీవితములు నపహృతములై నశింపఁగలవు. దీనియందు మనయిరువురి యపరాధము సమానమని దృఢపూర్వకంబుగఁ జెప్పఁగలను."

"నిక్కువము. నిశ్శంకమనంబుతో నీదోసములను వెల్లడించియుంటివి. కావున నిన్ను క్షమించుచుంటిని. మఱియు నీయుపద్రవములన్నింటికి సులోచనయొక్క దుష్టత్వమే........"

"(తనఘోటకము నధ్యక్షుని సమీపమునకు నడిపించి వాని పాదములను జేతితోఁ దాఁకుచు) బాబాజీ! మీరు క్షమించినంత మాత్రమున నెట్టిప్రయోజనమును లేదు. ముకుందసింహుని, విజయేంద్రసింహుని, వానిపుత్రులిరువురను, మైమూరులను బంధించుటకుఁగాని తుదముట్టించుటకుఁగాని ప్రయత్నింపవలెను."

"అటులనే జరుగఁగలదు. (కొంచెము యోజించి) కాని, యీకార్యసాధనమునకై విస్తారధనము గావలసియుండునని తోఁచుచున్నది."

"మీరావిషయమున నెట్టిచింతయువలదు. నాయొద్దఁ గొన్ని లక్షల రూప్యంబులు విలువగల రత్నములు గలవు. ఇదియునుగాక

దేవగడమందలి ధనాగారము మిగుల గుప్తమైనది. నేనుతక్క నన్యు లెవ్వరు దాని నెఱుంగరు. ముకుందసింహునకుఁ గూడ దాని వృత్తాంతము దెలియదు."

"(ఆశ్చర్యముతో) దేవగడ ధనాగారమా! నాకావిషయము న నేమియుఁ దెలియదే!"

"వహ్వా! మీ కేల తెలియదు? ఆమందిరమును మీరలేకదా, జగపతి కొసంగియుంటిరి!"

"అగుచో, దేవగడ ... యేల వచియించుచుంటివి? శివగడ మనుము."

"ఔను. శివగడమే! పేరు చెప్పుటలోఁ బొరబడితిని. దాని యం దసంఖ్యాకంబగు ధనరాసులు గలవు. నేను జగపతి కొసంగి యుండిన ధనమంతయుఁ దాని ...దుఁ గలదు. పాప మిప్పు డతఁడు చెఱఁబెట్టఁబడియున్నాఁడు. వానిని విడిపించువా రెవ్వరుగలరు?"

"ఆధనాగారమం దపారమగు ధనము గలదని నే నెఱుంగు దును. మఱియు నన్నును ధనహీనునిగఁ దలంపకుము. మంచిది. ఎట్టివిచారమును లేదు. అన్నియుఁ జూడవగును."

"మీరిప్పు డెచటికి కేగదలంచుచుంటిరో, నా కొకింతయుఁ దెలియదు. తురంగములు మిక్కిలి బడలియున్నవి. ఇఁక నివి చాల దూరము పఱుపఁ నడవఁజాలవు."

"మనమును నిఁక విస్తారదూరము బో నక్కఱలేదు. (వ్రేలి తోఁ జూపుచు) చూడుము. మనయెట్టయెదుటఁ జూపట్టుచుండిన పర్వతముపై నాగురుసోదరుఁడగు "సమరనాధుఁడు" నివసించుచు న్నాఁడు. మన మిపుడు వాని కథితులము గాఁగలము."

"ఒహూ! నాకిపుడు జ్ఞప్తికి వచ్చినది. మీరు వానివృత్తాంత మప్పుడప్పుడు వచియించుచువచ్చిరి. మఱియు నతఁడొక శిలన్యమున కధ్యక్షుఁడనియుఁ జెప్పియుంటిరి."

"ఔను. నాకు వానిపై నధికవిశ్వాసముగలదు. వానిని జూచుకొనియే నన్నొక యధికునిగఁ దలంచుచుంటిని. మఱియు విజయేంద్రసింహుని కారాగృహమునుండి విడిపించుకొని స్వేచ్ఛగా సంచరించు దినములుగూడ వాని ప్రయత్న ఫలితంబే! అనవిస్తరవృత్తాంతమును వేఱొకసమయంబున వక్కాణించి తెలుపుదును. అతఁ డొక గొప్ప ధూర్తుఁడు. ఐయ్యారుఁడు. ప్రజ్ఞానిధి. విలాసప్రియుఁడు."

"ప్రాయంబున మీకు పెద్దగా, లేక నతఁడా?"

"అతఁడు నాకంటెఁ జాల చిన్నవాఁడు. మఱియు నతఁ డింకను యౌవనవంతుఁడని చెప్పనొప్పును. దేహదార్ఢ్యమును బాగుగఁ గలదు. వాని వాసస్థానము శ్రేష్ఠమయినది. రామణీయకమైనది. నావలె నాతఁడు సన్యాసివేషముతో నుండక రాజవైభవంబులఁ దులఁదూఁగుచుండును."

అధ్యక్షుని వచనంబులవలన మాయారాణి నెమ్మనంబునం దాశావిశ్వాసము లుప్పతిల్లెను. మఱియు క్షణకాల మామె నేత్రములయం దొకవిధంబగు విచిత్రప్రకాశమును చెక్కిలిలయం దరుణత్వమును మెఱసెను. మాయారాణి మరల నధ్యక్షునితో నివ్విధంబున సంభాషింపఁదొడంగెను:—

"నే నిపుడిట్టి దురవస్థకుఁ బాల్పడియుండినను మీకృపావిశేషంబుచేతనే యాశావలంబితనై యుంటిని."

"నే నెంతదనుక జీవించియుందునో, మఱియు నీమొదల ప్రసన్నుఁడనై యుందునో, యంతదనుక నీ సిగపూవైనను వాడరఁజాలదు. అకటా! నేఁటికి నాలుగుదినములకుఁ బూర్వమేకదా, నామిత్రుఁడగు నమరనాథుని యొద్దనుండి నిన్ను వెదకఁగొనుచు వచ్చితిని. ఇపుడు నాముక్కు ఖండింపఁబడియుండుటచే నతఁ డేమని భావించునో కదా!"

"ఈచెట్లలకు సులోచనయే కారణభూతులని యాలించి నంతనే వాని కనివార్యంబగు క్రోధము జనింపక మానదు."

"క్రోధమా! తత్క్షణ మతండాసులోచనను పట్టి రప్పించి దుష్క్రియ దానిప్రాణములను గొనుట నీవు గనులారఁ జూడఁగల వు. వానికది యొక గొప్ప కార్యముగాదు. మంచిది. మనమిపుడు గమ్యస్థానమునకు సమీపించితిమి. మన మీవాజీలనుండి దిగ వలెను."

ఆస్థానమున నొక చిన్నపర్వతము గలదు. దానికి వెనుక తట్టున గుడి యెడమలకుఁ జుట్టు దిరుగుచు నొక పర్వతపంక్తి చాల దూరమువఱకు వ్యాపించియుండెను. మాయారాణి యధ్యక్షు లిరు వు రాపర్వతముగ్రిందకుఁ జేరినంతనే తురగములనుండి దిగిరి. అశ్వా రూఢులయి యాకొండపైకిఁ బోవుట కెచటినుండియు మార్గము లేదు. వార లానగముపై కేగవలసియుండుటచే నధ్యక్షుఁ డాజవన ములు రెంటిని నిడుపాటివృక్షములతో నొకమ్రానునకుఁ గట్టెను. తదనంతర మాయధ్యక్షుఁడు మాయారాణిని వెంటఁదోడ్కొని యాయద్రిపై నెక్క నారంభించెను. దానిపై కేగుట కొక కాలి బాటమాత్రము గలదు. ఆమార్గము నిమ్నోన్నతములు గలిగి శిలా ఖండమయంబయి యుండుటచే తెరువరులు మిక్కిలి జతనముతోఁ బోవలసియుండెను. ఆపర్వత మంత యెత్తైనది కాకుండినను, మార్గ కాఠిన్యముచే నిరువు రాపర్వతోపరిభాగమునకుఁ జేరుసరి కొక గం టకాలము పట్టెను. వారిరువు రాభూధరముపైకిఁ జేరిన పిదప మా యారాణి యొకవృక్షతలంబున నిలచి ఆషాఢమాసమందలి మేఘ మాలికలు వడువునఁ దోఁచుచుండిన పర్వతపంక్తుల మనోహరదృ శ్యమును గనులువండువుగ దిలకింపఁదొడంగెను. క్రమముగాఁ గుట్ట లుపైగుట్టలు కొండలపైఁ గొండలు నెత్తుగ బెరిగియుండెను. దేని

వ్యాప్తి వందలకొలఁది కోసులదూరమువఱకు వ్యాపించియుండెనో ఆ వింధ్యాచల మియ్యదియే! ఆపర్వతముపై నెచట మాయూరాణి నిలచి ఆమనాకర్షితశ్రేణిని గాఢదృష్టిఁ బరికించుచుండెనో, యచటికి విజయేంద్రసింహ మహీపాలుని రాజధానియగు దేవిగడ మధిక దూరమునలేదు. కాని, యాస్థాన మా దేవిగడరాజ్యపు సరిహద్దుల లోనిది కాదు.

సూర్యాతపము మిగులఁ దీక్ష్ణతరంబుగ నుండెను. క్షుత్పిపాసవులు మిక్కుటముగ బాధించుచుండుటచే నధ్యత్నుఁడు మాయారాణిదెసకుఁ బరికించి, "యీపర్వతముపై నధిరోహించుటయందుఁ గలిగిన బడలిక యిప్పు డుపశమించియుండును. ఇచటఁ జాలసేపటివఱకు నిలచియుండుట వలన బ్రయోజనములేదు. మన మింకను గొంతదవ్వువఱకు నేగవలసియున్నది. ఆఁకలి దప్పికలచేఁ బ్రాణములు తల్లడిల్లుచున్నవి."

"ఉస్సీ! మన మింకను గొంతదూర మేగవలసియున్నదా? ఈపర్వతముపైననే యమరనాథుని మందిరము గలదంటిరికదా?"

"నిక్కమము. కాని, యీపర్వతముపై నెక్కుటతోడనే వానిమందిరము జూపట్టునని కాదు దానియందలి యభిప్రాయము."

"మంచిది. నడువుఁడు. మనమిఁక నెంతసేపటికి గమ్యస్థానమునకుఁ జేరఁగలము?"

"వడివడిగ నడచిన నొక గంటకాలములో,"

"ఔర!"

మున్ముందు తిలసామ్రధ్యత్నుఁడును వాని వెన్వెనుక మాయారాణియు ముందువైపునకుఁ బయలుదేరిరి. ముందున కేగుచున్నకొలఁది యాపర్వతమార్గ మెత్తైపోవుచుండుటచే మాయారాణి నడవఁ

జాలకుండెను. ఆమె కొంత కొంతదూరమున నిలచినిలచి శ్రమ నివారించుకొనుచు మరల సత్యవ్రతుని వెనుక నేగుచుండెను. తుదకు వారలొక కొండగుహాయొద్దకుఁ బోయిచేరిరి. దానియం దిరువురు మనుజులు నిలచి యొక్కొక్కరుగాఁ జొచ్చుటకుఁ దగిన మార్గము మాత్రము గలదు. అపుడా సత్యవ్రతుఁడు మాయారాణితో, "మన మీకొండగుహాయందుఁ [illegible]"దనెను. దానికిఁ బ్రత్యుత్తరమందు మాయారాణి యతనితో, "ఆటంక మేమికలదు? నడువుఁడు. నే నరుదెంచుటకు [illegible]టిని. కాని, కొంత సేపటివఱకు శ్రమ దీర్చుకొనని[illegible] పలికెను.

ఆగుహా కిరుపార్శ్వంబుల రెండు పెద్ద ఱాతిపలకలు గలవు. వానిలో నొకఱాతిపై నరేంద్రుండును రెండవదానిపై మాయారాణియుఁ గూర్చుండిరి. కొంతసేపటికి గుహయందలి యొకమనుజుఁడు వెడలివచ్చెను. వాని తొలిచూపు మాయారాణిపైనను మఱుచూపు సత్యవ్రతునిపైనను బడెను. మాయారాణిని గాంచినంతనే ఆయాగంతుఁ డధికాశ్చర్యనిమగ్నమానసుఁ డయ్యెను. కాని, సత్యవ్రతుని గాంచి భక్తి భయవిస్మయాందోళితహృదయుఁడై వానిపాదములపైఁ బడి, "మహాత్మా! నేఁడు మీరు మాయారాణిని వెంటఁదోడ్కొని విచ్చేయుట మిక్కిలి వింతగఁ దోఁచుచున్న"దనెను.

"ఔను. ఒక యత్యావశ్యకంబగు కార్యము తటస్థించుటచే నిటు రావలసివచ్చినది. మంచిది. నీకుఁ గుశలమే కదా? చిరకాలమునకుఁ బిదపఁ జూపట్టితివి!"

"మీకృపాతిశయంబున నే నన్ని తెఱంగుల సుఖముగ నుంటిని. తమ రీమధ్య నిచటికేతెంచి యామఱునాఁడే వెడలిపోయినట్టు లాలకించియుంటిని. నే నత్తరుణంబున నొకయావశ్యకమగు కార్యమునకై వృత్తింపఁబడియుండుటచే మిమ్ము సందర్శింపఁ జాలనైతిని.

(ఆశ్చర్యముతో) మీ ముక్కుపైఁ బట్టీ యేల వైచితిరి?"

"నిన్నటిదినమున పోరాటమం దొకఁడు నిష్కారణముగ నన్ను గాయపఱచెను. అందుచేఁ బట్టీవేయు నవసరము గలిగినది."

"(క్రోధావేశుఁడై) ఎవనికి మృత్యువు దాపించినది! మీ యనుచరులమగు మేముండఁగ మీ యెడల నిట్టివిధంబున బ్రవర్తించిన యాకూళ యెవఁడు? వాని పేరు కొంచెము నా చెవి వేయుఁడు."

"వచ్చితినికదా! సర్వము దెలియఁగలదు. నీవిపు డచటి కేగుచుంటివి?"

"నేనొక కార్యార్థమై మాప్రభువు నాజ్ఞానుసారము పోవుచుంటిని. మఱియు సాయంకాలమగుటకు మున్న మగుడివచ్చెదను. అనుమతిం[illegible]తురేని మీయాగమన సమాచారము మాప్రభువున కెఱింగించి వచ్చెదను."

"వలదు. ఎ[illegible] నేను స్వయముగ వాని యొద్ద కేగెదను. నీవిచట [illegible] చెప్పు మగుడివచ్చిన పిదప రాత్రిసమయంబున [illegible] సంభాషించుచున్నారు."

"చిత్తము. తమయిష్టము!"

ఆయాగంతుఁ డధ్యక్షుని పాదములపై నొఱిగి వేగమె యచటినుండి వెడలిపోయెను. తదనంతరము మాయారాణి యధ్యక్షునితో, "కటకటా! శుద్ధాంతమందిరములయందుఁ బరపురుషులకంటఁ బడకుండఁగ సంచరించు మాయారాణి నేఁడు సామాన్యజనులకు సహితము జూపట్టు దినములు సంభవించినవికదా!" యని పరితపింపఁదొడంగెను. అంత నధ్యక్షుఁ డామెతో నిటులఁ బలుకఁదొడంగెను:—

"నీ వీవిషయమునఁ బశ్చాత్తాపము నొందఁ బనిలేదు. కాలమెంతటివారికైన నొక్కరీతిగఁ గడవఁజాలదు. ఇపుడే కాలమహాత్మ్యము నిన్నింటినుండి యీావలకీడ్చెనో నీవొక దుర్మార్గురాలవకేఁ

బ్రజలకుఁ దోపింపఁజేయుచుండెనో—అధికారగౌరవములనుండి తొలఁగించి నిన్నొక కోఁతిగాని దానినిగఁ జేసియుంచెనో—మఱియుఁ బ్రజలకంటఁ బడకుండఁగ దాఁగి ప్రాణములను గాపాడుకొను గతికిఁ గొనితెచ్చెనో,, యిపుడు జాతిబంధుత్వములతోడను—తెరచాటు మఱుఁగును—మానమర్యాదలను తలపోయు టెందులకు? ఒకనాఁడాకాలమే మరల నీయదృష్టమును మెఱయఁజేసినఁ జేయువచ్చును. నీవా కాలపరిభావము చేతను నాతోడ్పాటువలనను ముకుందసింహుఁడు మున్నగువారిపై విజయమును బడసిన నీకీలజ్జాసంకోచము లెంతమాత్రము బాధకరములు గావు. ధనశాలురు కావించు యనేకదోషములను గాలమే కప్పిపుచ్చుచున్నది. భాగ్యవంతుని సన్మానించుట కెవ్వరును వెనుకాడరు. ఎన్నిదుర్గుణములు గలిగియున్నను ధనాఢ్యునిపై నిందారోపణము జేయఁజాలరు. ధనవంతుని పూర్వావస్థితి నెవ్వరు గమనింపరు. ధనమే కులహీనుని కులీనునిగ నొనర్చును. విద్యావిహీనుని పరమశ్రోత్రియునిగఁ దలంపఁజేయును. కురూపిని సురూపిగఁ దోపఁజేయును. ధనమం దిట్టిగుణంబులెన్నియో నిండియుండ నీ వావిషయమున విచారింపఁ బనిలేదు. నేఁటినుండి నిన్నొక పురుషునిగ భావించుకొనుచు నాయాజ్ఞానుసారముగఁ బ్రవర్తించుచుండుము.

"మీరు చక్కఁగ వచియించిరి. ఈప్రపంచమందలి నిజము మిట్టిదే! నేఁటినుండి నేనెట్టి తుచ్ఛవిషయములందును దృష్టినిడకుందును. మంచిది! నాకలసట దీరినది కావున మన మిడు లేచటికేగవలయునో సెలవిండు. కాని, యిపు డరుదెంచి పోయిన యా మనుజుఁ డెవ్వరు? అతఁడు నన్నెటుల గుర్తింపఁగలిగెను?"

"అతఁ డమరనాథుని మైయ్యారుఁడు. నాతోఁ గలసికొనుటకుఁ బలుమారులు మనరాజధానికి వచ్చుచుండెడువాఁడు. నిను

పోలు సువసిద్ధురాలిని గుర్తించుట మైయ్యారుల కొక కఠినవిషయము గాదుకదా?"

తదనంతర మధ్యస్థుఁడు లేచి నిలచి తన వెంట నేతెంచుటకు మాయారాణితోఁ బలికి యాబిలమందుఁ బ్రవేశించెను.

౧౬.

మాయారాణి యాగుహను సామాన్యమగు బిలముగఁ దలంచుచుండెను. కాని, యటులఁగాదు. దానియందుఁ గొంతదూర మేగినపిదప నంధకారము దట్టముగ వ్యాపించియుండుటచే మాయారాణి మిగుల దత్తరపాటు నొందుచుండుట నెఱిఁగి యధ్యస్థుఁ డామెతో ధైర్యవచనములను బలుకుచుండెను. ఆమె వాని వస్త్రమును బట్టుకొని, యాచీఁకటియందు నెమ్మది నెమ్మదిగా వెంటఁ బోఁదొడంగెను. దాదాపు నూరడుగులవఱకు నడచినపిదప మధ్యస్థుఁ డచట నిలచి యెడమ వైపునకు దారిపట్టెను. మాయారాణి కిప్పుడు మొదటికంటె నెక్కువభీతి గలుగుచుండుటచేఁ దల్లడిల్లుచు మధ్యస్థునితో "మనమిఁక వెలుతురులోనికిఁ బోఁజాలమా! వన్యమృగంబులు దీనియందు దాఁగియుండి మనలను జీల్చి మ్రింగవుగదా!"

"(గట్టిగా నవ్వుచు) నిశ్చయము. ఇంతవఱకు పిఱికిదానవా! తిలస్మరాణివగు [illegible] మునకు [illegible]."

"(తనమానసమునకు ధైర్యము దెచ్చుకొని) కాదు కాదు. నేను భీతిల్లుటలేదు. క్షుత్పిపాసాపీడనంబునను మార్గాయాససంజనితక్లేశంబువలనను దేహమంతయు శిథిలంబగుటచే సురంగమునఁదగు నీగుహా కంతము గలుగదా? యని ప్రశ్నించుచుంటిని."

"సంభ్రమము నొందకుము. మనము శీఘ్రముగ నేయీయంధకారమునుండి మనోహరితంబగు నొకమైదానమందుఁ బ్రవేశింపఁగలము. దానిని గాంచినంతనే యధికప్రమోదము నొందగలవు."

"అమరనాథుని మందిరమున కేగుటకీమార్గము దక్క వేఱొక మార్గము లేదా?"

"మఱియొకమార్గము లేదు."

"అగుచో నీయమరనాథున కనేకశత్రువులు గలరనియు, వారిభీతిచే నితఁ డిట్టి గుప్తస్థానమును తన కునికిపట్టుగ నేర్పఱచుకొని యిందు దాఁగియుండెననియుఁ దోఁచుచున్నది."

"(నవ్వుచు) కాదు కాదు. అమరనాథుఁ డొక యోగ్యపురుషుఁడు. తనవగతులను మాటలాడునంతలో నిర్మూలింపఁదగిన సమర్థుఁడు. అతఁ డీస్థానమునఁ గోరి నివసించుట లేదు. అతఁ డేతిలస్మమున కధ్యక్షుఁడో యాతిలస్మ మిచ్చోట నుండుటచే నిరుపాయుఁడై యిచట నివసించుచున్నాఁడు."

"మంచిది. ఈతిలస్మమున కధీశ్వరులెవ్వరు?"

"దీని కధికారులెవ్వరును లేరు. అనాఁ డీతిలస్మమును నిర్మింపఁజేసిన పురుషుఁడు దనకుటుంబములో నెవ్వరు నధీశ్వరులుగ నుండరాదనియు నధ్యక్షులుగమాత్ర ముండవలయుననియు శాసించి యుండెను. ఈయమరనాథుఁడు వాని వంశములోనివాఁడు. ఈతిలస్మమును కాపాడుటకంటె వానికి దీనిపై నట్టియధికారమును లేదు. కాని, వానికి వలయు ధనముమాత్ర మతఁడు దీనినుండి గ్రహింపవచ్చును."

"అగుచో, నతఁడు పూర్వుల యాజ్ఞ నుల్లంఘించి తిలస్మపదార్థములను తనయధీనమొనరించుకొనిన కాదనువారెవ్వరు?"

"ఎవ్వరును నిరోధింపఁజాలరు. కాని, ఈతిలస్మరహస్యముల నతఁడు గొంచెమైనను నెఱుంగఁడు. మఱియు నీతిలస్మ మెంత గుప్తరూపంబున నెవరికొఱకిందు నిర్మింపఁబడియుండెనో తెలియదు."

"నేను నాతిలస్మమువలన విశేషలాభమును బొందియుంటిని."

"నిక్కువము. కాని, దానియందే యమూల్యంబులగు నమూల్యపదార్థములు గలవో యని తిలస్మమును ఖండించువారికే గాని యితరులకుఁ జిక్కవు. మంచిది ఇఁక నడువుము. మనము గమ్యస్థానమునకు వచ్చి చేరితిమి. ఇచట నొకద్వారము గలదు. దానిని తెఱచి ముందున కేగవలసియున్నది."

అధ్యక్షుని వచనంబుల నాలించి మాయారాణి యచట నిలచిపోయెను. అతఁ డాచీఁకటియం దేమిసేయుచుండెనో మాయారాణి కిసుమంతయుఁ దెలియదు. కాని, రెండు మూఁడు క్షణంబులలో, లోహకవాటము దెఱవబడు నప్పు డెట్టిధ్వని పుట్టునో యట్టి సవ్వడియే యామెకు వినిపించెను. అధ్యక్షుఁడు మాయారాణి చేయి బట్టుకొని రెండు మూఁడడుగులు ముందునకుఁ జేర్చి తాను వెనుక నిలచిపోయెను. మరలఁ గొంతవడి కాద్వారము బంధింపఁబడిన చప్పుడు వెడలివచ్చెను. తదనంతర మధ్యక్షుఁ డాస్థానమం దెచటనో దాఁచి యుంచఁబడిన సామానులను దీసి యొక మైనపువత్తిని వెలిగించెను.

కొంతసేపటినుండి గాఢాంధకారమం దుండుటచే మాయారాణి మిక్కిలి దద్దఱిల్లియుండెను. కాని, యిపుడు ప్రకాశము గలుగుటచే నామె చైతన్యయై కన్నులను దెఱచి తెఱచి నలువైపులకుఁ జూడదొడంగెను. తా మేవైపుననుండి వెడలివచ్చిరో, యాదిశయం దొక యినుపతగడుమాత్రము చూపట్టుచుండెను. దానియందు ద్వారముండిన చిన్నెలేమియుఁ గన్పించుటలేదు. ముందువైపున గాక కుడి యెడమ పార్శ్వంబులు శిలామయంబయి యుండెను. మఱియు నది నైసర్గికమైనదిగాక, మనుష్యప్రయత్నమువలన నిర్మింపఁబడిన సురంగమని స్పష్టముగాఁ దెలియుచుండెను. ఆసురంగ మంతటితోఁ బరిసమాప్తినొందలేదు. అచటినుండి ఎడమవైపునకుఁ దిరిగి మూఁడు

నాలుగు మెట్లు దిగినపిదప నింకను గొంతదూరమున నొకసురంగము వెడలియుండెను. మాయారాణి యాశ్చర్యదృష్టి నలుదెసలకుఁ బరికించుచు నధ్యక్షునితో, "రాజా! మన మనుకొనుచుండిన యినుపతలుపు నిస్సందేహముగ నొక ద్వారమై యున్నను గాని, దానియాకారము కొంచెమైనను జూపట్టుటలేదు. దానిని మీరెటులఁ దెఱచి బంధించియుంటి"రని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరమం దధ్యక్షుఁ డామెతో, "యీద్వారమును దెఱచువిధ.... నియమానుసార మమరనాథుని యాజ్ఞలేనిదే వెల్లడింపరాదు. (మెట్లవైపునకుఁజూపి) ఈమెట్లపైనుండి దిగు సమయంబున తబ్బిబ్బు పడుదువను తలంపుతో నీకు వీటిని జూపుటకుమాత్రమే నే నీమైనపువత్తిని వెలిగించితి" ననెను. తదనంతర మధ్యక్షుఁ డావత్తి నార్పివైచి దాని నెచటనో దాఁచియుంచెను. మఱియు మాయారాణి చేయిఁ బట్టుకొని మెట్లపైనుండి క్రిందికి దిగెను. తనప్రశ్నకు సదుత్తరమును బడయకుండుటచే మాయారాణి మోము చిన్నవుచ్చుకొని దురంతవ్యథకుఁ బాలయ్యెను గాని, ఏమిసేయఁగలదు? తానిపు డన్ని తెఱంగుల వాని యధీనమందుఁ గలదు.

మెట్లనుండి క్రిందికి దిగుటతోడనే యామె కెదుటివైపున కొంతదూరమునుండి ప్రకాశము చూపట్టెను. మఱియు నచటితో నాసురంగము సమాప్తి నొందియుండెననియు నామె గ్రహింపఁగలిగెను. ఆశాభయసంభ్రమ విస్మయంబులతో మాయారాణి యామార్గమును గూడ వెనుకవైచెను. మఱియు నామె సురంగపు తుది ద్వారము వెలువలఁ బాదమిడి యొక రమణీయ మనోహరస్థానమును గనుగొనెను.

ఈసమయంబున మాయారాణి నేత్రములయెదుట గుల్మపుష్పలతాదులతోడను వివిధఫలవృక్షంబులతోడను నిండియుండిన చ

తురస్రంబగు ప్రదేశమొకటి గలదు. దానివిరివి నాలుగైదు వందల గజములకంటె నెక్కుడుగ నుండదు. నలుదెసల యేటవాలుగలిగి పచ్చని పర్వతశ్రేణితో నాస్థానము చుట్టఁబడి కడు మనోజ్ఞంబుగఁ గాపట్టుచుండెను. ఆశైలముపైఁగల మనోహరవృక్షజాలమునుండియు గుల్మలతాదులనుండియు శీతలమందవాయువు వీతెంచుచుండెను. మాయారాణి నిలచియున్న స్థానమున కెదురుగనున్న పర్వతమధ్య భాగమునుండి యొక స్రోతస్విని భూపతితంబగుచు విమలముత్యంబులను గేలిసేయు నిర్మలజలంబుతో సన్నని నీటిబోదులయందుఁ బ్రవహించుచు, నాప్రదేశమందలి పూలమొక్కలను, లతానికుంజములను, దాడిమ, నిమ్మ, ఖర్జూర నానావిధ ఫలవృక్షములను తడుపుచు వానిని పల్లవింపఁజేయుచుండెను. మృదుమధుర రుతంబులచే మానసంబుల నాకర్షించు వివిధ పక్షిగణంబులును నవవికసితపుష్పరాజిపై విచ్చలవిడిఁ దిరుగాడుచు మాటిమాటికి వానిని ముద్దుగొనుచు నెగురుచుండిన మత్తభృంగంబుల ఝుం ఝుమ్మను మధుర నిస్వానంబులును, మనోవ్యథాపీడనంబున శిథిలులై యుదాసీనతవహించి యుండిన వారి మానసంబులకు దార్ఢ్యమును, నానందముతోపాటు చైతన్యమును సమకూర్పఁ దగియుండెను. ఆస్థానమం దగ్గభాగ మస్త్రోన్ముఖుండగు సూర్యభగవానుని కృపావిశేషంబున నీరెండయను వచ్చడము గప్పబడి యుండుటచేఁ బలువిధంబులగు చింతలతోడను మనోవ్యథతోడను వికలచిత్తయై యుండిన మాయారాణి సహిత నూతనపూర్వప్రకృతిశోభను దిలకించుచుఁ గొంత తడవు[illegible]లే తన్నుఁ దా మఱచియుండెను. కొంతవడి కామె చైతన్యయై, "ఆహా! యిట్టి సుమనోహరస్థానము యొక్క యనిర్వచనీయానందమును జూఱఁగొనువా రెవ్వారేనియు నిచటఁ గలరా!" యని యోజించుచుండ దక్షిణదిశయందుఁ దన ప్రతిభాసంపదచేఁ జెన్నెల గారుచుండిన యొక

దివ్యభవనముపై నామె దృష్టి పడెను. కాని, యామనోహరమందిర రాజము నామె బాగుగఁ జూడఁజాలదాయెను. అట్టితరుణంబుననే యధ్యక్షుఁడు నవ్వుచు, "యిచట నింకను నెంతసేపటివఱకు నిలచి యుండెదవు? రమ్ము! ముందునకుఁ బోవుద"మనెను.

ఏస్థానమున మాయారాణి నిలచియుండెనో యది భూమి నుండి దాదాపిరువదియైదు గజముల యెత్తున నుండెను. అచటినుండి క్రిందికి దిగిపోవుటకుఁ జిన్నచిన్న మెట్లు కట్టఁబడియుండెను. అధ్యక్షుఁడు మొదట నామెట్లపయి తన యమంగళమయంబగు పాదము నిడెను. వాని పిఱుంద మాయారాణియుఁ బోఁదొడంగెను.

ఆయిరువురు నామనోహరస్థానమందలి పూలమొక్కల వరుసలను బొదరిండ్లను దాటుచు నొక సుందరంబగు పర్వతనిమ్న భాగమునకుఁ బోయి చేరిరి. మఱియు నాసమయంబుననే యిరువురు మనుజు లాపర్వతమునుండి క్రిందికి దిగి వచ్చుచుండుట వారు కనుగొనిరి. ఆయాగంతుల వేషభూషణంబులను గాంచుటవలన వారిరువురు నైయ్యారులని మాయారాణి సూక్ష్మముగ గ్రహింపగలిగెను. మాటలాడునంతలోనె పురుషు లిరువురు నధ్యక్షుని సమీపించి వారికిఁ జేమోడ్చి, "బాబాజీ! యమరనాథుఁడు మిమ్ములను దవ్వుననుండి కాంచియే గుర్తించియున్నాఁడు. కాని, మీవెంట నేతెంచుచుండిన యీమాయారాణిని గుర్తింపఁజాలఁడయ్యె"ననెను.

ఆయాగంతుని వచనంబుల నాలించి, మాయారాణి యబ్బురపాటునొందుచు, "ఏమి! యీవిచిత్రము! ఇచటి వారలెల్లరు నన్నుఁ గాంచి గుర్తించుచున్నారు. ఈవిషయమును బాబాజీని ప్రశ్నించి తెలిసికొనుట కిది తరుణము గాదుకదా!" యని తలంచి మిన్నకుండెను. అధ్యక్షుఁ డాయయ్యారు లిరువురితో, "మీకుఁ గుశలంబేకదా? అమరనాథుఁడు సుఖంబుండెనా?" యని ప్రశ్నించెను.

ఒకఁడు:—చిత్తము. మీకృపావిశేషంబున మేమెల్లరము సుఖము స్థులమై యుంటిమి. కాని, ముక్కుపైఁ బట్టియేలవైచితిరి?

అధ్యక్షు:—ఆవృత్తాంతమంతయు నమరనాథుని సమక్షమున వివరించుతఱి మీరును వినఁగలరు. శీఘ్రముగ నడువుఁడు. క్షుత్పిపాసువులవలనను మార్గాయాసక్లేశంబుచేతను నాప్రాణములు తల్లడిల్లుచున్నవి.

తదనంతర మానల్వు రావర్వతముపై నధిరోహింపఁదొడంగిరి. అది యంత యెత్తైనది కాకుండినను, దానిపై నెక్కుటకు మాయారాణికి మిక్కిలి కష్టతరంబయ్యెను. ఆపర్వతముపైకిఁ జేరినంతనే యాదివ్యభవనముయొక్క నిర్మాణనైపుణియు, దానియందలి యలంకారములను గాంచి మాయారాణి యాశ్చర్యచకితయయ్యెను. మేమిచట నీమందిరవిభవమును వర్ణించుచు వ్యర్థముగఁ గాలయాపన మొనరింపక ముఖ్యాంశమువైపునకు మరలుచుంటిమి.

ఆయార్యు లిరువురు నమరనాథుఁడు కూర్చుండియుండిన గది సమీపమునకు వచ్చినంతనే యతఁడు లేచి యాగంతులకు స్వాగతంబొసంగు తలంపుతో వెలుపలకు వెడలివచ్చెను. మఱియు మాయారాణీయధ్యక్షుల నిరువుర నత్యంతహర్షంబుతోఁ గలసికొనెను. మిక్కిలి సన్మానపూర్వకంబుగఁ దనగదిలోనికిఁ దోడ్కొని పోయెను.

అమర:—(అధ్యక్షునితో) మీరును మాయారాణియు శ్రమగైకొనిన కారణమును ప్రశ్నించుటకుమున్న మీముక్కుపయిఁ బట్టివైచిన కారణమును తెలిసికొనఁగోరుచుంటిని.

అధ్యక్షు:—మిమ్ము వీడ్కొని వెడలినపిదప నే నేయవస్థలకుఁ బాలయితినో యిది దాని నిదర్శనస్వరూపము. కొంత విశ్రాంతి గైకొనిన పిదప నావృత్తాంతమంతయు మీకు వివరించి తెలి

పెదను. ఇవు డాకలిదప్పికలచేతను మార్గాయాసంబువలనను ప్రాణములు తల్లడిల్లుచున్నవి.

అధ్యక్షుని వచనంబుల నాలించి యమరనాథుఁడు మాఱుపలుకక మిన్నకుండెను. మఱియు మాయారాణీయధ్యక్షులకు మజ్జనభోజనాదికములకుఁ దగు నేర్పాటులను గావించెను. వారలు దనివిదీర మెసవిపిదపఁ గొంత తడవు విశ్రమించి తమప్రయాణపు బడలికను దీర్చుకొనిరి. రాత్రి ప్రారంభమగుటకుమున్నె యమరనాథుఁడు స్వయముగ నధ్యక్షుఁడు విశ్రమించియుండిన గదిలోనికి వచ్చెను. ఆగది యమరనాథుని కచ్చేరిచావడికి బ్రక్కనే కలదు. ఆసమయంబున మాయారాణియు నధ్యక్షుని సమీపమునఁ గూర్చుండి తన దుఃఖపూరితకథను వర్ణించుచు వాపోవుచుండెను. అమరనాథుఁ డచటికే తెంచుటతోడనే యామె తనకథను నిల్పి మిన్నకుండెను. మఱియు నధ్యక్షుఁ డతియాదరంబున నమరనాథుని తన ప్రక్కను గూర్చుండఁబెట్టుకొనెను.

అమర:—ఇపుడు మీవృత్తాంతమంతయు సావకాశంబుగఁ జెప్పి వినిపింపుఁడు. దానిని వినుటకై నామానసము మిక్కిలి వ్యగ్రతఁ జెందుచున్నది.

అధ్యక్షు:—నావృత్తాంతమంతయు వివరించి తెలుపుటకు మీయొద్దకు రానైయుంటిని. మీరే స్వయముగ నిచటికి వచ్చి చేరితిరి. మేలయ్యెను.

అధ్యక్షుఁడు తనయొక్కయు, మాయారాణియొక్కయు సకలవృత్తాంతములను మేము పైన లిఖించియుండిన విధంబున నమరనాథునకు విశదీకరించుచుండెను. అతఁడు మాటాడక దానిని వినుచుండెను. తుద కెపుడు సులోచనవలన నధ్యక్షుని ముక్కు ఖండింపఁబడిన వృత్తాంతము నాలించెనో యపు డొక్కమాఱుగ నాతనికి

క్రోధావేశము జనించెను. వానిమో మెఱ్ఱబాఱెను. పెదవు లదరఁ దొడంగెను. మఱియు నతఁ డేమియు బదులు పలుకక యే తటాలున నచటినుండి లేచి వెలుపలకు వెడలిపోయెను. ఆస్థితిఁ బరికించి మాయారాణి యబ్బురపాటు నొందుచు నధ్యక్షునితో, "బాబాజీ! అమరనాథుఁడు మీతో నేమియుఁ బలుకకఁ దటాలున లేచిపోవుటకుఁ గారణ మెద్దియో వచియింపఁగలరా?" యని ప్రశ్నించెను.

"నావృత్తాంతము నాలించినంతనే వానికి హృదయమునఁ గ్రోధావేశము జనించినటులఁ దోఁచుచున్నది. మఱియు నతఁడు దానికేప్రతీకారమొనరించుటకో యచటినుండి వెడలిపోయెనని నాయభిప్రాయము."

"అతఁడు సులోచన నెఱుంగునా?"

"బాగుగ నెఱింగియున్నాఁడు. మఱియు దాని పూర్వోత్తర వృత్తాంతము లతనికి దెలిసియున్నంత నీకుఁ దెలిసియుండదు."

"అదియెట్లు?"

"ఏకాలమందు సులోచన వ్యభిచారవృత్తి బజారునందుఁ గూర్చుండి యుండెనో, మఱియు 'పుష్పమంజరి' యను పేరుతోఁ బ్రసిద్ధి గాంచియుండెనో, యాకాలములో నమరనాథుండు మారువేషమునుదాల్చి నానాఁడు దానిసంగీతము నాలింపుచుఁ బోవుచుండెడివాఁడు. తత్కారణంబున దాని రహస్యవృత్తాంతము లన్నియు వానికిఁ దెలిసియుండెను. కాని, చాలదినములనుండి వానితో స్నేహము గలిగియుండినను సులోచన కమరసింహునివృత్తాంత మించుకైనను దెలియదు. అతఁడొక సర్దారుఁడనియు, ధనవంతుఁడనియు మాత్రి మెఱుంగును."

అరగంటకాలమువఱకు నిట్టివిధంబులగు సంభాషణములను సాగించుచుండిరి. తదనంతర మమరనాథుని మైయ్యాయుఁడగు భాను

సింహుఁడాగదిలోని కేతెంచి యధ్యక్షునితో, "అమరనాథుఁడు మిమ్ముల నొంటరిగ రమ్మనిఁ గోరుచున్నాఁడు. మందిరము వెనుక నుండిన పూఁదోఁటయం దొంటరిగ విహరించుచున్నాఁడు. కావున మీ రచటికేగి వానితోఁ గలసికొను"డనెను.

ఈసందేశము నాలించినంతనే యధ్యక్షుఁడు లేచి నిలచి, మాయారాణితోఁ దనగదిలోనికిఁ బోవుటకు దెల్పి యమరనాథుని యొద్దకు బయలుదేరెను.

ఆమందిరమునకు వెనుకతట్టున చక్కని పూఁదోఁటయొకటి గలదు. అది మనోహరంబగు పూలచెట్ల వరుసలతోడను లతాని కుంజములతోడను మిక్కిలి సొంపుగఁ దోఁచుచుండెను. దానియం దమరనాథుఁ డొంటరిగ సంచరించుటఁ గనుగొని యధ్యక్షుఁడు వానిచెంతకుఁ బోయి నిలచెను.

అమరనాథు:—మిత్రపుంగవా! ఎన్నఁడు తలంచని వృత్తాంతము నేఁడు మీనోట వినియుంటిని.

అధ్యక్షుఁడు:—ఔను. సులోచనయొక్క దౌష్ట్యము నాలించి మీకు శోకసంతాపములు తప్పక జనించియుండును.

అమరనాథు:—సులోచన మీయెడల మిక్కిలి యనుచితముగ బ్రవర్తించియుండెననుట కెట్టి సందేహమును లేదు. మఱియు దానిని బంధించి తెచ్చుట కొకయెత్నమ్యారుని మఱికొందఱు భటులను బుత్తెంచియుంటిని. కాని, నాసంకేత మది కాదు. ముకుందసింహునకు సంబంధించిన విషయములగూర్చి నా సూచన. ముకుందసింహుఁ డింతవఱకు జీవించియుండెనను సందేహమైనను నాకు గలుగలేదు. మఱియు మాయారాణి ముకుందసింహునిభార్య కాదనియు మీకృపాకలితాపాంగ వీక్షణమువలననే కమలాదేవి స్థానమున నాకుటిలవ్యాదయు

యాక్రమించుకొని యుండెననియుఁ గలనైన దలంచియుండ. అహహా! ఈప్రపంచ మెంతవిచిత్రమైనది! కావుననే దీని యందు జరించు జనులు యుచ్ఛతరాభిలాషచేఁ జెడుచున్నారు" అనెను.

అమరసింహుని వచనంబుల నాలించి యధ్యక్షుఁడు చకితుఁడయ్యెను. మఱియుఁ దన యాశాలతయం దేదో వేఱుపురుగు పుట్టుచుండెనని వాని కపుడు దోచెను. అతఁడు తల్లడిల్లుచు భూమివైపున కుదాసీనతతోఁ జూచుచు నసురనాధునితో నిట్లనియెను:—

"మాయారాణిని కమలాదేవిస్థానమున జేర్చినది నానేరమే! సందేహములేదు. కాని, ముకుందసింహుని విషయమునమాత్రము నిర్దోషిని. మాయారాణి ముకుందసింహుని బంధించియుంచెనను సందేహమైనను నాకెన్నఁడు గలిగియుండలేదు. అతఁడు నిక్కువముగ మరణించి యుండెననియే నాతలంపు."

"(అధ్యక్షుని మాటలను వినిపించుకొనకయే) ముకుందసింహుఁడు నీ కెద్దియేని యపకార మొనర్చియుండెనని నీవు వచియింగలవా!"

"లేదు."

"ఆపృథ్వీకుని కాలమునాఁటికంటెఁ నిపుడు ప్రసన్నతతో నుంటిననియైనను వచియింపఁగలవా!"

"(దీర్ఘనిశ్వాసను బరిత్యజించి) అకటా! ప్రసన్నత నాకొఱకు సృజింపఁబడనేలేదు."

"కాదు కాదు. అటుల వచియింపరాదు. పరమేశ్వరుఁడు ప్రతిపాదించియుండిన ప్రసన్నతను కాళ్ళతో నెగజిమ్ముకొంటివని పలుకుటమేలు."

"సత్యము"

"(ఆవేశముతో) మిత్రమా! ముక్కు తెగిగించుకొనియు లోకమునకు మోముజూప సిద్ధపడుచుంటివి. పూర్వపువృత్తాంతములను దలపోసి కొంచెమైనను పశ్చాత్తాపము నొందకుంటివి. ఏదురాత్మురాలగు మాయారాణి తనధర్మమును జెఱుపుకొనియుండెనో—ఎవతె లోకాపవాదమునకు జలాంజలి యొసంగి కూర్చుండెనో—ఏదుష్టురాలు తన శిరోచ్ఛత్రమగు ముకుందసింహునియెడల విశ్వాసఘాతుక మొనరించియుండెనో—ఏపిశాచి తన తల్లిదండ్రుల జీవములను గొనియుండెనో—ఎవతె కారణంబున కారాగృహక్లేశముల ననుభవించు భాగ్యము మీకుఁ గలిగెనో—ఎవతె సత్సాంగత్యమువలన ముక్కుఁడి యగుగతి మీకుఁ బట్టెనో—అట్టి పాపాత్మురాలికి దోడ్పడ సిద్ధపడుటయేగాక, యీ పాపకార్యమందు నా సహాయము గొని నన్నుగూడ పాపభాజనునిగ నొనరింపఁదలంచుచుంటిరి కాఁబోలు. ఆహా! మిత్రరత్నమా! మీగురుమహాశయునకు మంచిప్రతిష్టను గలిగించుచుంటిరి. నాకును నేమేమో యుపదేశింప విచ్చేసితిరి. భాపురే! ఒకవెల యాలిచేతినుండి తనముక్కును కాపాడుకొనఁజాలని మిముంబోలువాఁడు ప్రతాపవంతుఁడును, ధర్మనిష్ఠుఁడును, దయాపరుండునునగు విజయేంద్రసింహ మహీపాలుని సమూలముగ నాశమొనరింపఁ దలంచిన మీకోరిక యెంతేనియు శ్లాఘాపాత్రము. మిమ్ము కారాగృహమునుండి విడిపించి యామహీపాలునియెడల నే ననంతాపరాధ మొనరించి యుంటిని. తదపరాధమును వానివలన క్షమింపఁజేసికొనుటకుఁ బ్రయత్నించుచుంటిని. కాని, నేనెవరికారణంబున నపరాధుఁడనయితినో యతఁడిపుడు మరల..."

ఇవ్విధంబున బలుకుచు నమరనాథుఁడిక మాట్లాడఁజాలఁడయ్యెను. క్షణక్షణ మభివృద్ధిజెందుచుండిన క్రోధావేశము వాని

కంఠమును నొక్కి వైచెను. వానిమోము జేవురించెను. పెదవు లదరఁదొడంగెను.

అధ్యక్షుని మోము వెలవెల బారెను. వాని గత పాపకృత్యములు వాని కన్నుల యెదుట నిలచి తమ భయంకరాకృతులచే వానికి భీతిఁ గొల్పఁదొడంగెను. అతఁడు దన రెండుచేతులతో దనమోము మూసికొని విలపింపఁదొడంగెను.

కొంతసేపటివఱ కచట నిస్తబ్ధత వ్యాపించెను. తదనంతర మమరనాథుఁడు మరల నివ్విధంబునఁ బలుకఁదొడంగెను:—

"అకటా! నా కాకాలమునాఁటి సంగతులు మాటిమాటికి జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఏకాలంబున దయాస్వరూపుండును, ధర్మనిష్ఠాగరిష్ఠుండును నగు ముకుందసింహ నరపాలుని కృపావిశేషంబున మీకు మానమాన్యతలును ప్రతిష్ఠయుఁ గలిగియుండెనో, ఎవరు ప్రజలవలన నొసంగఁబడు కానుకలను, "సోదరా! వీనిని పరిగ్రహింపుఁ"డని మీయెదుట నుంచుచుండెనో, యనివార్యంబగు క్రోధముప్పతిల్లిన కాలంబున నెవరు మీస్వరూపమును గాంచినంతనే శిరమును వంచుచుండెనో, మఱియు నతిప్రియత్వంబున గోవము నడంచుకొని నగవుతో మీవైపునకుఁ బఱికించుచుండెనో, యట్టి సాధుమూర్తి—యకలంకచారిత్రుఁడు మీకు భీతిల్లిగాని, మీ రొనర్చియుండిన యేయుపకారభరమ్మువలనగాని, యటుల మీకు వినమ్రుఁడగుచుండెనని యెవ్వరేనియు వచియింపఁగలరా? కల్ల కల్ల! అటులెన్నటికిఁ గాఁజాలదు. వానికి మీపైఁ గలిగియుండిన యప్రతిహతంబగు ప్రీతియే దానికిఁ గారణము. మఱియు మీకు దీక్షనొసంగియుండిన దయానందస్వాములవారు మీకు సద్బోధనము గావించియుందురనియు, మీవర్తనము నిష్కళంకమైనదనియుఁ దలంచి మిమ్ము మన్నించియుండెను గాని, తేనెపూసిన కత్తివగుదువని

యతఁడు తలంచియుండలేదు. కటకటా! అట్టి ధర్మావతారుని యెడ
లనా మీ రిటులఁ బ్రవర్తించుట! ఛీఁ ఛీఁ నే నట్టి జీవితమును తిర
స్కరించుచుంటిని. తూలనాడుచుంటిని. ఇంతటి ఘోర యనుచిత కా
ర్యములను గావించియు నీపాపప్రపంచమం దెవరికి మోము చూపుటకు
బ్రతికి యుండవలెను? సర్వవ్యాపకుఁడగు భగవంతుఁ డొకఁడు గలఁ
డను మాట మఱచియుంటిరా? మంచిది! నేనిఁక విశేషముగఁ జెప్పు
నగత్యములేదు. మీ గదిలోనికిఁ బోయి విశ్రమింపుఁడు. మీకు నా
లుగుదినములు గడువు గలదు. ఈ యంతరములో మీ కెయ్యది కర్త
వ్యంబో-ఏపథావలంబనము శుభకరంబో, చక్కగ యోజించి నిశ్చ
యించుకొనుఁడు. జాగ్రత్త! మన మిప్పు డాడుకొనినమాటలు మా
యారాణికిఁ దెలియ రాదుసుమా! మఱియొకమాట! ఈగడువు దిన
ములలో మీరు నన్ను గలసికొనుటకు వాంఛింపరాదు."

౧౭.

తిలస్నాధ్యక్షుఁ డమరనాథుని భాషణము నాలించి మారాడ
నోడి తిన్నఁగాఁ దనగదిలోనికి వెడలి చనెను. మఱియుఁ బచ్చడ
ములో మోము గప్పుకొని తన దుర్భాగ్యమును దలంచి వగచు
చుఁ బర్యంకముపైఁ బరుండియుండెను. ఒకజాము రేయి గడచినపిదప
నమరనాథుఁ డధ్యక్షుని యేల పిలచెనో దానిని దెలిసికొను నాశ
మాయారాణి వానిగదిలోనికిఁ జనెను. మఱియు మోము వస్త్ర
తోఁ గప్పుకొని పరుండియుండుట గాంచినంతనే యామెకు గలిగిన
యాశ్చర్యమునకు మేరలేదు. తదనంతరము మాయారాణి వాని
సమీపమున కేగి మోముపైనుండి పచ్చడమును తొలగించి, యతఁడు
మేల్కొనియుండుటయు! నతఁ డనేకదినములనుండి రోగగ్రస్తుఁడై
యుండినవిధంబున దేహము రక్తహీనమై వెలవెలఁ బోవుచుండు
టయుఁ గనుగొనెను.

అధ్యక్షునియం దొప్పుచుండిన తాత్కాలికావస్థను గమనిం చి మాయారాణి నిర్ఘాంతయై వానిమోమునంక భయసంభ్రమకలం కాదృష్టి బరికింపసాగెను. అంత నధ్యక్షుఁ డామెతో నివ్విధంబున సంభాషింపఁదొడంగెను:—

"నీవిపుడేగి పరుండుము. నాదేహములో బాగుగాలేదు. రే పటిదినమున సంభాషింపవచ్చును."

"అమరనాథుఁడు మిమ్మేల పిలిచెనో, యతఁ డేమి వచియిం చెనో, యావిషయములను దెలిసికొనుటకు మాత్రము వచ్చితిని."

"ఏమియులేదు. కొన్ని ధైర్యవచనములనుమాత్రము పలికి యుండెను. మఱియు నాల్గుదినములిచట నాఁగవలెననియు నంతలో సులోచనను బట్టఁబోయిన తనభటులు మగుడివత్తురనియుఁ దెలిపి యుండెను."

"కాని, మీయవస్థను గాంచ నేఱువిధంబుగఁ దోఁచుచు న్నది."

"చాలును. నన్నిఁక నేమియుఁ బ్రశ్నింపవలదు. నాదేహా రోగ్యము సరిగాలేదని యిప్పుడేకదా చెప్పియుంటిని. మాట్లాడుట కు సహితము నాకు గష్టముగ దోఁచుచున్నది."

మాయారాణి మరల నేమియుఁ బ్రశ్నింపఁజాలదయ్యెను. మఱియు నచటినుండి మరలి తనగదిలోనికిఁ జని పర్యంకముపైఁ బరుండి దురంత యోజనాసాగరంబున మునింగిపోయెను. ఆమె గు రుతరచింతతోడను, మార్గాయాసమువలనను తల్లడిల్లుచుండుటచే నతికాలంబుననే నిద్రాదేవి యంకపాళి శిరమునిడి గుఱకలు కొట్టు చు నిద్రింపఁదొడంగెను.

తెల్లవాఱిన పిదప నధ్యక్షుఁడు నిద్రనుండి లేచినంతనే వాని సమీపమున కొక సేవకుఁ డరుదెంచి, "మహాత్మా! అమరనాథుఁ

డు మూఁడునాల్గు దినములలో మగుడివచ్చెదనని చెప్పి యెచటికో వెడలియున్నాఁడు. మఱియుఁ దాను తిరిగి వచ్చుదనుక మీరుగాని మాయారాణిగాని యిచటినుండి వెడలుటకుఁ గోరరాదనియు వచి యించియుండెనని" పలికెను. అధ్యక్షుఁ డాసమాచారము నాలించి తనలోఁ దా నిటులఁ దలపోయదొడంగెను:—

"అకటా! ఈప్రపంచమందు మాయారాణికిఁ దోడ్పడువా రొక్కరును గానరారు. ఆమె తనకర్మఫలము తప్పక యనుభవింప వలసియున్నది."

౧౮.

అధ్యక్షుఁ డేకాంతమం దెటులనో మూఁడునాల్గు దినములు మిక్కిలి కష్టముతోఁ గడపెను. నేఁ డైదవదినము. అధ్యక్షుఁడు శయ్యనుండి లేచి గది వెలుపలకుఁ జనినవెంటనే యొకసేవకుఁ డరు దెంచి వానితో, "మహాత్మా! అమరనాథుఁడు మిమ్ము జ్ఞప్తి గొను చున్నాఁడు. మాయారాణిని వెంటఁదోడ్కొని పూఁదోఁటయందు వానిని గలసికొను"డనెను.

ఈసందేహము నాలించినంతనే యధ్యక్షుఁ డచటినుండి బ యలుదేరి మాయారాణి గదిలోని కేగెను. మఱియు నామెను తన వెంటఁదోడ్కొని తొలినాఁ డేస్థానంబున నమరసింహునితోఁ దాను గలసికొనియుండెనో, మఱియు వానివలన దలవాయునటుల చీవాట్లను దినియుండెనో యా పుష్పోద్యానములోనికిఁ బోయి చేరె ను. అచట మూఁడుకుర్చీలు వేయఁబడియుండెను. వానిలో నొకకుర్చీ యం దమరనాథుఁడు కూర్చుండి యుండుటయుఁ దక్కిన రెండు కుర్చీలు వ్యర్థముగఁ బడియుండుటయు వానియెదుట నిరువురు భటు లు సులోచన భుజములు రెంటిని పట్టుకొని యిరుపార్శ్వంబుల నిలచి

యుండుటయు నామె హస్తద్వయము వెనుకవైపునకు విఱిచి దృఢముగఁ గట్టఁబడియుండుటయుఁ గనుఁగొనెను. అమరనాథుఁడు మాయారాణీయధ్యక్షులను గాంచినంతనే కూర్చుండుఁడని సన్నఁజేసెను. ఆయిరువురు నమరనాథుని ప్రక్క వ్యర్థముగ బడియుండిన కుర్చీలలోఁ గూర్చుండిరి.

అధ్యక్షునకుఁ గలిగియుండిన యవస్థను వీక్షించి, యమరనాథుఁడు తనకుఁ దోడ్పడుటకుఁ బూర్తిగఁ దిరస్కరించియుండెననియుఁ దత్కారణంబుననే యధ్యక్షుఁ డిటుల వెతలఁగుందుచుండెననియు మాయారాణి తలంచియుండెను. కాని, యిప్పుడు తనయెదుట సులోచన వివశయై నిలచియుండుటఁ గాంచి యామెకుఁ గొంత ధైర్యము చేకూరెను. మఱియు నధ్యక్షుని యుదాసీనతకు వేఱెద్దియో హేతువు గలిగియుండుననియు, నమరసింహుఁడు తన కవశ్యము దోడ్పడఁగలఁడనియు నామె తలంచెను.

సులోచనను బంధించికొనిపోయిన సుందరలాలు స్వయముగ నమరనాథుఁడుగాని, వానియనుయాయులలో నొకఁడుగాని కావలయునని మాపాఠకమహాశయు లిప్పుడు తెలిసికొని యుందురు. ఆవృత్తాంతమును మేము పైప్రకరణమందు లిఖించియుంటిమి.

మాయారాణీయధ్యక్షులు కూర్చుండిన పిదప నమరనాథుఁడు సులోచనవైపునకుఁ బరికించి, “నీవేకదా! యధ్యక్షమహాశయుని ముక్కు గోసినదాన”వని ప్రశ్నించెను.

సులోచన:—చిత్తము. మాయారాణి యాజ్ఞానుసారము నేనే ఖండించితిని.

అమరనాథుఁడు:—(తనభటులతో) మంచిది. వెంటనే యీదురాత్మురాలగు సులోచన ముక్కు చెవులను గోయుఁడు. ఇది యేమేనియుఁ బలికిన నాలుకయు ఖండింపుఁడు.

ఆజ్ఞయగుటయే తడవుగ నాభటు లాసులోచన ముక్కుఁ జెవులను గోసి యామెకు దుర్దశ గలిగించి కారాగృహమునకుఁ దోడ్కొనిపోయిరి. మాయారాణియు నమరనాథుని యాజ్ఞానుసారము తనగదిలోనికి వెడలిపోయెను. ఇపుఁ డధ్యక్షామరనాథులుమాత్రమచటఁ గలరు. తదనంతర మమరనాథుఁ డధ్యక్షునితో నివ్విధంబున సంభాషింపఁదొడంగెను:—

"నిర్హేతుకముగ మీయెడ జెడుగా వర్తించిన యా పాపాత్మురాలికిఁ దగు దండన యాపరమేశ్వరుఁడు కొంత విశేషరూపంబున నొసంగియున్నాఁడు. పరమధర్మాత్ములును నిర్దోషులును నగు విజయేంద్రముకుందసింహ నరపాలుర కకారణముగఁ గీడొనర్చువార లివ్విధంబుననే కఠినశిక్షకుఁ బాత్రులు గాఁగలరని మీరును తలంపవలెను."

"మీవచనంబులు తథ్యంబులనుట కెట్టిసందేహమును లేదు. కాని..............."

అధ్యక్షుని మాట కడ్డుతగిలి యమరనాథుఁ డావేశపూరితుఁడై కఠోరదృష్టి వానివైపునకుఁ బఱికించుచు, "నేనింతగ మొఱఁగుచుండినను 'కాని' యనుదాని నివాసము మీహృదయసీమనుండి తొలఁగకుండెను. విజయేంద్రసింహుని ధైర్యాదులతోఁ దలపడుట కింకను తలంచుచుంటిరి కాఁబోలు. కానిండు. మీకుఁ దోఁచినటుల ప్రవర్తింపుఁడు. నేనుమాత్రము మీకీవిషయమున నెట్టిసహాయమును జేయఁజాలను. మీరు నన్నొక సమర్థునిగఁ దలంచుచుండినను వారి యెదుట నేనొక గడ్డిపోఁచకైనను సాటిగానని తలంచుచుంటిని. (తన జేబునుండి యొకజాబును వెడలించి, దానిని యధ్యక్షుని వైపునకుఁ జాపి) చూడుఁడు. నేను ప్రాతఃకాలమున నిద్రనుండి లేచుటతోడనే యీజాబొక తాయెత్తువలె నాకంఠసీమ వ్రేలాడుచుండుటఁ గనుఁ

గొని త్రుళ్ళిపడితిని. అహాహా! ఏమహీకాంతునియొద్ద నిట్టి ప్రజ్ఞానిధులగు నైయాయికులు గలరో యట్టివానితో దలపడఁ గోరువాఁడు యవివేకియనియు, దండపాణి కతిథియనియుఁ దలంపవలయునే కాని, వేఱు కాదు.

అధ్యక్షుఁడు కంపితకరంబుతో నాజాబు నమరనాథుని చేతి నుండి తీసికొని చదువనారంభించెను. దానియందు దిగువ నుదహరించిన విధంబున వ్రాయఁబడియుండెను:—

అమరనాథుఁడా! నీవొక గుప్తస్థానమున వాసము సేయుచుండినను, మాదృష్టిపథమునుండి తప్పి కాదు. నీవు కడు సమర్థుఁడవగు నైయాయికుఁడవనియు, బుద్ధిశాలివనియు, వీరపురుషుఁడనియు మేము బాగుగ నెఱింగియుంటిమి. మే మొకరికి నిష్కారణముగ నెట్టిచెఱుపును గలిగించువారము గాము. కారణములేకయే — పిలువకయే — మే మొకరియెదుటకుఁ బోవము. పైకారణములచేత మనకెన్నఁడు సమావేశము గలుగలేదు. నీవొక నిర్దోషివని తలంచుచుంటివేమో! కాదు కాదు. దురాత్ముఁడగు తిలస్మాధ్యక్షుని రోహిణీగడ కారాగృహమునుండి వెడలించి తెచ్చిన గురుతరాపరాధము నీశిరమున లేకపోలేదు. అయినప్పటికి మాలో నెవరికెట్టి దుఃఖము గలిగించకుండుటయే నీబుద్ధివిశేషము. ఈకారణముచేతనే నీవింతదనుక మాచేతి నుండి తప్పియుంటివి. ఐయ్యారగురుకులభూషణుఁడగు శ్రీ అభయసింహుఁడు నీకు సహాధ్యాయుఁడగుటచే విశ్వాసఘాతుకుఁడును—దుర్మార్గుఁడును—నీతిదూరుఁడునగు తిలస్మాధ్యక్షుని చెరనుండి విడిపించిన యపరాధమును క్షమించియున్నాఁడను శుభసమాచారము నీకుఁ దెలుపుచున్నాను. ఆ కుటిలస్వభావుఁడగు తిలస్మాధ్యక్షుఁడు గూడ నీకు సహపాఠకుఁడై యుండినను సత్పథగామియు, సత్యవ్రతుఁడును నగు నభయసింహునకుఁ గొలఁది గొప్ప తోడ్పడుట నీ కుచితకా

ర్యము. మంచిది! ప్రమాదవశంబున నేఁడియో జరిగినది. కాని, నేఁటి నుండి మాయారాణికిగాని, తిలస్మాధ్యక్షునకుగాని మాపగతు రెవ్వరికైనగాని తోడ్పడరాదు. వారి ననుసరింపరాదు. పక్షము వహింపరాదు. మా చెఱనుండి యొకరిని విడిపించుటకుఁ బ్రయత్నింపరాదు. మఱియు సమ్మతి నొసంగరాదనియు నిన్ను హెచ్చరించుచుంటిని. ఇందుకు వ్యతిరేకముగ సంచరించువో కుమారీగడ తక్షణమునందు శృంఖలాబద్ధుఁడవై యుంటఁ గనుఁగొనగలవు. మఱియు నింతియే గాక నెంతటి దుర్దశయేనియు గలిగించినను గలిగించగలము. నీవీ ప్రపంచమందు సత్ప్రవర్తనమును, యోగ్యతయుఁ గలిగియుండిన భగవంతుఁడు మే లొనఁగూర్పఁ గలఁడు. మేమార్జవయుక్తులకును, సత్పురుషులకును తోడ్పడ నిరంతరము గటిబద్ధులమయి యుందుము. మఱియొకమాట గలదు! దానిని గూడ నాలింపుము. మాసొత్తై యుండిన తిలస్మకైజారులు రెండు మాయారాణి సులోచనలకుఁ జేజిక్కియున్నవి. ఇపు డధ్యక్షుని వెంటఁదోడ్కొని మాయారాణి నీసహాయ మర్థించుటకు నీయింట వచ్చియున్నది. కావున నీవామెతో నేమియుఁ జెప్పవలదు. ఆమెయొద్దనుండిన మాకైజారు మేము తీసికొనగలము. ఆవిషయమున మా కెట్టిచింతయు లేదు. కాని, సులోచనయొద్ద నుండెడి కైజారు నుంగరలాలను పేరుతో నామెను బంధించుకొనిపోయిన వానివద్ద గలదు. ఆకైజారు తప్పక నీకుఁ దెలిసియుండును. కావున నాకైజారు మా యధీనపఱచుట నీకుచితము. రేపటిదినము సరిగా రెండుజాముల వేళ నీమందిరములోనికిఁ బోవు సింహాద్వారమనఁదగు పర్వతగుహా ముఖద్వారమున నిన్ను గలసికొనుటకు సంసిద్ధముగ నుందును. ఆసమయంబున నాతిలస్మకైజారు మాకు సమర్పించనియెడల నీవు మాయారాణీతిలస్మాధ్యక్షు

లకుఁ దోడ్పడ సంసిద్ధముగ నుంటివని తలంపఁబడును. తరువాత నేమి సంభవింపఁగలదో నీవు స్వయముగఁ దెలిసికొనఁగలవు.

ఇట్లు నిన్ను హెచ్చరించు
ఐయ్యారబాలకుఁడు,
రణతేంద్రసింహుఁడు.

జాబును చదివి తిలస్మాధ్యక్షుఁడమరనాథుని చేతికందిచ్చెను. అధ్యక్షుని మోమానసమయంబున భయచింతా నిరాశాకారణం బుల వైవర్ణ్యమునొంది యుండెను. మఱియు భవిష్యమును దలంచి యతఁడు మృతప్రాయుఁడయ్యెను. రణతేంద్రసింహుని జాబునందుఁ దిలస్మకైజారువృత్తాంతము గలదు. తత్కారణమున నధ్యక్షుఁ డమరనాథుని వ్రేలివైపునకు దృష్టిఁ బర్వెత్తించి తిలస్మకైజారునకు జంటవస్తువగు నుంగరము వానివ్రేలియం దుండుటఁ గనుఁగొనెను. మఱియు రణతేంద్రసింహునకు సకలవృత్తాంతములు కరతలామలకములనియు, వానికిఁ దెలియని విషయమే కలుగదనియు నతఁడు నిశ్చయించుకొనెను. ఇఁక సమరసింహుఁడు తనకుఁ దోడ్పడుననను నాశ పూర్తిగా నడుగంటిపోయెను. మఱియు తన భవితవ్యము చెడుగా వానికిఁ దోఁపసాగెను. అధ్యక్షుఁ డాలోచనాపరంపరలఁ జిక్కి శిరమువంచి చాలసేపటివఱకుఁ గూర్చుండియుండెను. మఱియు సమరనాథుఁడు వాని ముఖభావములను కడుశ్రద్ధ గమనించుచుండెను. తుద కమరనాథుఁ డధ్యక్షునితో, "మీ రీజాబునందలి ప్రత్యక్షరమును బాగుగ పర్యాలోచించి యుందురనియు దీనియందలి సంగతులన్నియుఁ బూర్తిగా గ్రహించియుందురనియుఁ దలంచెద"ననెను.

"చిత్తము."

"నేనిపుడు మీతో యింతమాత్రము చెప్పవలసియున్నది. ఈసమయంబున మీకు మాఱుగ నితరు లెవ్వరేనియు నాసమక్ష

మం దుండిన వానిని తక్షణ మిచటినుండి వెడలఁద్రోలియుందును. కాని, ఏమిసేయుదును? మీరు నాసహాధ్యాయులరు. మంచిది. మీకు మూఁడుదినముల గడు వొసఁగుచుంటిని. ఈగడువు కాలమంతయు నిచటనుండి మంచిచెడ్డలను బాగుగ విచారించుకొనుఁడు. మఱియు నిప్పటికైనను మీనడువడికను మార్చుకొనిన, మీహృదయసీమ నుండి ధర్మపరాయణులగు విజయేంద్ర ముకుందసింహ నరపాలుర పైఁగల ద్వేషబుద్ధిని తొలఁగించుకొనిన వారిని ప్రార్థించి మిమ్ము క్షమింపఁజేయుటకుఁ బ్రయత్నించెదను. కానిచో, విజయేంద్రసింహ నరపాలుని విపక్షమున నావలన సహాయమును బడయు నాశ తిల మాత్రమైన నుంచుకొనరాదు.

"రజితేంద్రసింహుఁడు వ్రాసిన విధంబున మీరతనిని గలసి కొని తిలస్నైజారు వానియధీన మొనరింతురా?"

"ఏమి! మీ కావిషయమున నింకను సందేహము గలదా?"

అధ్యక్షుఁడు మరల వాని నేమియుఁ బ్రశ్నింపక నచటి నుండి లేచి తనగదిలోనికి వెడలిపోయెను. అధ్యక్షామరనాథు లిరువురు నేమి సంభాషించుచుండిరో దానిని దెలిసికొను తలంపున మాయారాణి నుద్విగ్నచిత్తంబుతోఁ దొలుతనుండియు నధ్యక్షుని గదియందుఁ వేచియుండెను. అధ్యక్షుఁ డరుదెంచి యొక దీర్ఘనిశ్వాసను విడచి కూర్చుండిన పిదప వానితో మాయారాణి యివ్విధంబున సంభాషింపఁదొడంగెను:—

"సమాచారమేమి? ఆదుర్మార్గురాలగు సులోచన తగుప్రాయశ్చిత్తమును బడసియున్నది."

"నిక్కవము. కాని, యింతమాత్రముననే మన కమరనాథుఁడు తోడ్పడునని తలంపరాదు."

"(త్రుళ్ళిపడి) ఏమి? అతఁడు తనయభిప్రాయ మేమైనను సూచించియుండెనా?"

"సూచించుటయేమి? స్పష్టరూపముననే తెలిపియున్నాఁడు."

"ఛీ. అతఁడు మిక్కిలి భీరుస్వభావుఁడు. మంచిది. మీరా యిరువురకు జరిగిన సంభాషణ మెట్టిదో వివరింపుఁడు!"

అధ్యక్షుఁ డమరనాథునకును దనకును జరిగిన సంభాషణమంతయుఁ బూసఁగ్రుచ్చినటుల మాయారాణికి వివరించి తెలిపెను. తదనంతరము రజితేంద్రసింహుని జాబువృత్తాంతమును నామెకు వినిపించెను.

మాయారాణి (దీర్ఘనిశ్వాసమును బరిత్యజించి తనలో అకటా! అమరనాథుని మాటలలోఁ జిక్కియితఁడు నా వెంట వీడఁడు గదా! యని యోజించుచు) అమరనాథుఁడు నిష్ప్రయోజకుఁడయ్యె ను. అట్టి పిఱికిపంద మీసపుపాతకుఁడని వినుటకు సిగ్గగుచున్నది. ఇంటఁ గూర్చుండి ముప్పొద్దులు కడుపారఁ దినవలెనయు, హాయిగ నిద్రించుటయు నితఁ డెరుంగును గాని, ప్రయత్న మనుదానియం దెంతటి ప్రభావముగలదో కొంచెమైన నెఱుంగఁడు. అట్టి శక్తి తుఁ డీప్రపంచమం దేమి పేరుప్రఖ్యాతులను గడింపఁగలఁడు? మన మెట్టి కుటిల సమయమందైనను భాగ్యమును నమ్మి కూర్చుండు వారము గాము. ప్రయత్నమే నిరుపేదను చక్రవర్తిగ నొనరింపఁ గలదు. తొలుత నే నెవతెనో, నాప్రయత్నములు నన్నెంత మహా దశకు గొనితెచ్చెనో మీరే దీర్ఘముగ యోజించిచూడుఁడు! దైవ దుర్విపాకంబున పగతురు బలవత్తరులయినను నుద్యోగమునకు జలాంజలి యొసంగి కూర్చుండుట సమంజసమా! కాదు కాదు! ఎన్న టికిని గాదు. అమరనాథుఁ డెంత భయశీలుఁడును ధైర్యహీనుఁడును నైననేమి? నేనుమాత్రము ధైర్యము విడుచుదానను గాను. మీ ప్రభావమును సామాన్యమైనదిగాదు. నే నేమికావించెదనో చూచె దరుకదా! ఈప్రపంచమంతయుఁ దలక్రిందులుగఁ జేసెదను. చిటికెన

ప్రేరితయై నృత్యమాడించెను. మీరు మాత్రి సమరనాథునియందలి యాశను వీడుఁడు. తీరునాముం గని మన యిచటినుండి వెడలి పోవుటయే శ్రేయోదాయకము.

అహా! ఈప్రపంచమునందు సత్సాంగత్యప్రభావము మిక్కిలి స్వల్పముగఁ జూపట్టుచున్నదిగదా! దుష్టసహవాసమువలన గలిగెడు దుర్బోధనలు మనుజుని శీఘ్రముగఁ దనవశమందుఁ జిక్కించుకొని సర్వనాశన మొనరించుచున్నది. కాని, యెవరియందు సూక్ష్మబుద్ధియు, విమర్శనాశక్తియు, దీర్ఘాలోచనపటిమయుఁ గలిగియుండెనో యట్టివారి సిగపూవైనను నది గదల్పఁజాలదు. ఈప్రకరణమం దా ద్వివిధ విషయములు గలిగియుండుటఁ గని మాపాఠకమహాశయు లాశ్చర్యము నొందఁ బనిలేదు. మఱునటిదిన సమరనాథుఁడు దన యింట నాయతిథు లిరువురుఁ జూపట్టకుండుటచే వారిజాడ నరసి యరసి తుదకు వారిరువురు నచటినుండి తప్పించుకొని పారిపోయిరని నిశ్చయించుకొనెను.

౧౯.

ప్రచండ మధ్యాహ్నసమయంపు దారుణాసహ్యాతపముచే వ్యాకులచిత్తులయి కొంతవడి విశ్రమించు తలంపుతో నిరువురు వ్యక్తులిరుపార్శ్వంబుల సఘనవృక్షజాలంబుల నొప్పుచుండిన యొక నదీతీరంబునఁ గూర్చుండి నెమ్మది నెమ్మదిగా సంభాషించుచుండిరి. వారిలో నొకఁడు ముక్కిడియగు వృద్ధతిలస్మాధ్యక్షుఁడు. రెండవవ్యక్తి-తా నథోగతికి వచ్చియుండినను నిసుమంతయుఁ జలింపక భాగ్యదేవత నెదుర్కొని పోర నడుకట్టుచుండిన యవివేకురాలగు మాయారాణి. ఆయిరువురు సమరనాథుని గృహమునుండి యెవరితో నేమియుఁ బలుకక పారిపోయి యిచటకు వచ్చిచేరిరి. మఱియు గొప్ప గొప్ప మనోరథములను మూటలుగట్టుచు సమరనాథునిగూడ నేవి

వుననైనను విధ్వంసము గావింప యోచించుచుండిరి. ఒక కార్యమం దొక దుష్టుఁ డొక సత్పురుషుని సహాయము నర్థించుటయు నతఁ డా కార్యమందలి చెడుఫలితమును దలంచి వానిప్రార్థనము నిరాకరించుటయుఁ దటస్థించిన నతఁ డాసత్పురుషునిపైఁ బగఁబూని యుండుట దుష్టజనస్వాభావికము. మఱియు నతఁ డాయిష్ట్య వన మనంబున దాఁచియుంచి తరుణముంగని వాని కపకార మొనర్చుటయు నీతిదూరుని కార్యము.

మాయారాణి యధ్యక్షుని దెసఁ బరికించి, "నన్నుఁ గొంత స్తిమితముఁ బొందనిండు. అమరనాథునకుఁ గూడ నాప్రభావ మొకించుక చవిచూపక మాన"ననెను. అంతఁ దిలస్మాధ్యక్షుఁ డామెతో నిట్లనెను:—

"నాకును వానిపై విశేషాగ్రహము కలదు. చూడుము! ఆయయోగ్యుఁ డిట్టి సన్నిహితమైన సమయంబున మనకుఁ దోడ్పడక నిరాకరించియున్నాఁడు. మంచిది! మన మిపుడు విజయేంద్రసింహున కెవ్వరెవ్వరు సంగతులో మఱియు వారలు మనకు వశవర్తులగు టెట్లో మొదట యోచింపవలసియున్నది."

"నిక్కువము. బాగుగ యోచించితిరి. అవ్యర్థంబున మనల ననుసరించు వారి నామములను, వారి నివాసస్థానములను వక్కాణింపుఁడు!"

"(కొంచెము యోచించి) ఒకటి:-విక్రమసింహాసనపాలుఁడు, వాని యనుంగుపుత్రుఁడు భీమప్రతాపసింహుఁడు. వారియనుచరులు, రెండు:-వసంతసేన. మూఁడు:-సృష్టినారాయణసింహుఁడు—వాని తనయుఁడు ప్రతాపనారాయణసింహుఁడు. నాల్గు * సురుస్సా జనకుఁడగు బహాదరల్లిఖానుఁడు."

* ఈమె యిపుడు విజయేంద్రసింహుని కారాగృహమునకుఁ బంధింపఁబడి యున్నది.

"నిక్కవము. వారలెల్లరు మనల ననుసరించిన విజయేంద్ర సింహుని, వాని పక్షపాతులను నిస్సందేహముగఁ ద్రుటికాలములోఁ దుదముట్టింపఁగలము. మఱియు వారలెల్లరు సంతోషపూర్వకంబుగ మనలను వెంబడింతురనియే నాయభిప్రాయము. కాని, బాహాదరల్లీ ఖానుదక్క తక్కినవారందరు కారాగృహబద్ధులయి యుంట మిక్కిలి విచారకరము. మఱచితిని! విక్రమసింహనరపాలు నెవరు బంధించి యుంచిరి. అతఁడిపు డెచటఁగలఁడు?

"జటాశంకరుఁడు 'సుజా' వేషమును దాల్చికొని విక్రమసింహుని వంచించియున్నాఁడు. మఱియు నతఁడిపుడు మృగాంకవతికి యధీనమందుఁగల తిలస్మసరోవరమందిరమున బంధింపఁబడియుండెను. మోహినీవసంతసేనలును నామందిరమందే చెఱఁబెట్టఁబడి యుండిరి."

"కటకటా! ఇపు డీదుర్దినంబులలో నాయొద్ద పేరున కొక్క మైయారుఁడైనను లేఁడుగదా! వారిని విడిపించి తెచ్చువారెవ్వరు?"

"(ఆకస్మికము నేమియో జ్ఞప్తికి వచ్చుటచేఁ త్రుళ్ళిపడి) ఔను. అదుగ మఱచితిని! నీమైయారులగు కాంచనగదాధరసింహులిపు డెచటగలరు? నీకిపుడు గలిగియుండిన విపద్వృత్తాంతము వారికిఁ దెలియకుండెనని తోఁచుచున్నది. కాదు కాదు. జమేలియాలో నింతటి యుత్పాతములు పుట్టుటయు, నీవు రాజ్యమును వీడి పారి వచ్చుటయు నొక సామాన్యవిషయముగాదుకదా? తప్పక వారి కానమాచారము దెలిసియుండును. కాని, వారు నీచెంతకు రాకుండుట కేదియో యొక గురుతరహేతువు గలిగియుండవలెను."

ఇపుఁ డధ్యక్షుని వచనంబుల కేమి ప్రత్యుత్తరం బిడవలెనను యోజనయందు మాయారాణి చిక్కుకొనెను. ఆమె తనకుఁ గలిగి

ళ యిక్కట్టులన్నియుఁ దిలసాధ్యత్తునితోఁ జెప్పియుండెను కాని, తా నామైయూరు లిరువురను మనముప్పించియుండిన సమాచారము నుమాత్రము దెలుపక దాఁచియుంచెను. ఇపు డావృత్తాంత మధ్యత్తునకు వెల్లడించిన వానికిఁ దనపై ననివార్యంబగు క్రోధము జనింపక మానదని యామె నిశ్చయించుకొనెను. ఐమాయలను బరిమార్చుట మిక్కిలి గర్హ్యంబగు కార్యము. అందుపైఁ దన కొలువునందలి నామైయూరులను నిష్కారణముగ మడియించిన నీఁక నేమనవలెను! మాయారాణి శిరముపంచి యివ్విధంబున యోజింపఁదొడంగెను:- "ఇపు డారహస్యమును దాఁచియుంచి యేదియో కల్పించి తెలుపుటవలన నిసుమంతయుఁ బ్రయోజనములేదు. తుద కావృత్తాంతము వెల్లడిగాక మానదు. తరళ కీవృత్తాంతమంతయుఁ దెలిసియేయున్నది. అనుర్మాగ్గురా లిపుడు నన్ను విడచి యుండుటచే నీరహస్యమును వెల్లడింపక మానదు. అందరివలెనే యీ సాధుపుంగవునకుఁ గూడ నారహస్యము తెలియుఁగలదు. (కొంచెము యోజించి) కానిమ్ము. ఏమయినను గానిమ్ము. నేనీరహస్య మింకను దాఁచియే యుంచెదను. తరువాతఁ జూచెదనుగాక."

మాయారాణి శిరముపంచి పైసంగతు లన్నింటిని యోజించుచుండెను. ఇంట నధ్యత్తుఁడు మిక్కిలి యక్కజపడుచు, "ఏమి! మాయారాణి నాప్రశ్నమునకు బదులుపలుకక నేమియో యోజించుచున్న"దని తలంచి యామెతో, "నామాటలకుఁ బ్రత్యుత్తరం బిడక నేమి యోచించుచుంటి"వనెను.

"నామైయూరు లిట్టి కుటిలసమయంబున నన్నేల విడిచిపోయిరో యెచటి కేగియుండిరో దానిని నేను స్వయముగ నెరుంగ కుండుగచే మీ కేమని బదులు చెప్పుదునాయని యాలోచించుచుంటిని."

"ఆమైయూరు లిరువురు తమంతట దాము వెడలిపోయినటుల్ల నీకుఁ దోఁచుచున్నదా?"

"తప్పక! అటులనే వచియింపవలసియున్నది. కాని, మన మిప్పు డిట్టి మాటలయందుఁ బొద్దుపుచ్చక నెచటికి కేగవలెనో, యేమి సేయవలెనో శీఘ్రముగ యోజించుట మంచిది."

"మన మిప్పుడు బహదరల్లీఖాను నొద్దకుఁ బోయి వానిసహాయమును గోరుట సమంజసముగఁ దోఁచుచున్నది. అతఁడు మిక్కిలి పరాక్రమశాలియగు యోధుఁడని యెల్లరు నెఱింగియుండిన విషయమే! కాని, వానియొద్ద ధనముమాత్రము లేదు."

"మంచిది. నే నెపుడు వానిగృహమంతయు ధనముతో నింపివేయుదునో, యప్పు డతఁడు చాల సంతోషింపఁగలఁడు. మఱియు నొక గొప్ప సిబ్బందిని సమకూర్చుకొని మనకుఁ దోడ్పడఁగలఁడు. ఇట్టి విపన్నావస్థయందుఁ గూడ నాకు ధనాభావము లేదని మీతో వచియించుచుంటిని."

"ఔను. నాకును జ్ఞప్తిగలదు. నీసంకేతము శివగడమును గూర్చి యైయుండును. మంచిది. ఇఁక నాలసింపఁ బనిలేదు. (త్రుళ్లిపడి చేతితోఁ జూపుచు) ఇదియేమిటి? మనయెదుటి పొదనుండి వెడలి యీాదెస కేతెంచుచుండిన యామనుజుఁ డెవ్వరు? విక్రమసింహుఁడు గాడుగదా? (కొంచెము నిదానించిచూచి) అతఁడు తప్పక విక్రమసింహుఁడే! అటుచూడుము! ఆతఁ డొక్కఁడేగాఁడు. ఇంకను గొందఱు మనుష్యు లాపొదనుండి వెడలివచ్చుచున్నారు!"

మాయారాణి సంభ్రమాందోళితచిత్తంబుతో నావైపునకుఁ జూచి నవ్వుచు లేచి నిలచెను.



## ౨౦.

ఏస్థానంబున భయసంభ్రమాందోళితచిత్తయై తల్లడిల్లుచుండిన నిస్సహాయయగు నీరదను విడచివచ్చితిమో యాస్థానమగు మృగాంకవతీసరోవరతిలన్నమందిరమువైపునకు మాపాఠకమహాశయుల నిపుడు మరలఁ దోడ్కొని పోవుచుంటిమి.

ఆమందిర సౌధోపరిభాగమందలి పుత్తళి యతివేగంబుతో నర్తనము గావించుచుండుటఁ బరికించి నీరద భీతచేతస్కయై మృగాంకవతిని తలపోయుచుండెనని మే మొక ప్రకరణమందు లిఖించియుంటిమి. నీరద కాతిలన్నమందిర రహస్యములు సంపూర్ణముగఁ దెలియకుండుటయే యామె సంభ్రమమునకుఁ గారణము. ఆమందిరమున కెట్టియనర్థమేయు సంభవింపనున్నతఱి నాసౌధోపరిభాగమందలి ప్రతిమ యతివేగంబుగఁ దిరుగ నారంభించుననియు, నట్టిసమయంబున నామందిరమందు నివసించువారిని క్షేమము గాదనియుఁ బ్రసంగధోరణియం దొకనాఁడు మృగాంకవతివలన నీరద వినియుండెను. తత్కారణంబుననే నీరద భయసంభ్రమాయత్తచిత్తయై యిటునటుఁ బరికింపసాగెను. ఆమె కొండవియుండిన తోట్రుపాటును గనుఁగొని, "యభాగ్య మింకను తమ్ము వీడిపోకుండెననియు, నిచటఁ గూడ నెట్టి దారుణవిపత్తియో తమశిరముపైకి రానుండెననియుఁ" దలంచి చంద్రకళామదాలస లుద్విగ్నచిత్తలగుచుండిరి.

నీరద యవ్విధంబున నలుదెసలఁ బరికించుచుండ నాకస్మికముగ నామెదృష్టి తూర్పుదెసఁ జాలదూరమువఱకు వ్యాపించియుండిన మైదానమువైపునకుఁ బ్రసరించుటచే నచటి కొక యరక్రోసు దవ్వుననుండి వందలకొలఁది మనుజు లతిరయంబున దమమందిరము వైపునకు వెడలివచ్చుచుండుట కనుఁగొనెను. దానితోపాటామె తీక్ష్ణదృష్టి ఆయాగంతులు దాదాపు నాలుగువందలవఱకు నుందుర

నియు, వారలు రణవిద్యావిశారదులగు సైనికులుగాని, దారులు కొట్టి ధనమును గొల్లఁగొను బందిపోటుదొంగల గుంపుగాని, కావలెననియు, వారలు క్రూరభావంబుతోఁ దమ మందిరమును ముట్టడించి తమకెద్దియో హాని గలిగింపఁ గోరుచుండిరనియు జాడతీసెను. తదనంతరము దమకు దేనివలనఁగల సంపూర్ణవిశ్వాసముతో నామందిరమందు నిశ్చింత నివసించుచుండిరో, మఱియు దేనియందు నీదులాడుచుఁ బగతురు తమకెంతకును రాఁజాలరని నమ్మియుండిరో, యాసరోవరముపై నామె దృష్టిబడెను. కాని, పశ్చాత్తాపకరము. ఆసమయంబున నాసరోవరవృష్ఠియు మాఱియుండెను. దానియందలి జలమతి వేగంబుతోఁ దఱిగిపోవుచుండుటచేఁ బగతులకు జొరశక్యము గానటుల దానియందుఁ బఱచియుంచిన యుక్కుచిక్కములు ముండ్లతీగెలు మున్నగునవి పైకిఁ దేలి స్పష్టరూపంబునఁ జూపట్టుచుండెను.

నీరద యావిపరీత పరిస్థితిఁ దిలకించి మొదటఁ దొట్రుపడెను. కాని, వెంటనే తనమనస్సునకుఁ గొంత ధైర్యమును దెచ్చుకొని రాఁగల విపత్తునుండి చంద్రికశ్యామదాలసలను గాపాడవలెనని నిశ్చయించుకొనెను. మఱియు నామె యాయబల లిరువురి వైపునకుఁ బరికించి, "సోదరీమణులారా! మనమిప్పు డొకానొక గురుతరవిపత్తియందుఁ జిక్కుకొంటిమని నే నెఱింగితిని. (దవ్వుననుండి మందిరము వైపున కేతెంచుచుండిన యా జనసమూహము వైపునకుఁ జేయి చాపి చూపుచు) వారలు మనకుఁ బగతులవలెఁ దోఁచుచున్నారు. ఇచటి కేతెంచి మనలను బంధించుకొని పోవుటకుఁ దలంచుచుండినటులను దోఁచుచున్నది. ఈసరోవర జలమునం దీదులాడుచుగాని, నావపై నెక్కిగాని మనచెంత కెవ్వరును రాఁజాలరని నా సంపూర్ణ విశ్వాసము. కారణంబేమన, నెవ్వరేనియు నీటఁదిగి యీమందిరమునకుఁ జేరదలంచిన దీనియందు వ్యాపించియుండిన యుక్కుచిక్క-

ములు మున్నగువానిలోఁ జిక్కుకొని ప్రాణములను గోల్పోవక మానరు. కాని, యిపు డాపిషయమంతియు మాఱియున్నది. ఈ కాసారమందలి జల మెంత వేగముగఁ దఱిగిపోవుచున్నదో పరికింపుఁడు. జలమంతియుఁ గొఱఁతపడినపిదపఁ బగతురు దీనియందలి యుక్కుచిక్కుములు మున్నగువానిని ఖండించి యథేచ్ఛగ నీమందిరమును జేరఁగలరు. మనవిరోధు లెచటినుండియో యొకసారంగమును ద్రవ్వి దీనియందలి జలము వెడలించుటకుఁ దగు నేర్పాటులను మొదటనే కావించి యుండినటులఁ దోఁచుచున్నది. మఱియు వారలు నిస్సందేహముగఁ దమపనియందు కృతకార్యులయ్యిరనియే చెప్పనొప్పును. (కొంచెము యోజించి) అయ్యో! మనమిపుడు విపదాంబుధి మునింగియుంటిమి. తెరవెయ్యది. (ఆకసమువంకఁ బరికించి) తల్లీ! జగజ్జననీ! అబలలమగు మమ్ము రక్షించుటకు నీవుదక్క యన్యులెవ్వరును సమర్థులు గారు. మఱియు నీశరణాగతులను దుఃఖపెట్టువారును నీజగతిఁ గానరారు. తల్లీ! నేను పదరాని యిక్కట్టులఁ గుడిచియు నీయందలి గాఢవిశ్వాసముఁ బోడనేకదా, నేఁటిదనుక మేనున ప్రాణములను దాల్చియుంటిని. నదమలభక్తి నీపాదపంకేరుహంబులను ధ్యానించుచు బ్రతికియుంట వ్యర్థము గాలేదని యెఱింగి ప్రసన్నచిత్తురాలనై యుంటిని. కాని, యిపుడిట్టి విపరీతావస్థ నేల కల్పించితివి? జననీ! నాకు నీపైఁగల విశ్వాసము డిందుపడెననియా, భక్తి తగ్గెననియా? కాదు కాదు. దీనియందుఁగూడ నీమాయ యొకింత గలదు. నీమహిమ దెలియ నెవరితరము!''

ఇవ్విధంబున నీరద భగవతిని ప్రార్థించుచు నేత్రములను మూసికొనెను. అంత నాకస్మికముగ నామె యదిరిపడి చంద్రకళామదాలసలవైపునకుఁ బరికించి, "ఆజగదాంబ మనలను నిస్సందేహముగ గాపాడఁగలదు. మనము నిరాశాచిత్తులము గాఁగూడదు.

ఆమె కృపావిశేషంబున మనమిపు డొనరింపవలసిన కార్య మెట్టిదో నామనస్సునకుఁ దట్టియున్నది. దేవి యనుగ్రహమున నే యీనమ యంబున నా పరిజను లొకరిద్దరుదక్క తక్కినవారందరు నీమందిర మునం దే కలరు. మంచిది. నేనిపు డేమిచేయింతునో పరికించుచుండుఁ డని పలికి నీరద యాసౌధోపరిభాగమునుండి చరచర క్రిందికి దిగి పోయెను.

ఆమందిర మొక విచిత్రరీతిని నిర్మింపఁబడి యుండుటయుఁ జేత విల్లునుధరించి యమ్ము నెక్కుపెట్టి విడుచుటకు సంసిద్ధముగఁ జూపట్టుచుండిన విగ్రహము లామందిరమునకు నలువైపులఁగల వసారాలయందుండుటయు మాపాఠకమహాశయులు విస్మృతిఁ జెంది యుండరు. నిస్సహాయయగు నీరద యటు లా సౌధోపరిభాగమునుండి క్రిందికి దిగివచ్చి యావిగ్రహములలో నొకదానిచెంతకుఁ బోయి దానిశిరమును బట్టుకొని వెంటనే వెనుకవైపునకు వంచెను. అదియు నామె కెట్టి పరిశ్రమను దోపనీయక నావైపునకు వంగి తుదకు భూమితో నానుకొనెను. అంత నొకవిధంబగు శబ్దముతో నాసరోవ రజలము సంక్షుభితము గాఁదొడంగెను. నీరద వర్షిసన్న చిత్తయై వెను కవైపునకు మరలి గాంచునంత నామెదృష్టి చంద్రికళామదాలసల పైఁ బడెను. నీరద వెనువెంట వారలును సౌధోపరిభాగమునుండి దిగివచ్చి యామెవెనుక నిలచి యామె కావించుచుండిన కార్యాచరణములన్నింటిని పరికించుచుండిరి. ఆయిరువురివెనుక నామందిర మందుఁగల పరిజనులును వచ్చి నిలచిరి. నీరద చంద్రికళామదాలసలవైపునకు సహాస్యవదనంబుతోఁ బరికించుచు, "నెచ్చెలురాలా! మన కిపు డెట్టిభీతియుఁ గలుగదు. ఆపగతులు మనచెంతకు రాఁజాల"రనెను.

చంద్రికళ:—సఖీ! నీవిచట నేమిచేయుచుంటివో మే మెంతయు గ్రహింపఁజాలకుంటిమి. ఈవిగ్రహమును వెనుకకు వంచుట వలని ప్రయోజనమేమి? ఈసరోవరజలము లిట్టివిధంబున సంక్షోభము గలుగుటకుఁ గారణంబేమి?

నీరద:—సఖులు తెప్ప దేయుపాయాంతరముచేతనైన నీసరోవర మందలి జలము నింకింపఁజేసి యీమందిరమునొద్దకు రాఁద లంచుచో నీవిగ్రహములు నాల్గును నిట్టివిధంబుననే యుప యోగింపఁబడును. ఈమందిరప్రాంగణమునకు గోళాకారముగ నిర్మింపఁబడియున్నది. దానియం దొండొంటితోఁ గలసి నాలుగుచక్రములు గలవు. వ్రేలి కుంగరము చుట్టుకొని యుండునటు లాచక్రము లీమందిరమును జుట్టుకొనియున్నవి. వాటియంచులు క్రిందిమీఁదులకుఁ బెఱిగి కత్తులవలె వాడి యై యేడుమూరలకంటె నెక్కుడు [illegible] గలిగి యున్నవి. మఱియు నాచక్రము[illegible] మందిరమునకు నలువై పుల నొక మూరెడు[illegible] నా[illegible] జొచ్చియు న్నవి. ఎవ్వఁడై[illegible] ములలో దేనిని వెనుకకు నెవ్వ [illegible] భాగముతో జేర్చినచో నాచక్రము మతివే గంబుగ [illegible] నారంభించును. అట్టివిధంబుననే రెండవ విగ్రహ[illegible] రెండవచక్రమును మూఁడవవిగ్రహ మును వంచిన మూఁడవచక్రమును నాల్గవదానిని వంచిన నాల్గవచక్రమును నతివేగంబుతో దిరుగ నారంభించును. అట్టితిరుగుటంబున నీమందిరముచెంత కేతెంచుట కెంతటి వారికిని సాధ్యముగాదు. ఒకవేళ నెవ్వఁడేనియు సాహసించి డగ్గఱించినను వాఁడు తుత్తునియలుగాక మానఁడు. నే నిపు డీవిగ్రహమును వంచిన కారణంబుననే దీనికి సంబంధించి

యుండిన చక్రి మతివేగముతోఁ దిరుగుచున్నది. మఱియు దాని గమనాతిశయముచేతనే యీ తటాకజలమం దిట్టి సంక్షోభము జనించుచున్నది. నాకీరహస్యము మొదట దెలియదు. కాని, ఒకనాఁడు మృగాంకవతి నాకీరహస్యమును దెలిపి యావిధమంతయుఁ జూపియున్నది. ఈసరోవరమందలి జలమెంతతీవ్రముగ తఱిగిపోవుచున్నదో మీరు చూచుచుండిరి. కావున నే నావిషయమున విశేషముగఁ జెప్ప నగత్యము లేదు. ఇఁక నొకమూరెడు జలము తగ్గిపోవుటతోడనే యీ చక్రములెట్టివో, యవి యెంతవేగముగఁ దిరుగుచున్నవో మీరు స్వయముగ గనుఁగొనఁగలరు.

చంద్రకళ:—(ఆశ్చర్యములో) ఆహా! ఈమందిర సంరక్షణార్థమై యెట్టియుక్తిని యోజించియుండిరో చూడుఁడు!

నీరద:—ఈచక్రములేగాక యీమందిరసంరక్షణార్థ మింకను గొన్ని సాధనములు గలవు. కాని, వాటి రహస్యములు నాకుఁ దెలియవు.

చంద్రకళ యాచక్రి గమనవేగంబుచే జనించుచుండిన సంక్షోభమును యాజలమందుఁ బుట్టుచుండిన చిన్నచిన్న యలలు తీరముతో గెరలుచుండుటయు వింతగ నవలోకించుచుండెను. ఆసరోవరజలము స్ఫటికమువలెఁ దెల్లనై నిర్మలముగ నుండుటచే మెఱయుచుండిన కొన్నిపదార్థము లాజలమందుఁ జూపట్టఁదొడంగెను. క్రమముగ దానియందలి జలము దఱుగుచుండినకొలఁది యామందిరము నకు నలుదెసలఁ జుట్టియుండిన చక్రము లతివేగంబుగఁ దిరుగుచుఁ గొలఁదిగ బయల్పడెను. చంద్రకళ సాశ్చర్యదృష్టి నీరదవైపునకుఁ బరికించి, "సఖీ! నీవు వచియించియుండిన మాట యథార్థము. ఈచక్రముల యెదుట నొకయినుపవిగ్రహము నునిచినను నది వేయి ఖండములుగాక మానదు. ఇఁక మానవమాత్రుని యెన్నిక యేమి

టే!" యని పలికి యాచక్రముల వైపున కనిమేషలోచనంబులఁ బరికింపసాగెను. అంత నొక్క గొప్ప కోలాహలము శ్రుతిగోచరంబగుటచే వైరిజనులు మిక్కిలి దాపునకు వచ్చి చేరిరని గ్రహించి నీరద చంద్రకళామదాలసలతో, "నెచ్చెలులారా! పగతురు సమీపించుచున్నారు. జాగు సేయక మన మూఁడువిగ్రహములను వెనుకవైపునకు వంచి భూమితోఁ జేర్పవలెను. నేనొక పుత్తళిని వంచెదను. మీరిరువురుఁ బక్కన విగ్రహములు రెంటిని చెరియొకటిగ వంచి భూమితోఁ జేర్పుఁడు. పిదప నాకృపామయుండగు పరాత్పరుఁడే కలఁడని" పలికెను.

ఆవిగ్రహములను వంచుట కెంతకాలము పట్టును? వెంటనే వార లావిగ్రహములు మూఁటిని వంచి భూమితోఁ జేర్చిరి. తదనంతరము నీరద చంద్రకళామదాలసలను వెంటఁదోడ్కొని సౌధోపరి భాగమునకు వెడల సంసిద్ధయై మూఁడువిల్లులను కొన్ని యమ్ములను దీసికొనెను.

ఆవిగ్రహములు నాల్గింటిని వంచుటచే నాసరోవరజలమందు గొప్ప కల్లోలము జనించెను. కవ్వముతోఁ జిలుకుచుండినటుల దాని యందుఁ బుడగలును నురుఁగయుఁ బుట్టుచుండెను.

నీరద దనయింటఁగల పరిచారికలకును సేవకులకును నేమియో బోధించి చంద్రకళామదాలసలను వెంటఁదోడ్కొని యామందిర సౌధోపరిభాగమునకుఁ జనెను. మఱియుఁ బగతురదెస బరికించి, వారలు తాను తలంచినటుల నాలుగువందలమందిమాత్రమే యుందురని నిశ్చయించుకొనెను. కల్లోలముగ నుండిన యాసరోవర జలమునుండి యొకచక్రము బయల్పడి స్పష్టరూపంబునఁ జూపట్టుచుండుటచే దానివైపున నాశ్చర్యభావంబుతోఁ జూచుచుండిన చంద్రకళవైపునకు నీరద బరికించి, "సఖీ! చూడుము. నాకీవిగ్రహముల

మర్మము దెలియకుండినచో మనదురవస్థ వర్ణింప నలవిగాకుండును గదా!" యనెను.

చంద్రకళ:—నిక్కువము. ఇపు డాచక్రములు నాల్గును మనప్రాణములను గాపాడుచున్నవి. ... వాని దెస కెటులాశ్చర్యభావముతోఁ జూచుచు నీరో పరికింపుము! ... ఒకయడుగు పెట్టుటకు సహితము వారు భీతిల్లుచుండినటులఁ దోఁచుచున్నది.

మదాలస:—కాని, మన మెంతకాలముదనుక నిట్టి స్థితియందుఁ బడియుండఁగలము! ఇవ్విధంబుననే యీచక్రములు నిరంతరము దిరుగుచుండునా?

నీరద:—ఔను. మనము వాటిని నిలుపకుండినచో నొక నెలదినములవఱ కివ్విధంబుననే నిరాటంకముగఁ దిరుగుచుండును. అటుపిమ్మట నీచక్రములు దిరుగుటకు వేఱొకయుపాయము గలదు. కాని, యావిధము నాకుఁ దెలియదు.

చంద్రకళ:—అగుచో, మన మొక నెలదినములవఱకు నిర్భయముగ నీమందిరమునందు నివసింపఁగలము. ఈవ్యవధానములో మనకుఁ దోడ్పడువారెవ్వరు నరుదేరకుందురా?

నీరద:-ఏలరాకుందురు? ఈయంతరములో మనయాచకు లెవ్వరును రాకుండినను రోహిణీగడమునుండి మనకు సహాయము తప్పక వచ్చును. ఈస్థానము రోహిణీగడరాజ్యమునకుఁ జెందియున్నది. ఒకరి రాజ్యాధికారములో నింతమంది జనులుగూడి మహోపద్రవమును గలిగించుచుండుటయు నానమూదార మాప్రుడమి జేనికిఁ దెలియకుండుటయు సంభవముగాదుకదా!

మదాలస:—నిక్కువము. కాని, యన్నిదినములవఱకు భోజన భాజనాది నిత్యకృత్యములకు వలయు వస్తుసంభారము లిందు గలవా?

నీరద:—కొన్నిదినములకే కాదు. ఒకసంవత్సరమునకుఁ బైగా సరిపడు సామగ్రి లిందుఁ గలవు.

మదాలస:—అటులనే కానిమ్ము. కాని, మనకు జల మెచటినుండి వచ్చును. ఈసరోవరజల మింత వేగముగఁ దఱిగిపోవుచున్న దిగదా? ఒక జాముకాలములో దీనియందలి జలమంతయు నిశ్శేషమగు టొక వింతవిషయముగాదు. మఱియు మనము పిపాసాపీడితలమయి తుదకుఁ బ్రాణములను గోల్పోవలసి యుండును.

చంద్రకళ:—ఈసరోవరమందలి జల మంతరించిపోయిన పిదప నీ చిన్నకొప్పెరదక్క నితర యేజలాధారము నిందు లేదనితోఁచుచున్నది.

మదాలస:—మఱియు దీనవలన మూఁడునాల్గు దినములకంటె నధికముగఁ బని గడువదు. అట్టిస్థితియం దీచక్రము లొక నెల దినములవఱకుఁ దిరుగుచుండినను బ్రయోజనమేమి? మనము దప్పికబాధచేఁ దప్పక మృత్యుదేవత కధీనులము గాఁగలము. ఏశిల్పకారుఁ డీమందిరసంరక్షణార్థ మిట్టి యద్భుతసాధనములను నిర్మించియుండెనో, మఱియు దీనియందు నివసించువారి కెట్టిహానియుఁ గలుగకుండగ నిట్టి యద్భుతచక్రముల నమర్చియుంచెనో, యతఁ డీసరోవరజల మంతరించిపోయినపిదప నీమందిరమందు నివసించువారికి జల మెట్లు లభింపఁగలదని యోజింపకుండుట మిక్కిలి విచారకరము. అతఁ డీమందిరమం దొకబావియు నిర్మింపవలసియుండెను.

నీరద:—ఇట్టి యమోఘమగు శిల్పితనమును వెచ్చించి యీమందిరమును నిర్మించిన శిల్పకారుఁడు మిక్కిలి చతురుఁడనుట కెట్టి సందియమునులేదు. అట్టి నేర్పరియగు వాఁడిట్టి ముఖ్య

విషయమును మఱచియుండదనియే నాయభిప్రాయము. అతఁడు తప్పక దీనియందె దెచటనో, యొకబావియు నిర్మించియుండును. కాని, దానిజాడ నాకుఁ దెలియదు. మంచిది, నేను వెదకి యాజాడ కనిపెట్టెదను.

మదాలస:— నాకు మఱియొక సందేహముగూడ గలుగుచున్నది.

నీరద:— అదియెట్టిది?

మదాలస:— ఈనగోపరమందలి జలము పూర్తిగాఁ దఱిగిపోయిన పిదపఁ బగతు లీమందిరముక్రిందకు సొరంగమును ద్రవ్వి గోడలను గూలనేయుటకుఁ బ్రయత్నింపకుందురా?

నీరద:— అటు లెన్నటికిని గాఁజాలదు. ఈమందిరకుడ్యము లేస్థానమునుండియు నేయుపాయాంతరమునను ఖండింపఁబడవు.

వార లివ్విధంబున సంభాషించుచుండ వెలుపలినుండి గొప్ప కోలాహలము వారికి వినిపించుటచే నీరద చంద్రికళామదాలసలను వెంటఁదోడ్కొని సౌధోపరిభాగమునకు వెడలిపోయెను. మఱియు వార లచట నొక మఱుగుతావున దాఁగి పగతుర స్థితి నరయుచుండిరి. పగతు రామందిరముచెంత కేగుట కష్టసాధ్యంబేగాక యసంభవమని తలంచి పెద్దపెద్ద కూఁతలిడుచు గందరగోళము చేయుచుండిరి. మఱియు వారిలోఁ గొందఱు విల్లమ్ములను జేతధరించి మందిరము వెలుపలి కెవ్వరేనియు నేతెంచిన వారిని దుదముట్టించుటకు సంసిద్ధముగ నుండినటులఁ జూపట్టుచుండిరి. చంద్రకళ పగతురదెసకు గాఢదృష్టి నిగుడించి నీరదతో, "సఖి! ఈ వైరిజనములలోఁ గొందఱను నేను బాగుగ గుర్తింపఁగలిగితిని. నేను నాతండ్రిగృహమం దుండిన కాలమున వీరలు నాతండ్రి కొలువునం దుండెడివార" లనెను.

నీరద:—నిక్కువము. నేనుకు కొందఱను గుర్తించితిని. వారలు మీతండ్రి సేవకులనుట కెట్టి సందియమును లేదు. మఱియు వారలు నీతండ్రిని విడిపించుకొని పోవుట కిచటి కరుదెంచి నటులఁ దోఁచుచున్నది

చంద్రికళ:— (త్రుళ్లిపడి) ఏమి! నాజనకుఁ డీమందిరమందు బంధింపఁబడి యుండెనా?

నీరద:—ఔను! దీనియందుఁ జెఱపెట్టఁబడియున్నాఁడు.

విషాదకరంబగు నావార్త నాలించినంతనే యామె కోమలహృదయమం దొక గొప్ప యాఘాతము గలిగినట్లయ్యెను. తా నెవ్వరికారణంబున నేఁటిదనుకఁ బలువెతలకుఁ జిక్కి దురపిల్లుచుండెనో, ఎవ్వానికతంబున దుర్దశాఘతి మాయామె శిరముపైఁడి తొలఁగకుండెనో, యట్టి కుటిలహృదయుఁ డగు దుర్మార్గుండును నగు నిజజనకుని విపన్నావస్థ నాలించినంతనే నిర్మలంబును పవిత్రంబును నగు నామె హృదయము గఱగి వాని దుష్కృత్యములన్నింటి నొక్క మాఱుగ మఱచిపోయెను. దానితోఁపాటుగ యామె కన్నుల యెదుట * నిపాతగృహాదృశ్యము గ్రుమ్మరెను. అచ్చోట నామె సహోదరుఁడు కైజాఁగితో నామె ప్రాణములను గొనుటకుఁ దన వీరత్వమంతయు వెల్లడించియుండెను. కాని, తత్తరుణంబున రామశీలానాధుపుంగవుఁ డచటికివచ్చి చేరుటచే వానిపరియత్నమంతయుఁ జెన్నటివోయెను. తండ్రియాజ్ఞానుసరణి సహోదరుఁ డరుదెంచియుండెననియుఁ, దాను తనతండ్రి కంటఁబడినమాత్రమున దనయునురులను గొనుట కణుమాత్రము మాలసింపడనియు నామె బాగుగ నెఱింగియుండెను. కాని, నవసితహృదయయగు చంద్రకళ హృదయమందు నిజజనకుని గాంచు నాకాంక్ష తీవ్రతరంబుగ నుదయించు

* 4 వ భాగము 28 వ పరిశ్చేదము చూడుఁడు.

టచే నామె కన్నులనీరు నింపుచు నీరదవైపునకుఁ బరికించి గద్గద స్వరంబుతో, "నెచ్చెలీ! నీరదా! నాజనకుని యొకతేప కన్నులార గాంచు కోరిక నాహృదయాంతరాళమున జనించుచున్నది. నీకు నావలుకు లమితాశ్చర్యమును జనింపఁజేయక మానవు. కాని, ఏమిసేయుదును? నిరుపాయ"ననెను.

నీరద:—ఔను. నీవుదక్క నేయితర బాలికయేనియు నిట్టి కోరికను వెల్లడించియుండిన తప్ప కాశ్చర్యము నొందవలసినదే! కాని, సద్గుణఖనివగు నినుఁబోలు యబల విషయమున నాశ్చర్యము నొందుటకు స్థానమే కలుగదు. నీస్వాభావికమును నేను బాగుగ నెఱింగియుంటిని. కాని, సోదరీ! చంద్రికళా! నీకోరిక వ్యర్థమైనదిసుమా! నీతండ్రిని గాంచి నీవు ప్రసన్నచిత్తురాలవు గాఁజాలవు. అతఁడిపుడు వివశుఁడయియుండినను నిన్ను గనుఁగొనినంతనే కనులెఱ్ఱజేయుచు వేలకొలఁది యుపాలంబవాక్యములను బలుకక మానఁడు. మఱియు నిన్ను చప్పళింపకయే మ్రింగివైచుటకుఁ బ్రయత్నించును.

చంద్రకళ:—నీపలుకులు యథార్థములనుట కెట్టిసందియమునులేదు. కాని, జననీజనకుల యుపాలంబవాక్యముల నాశీర్వాదములుగ దలంతును. నా కెట్టిబాధయుఁ గలుగదు. ఇదియును గాక, నేను నాతండ్రి సమక్షమున జాలసేపటివఱకు నిలువక నొక్కమాఱు వానిని గన్నులారఁ గాంచి వెంటనే యచటి నుండి మరలుదును. ఇపుడు సరోవరము వెలుపల నిలచియుండిన శత్రువులు మనల నేమియుఁ జేయఁజాలరుగదా! నీదయ గలిగియుండిన నిట్టి సమయంబునగూడ నాతండ్రి నొకమాఱు చూచి వచ్చెదను.

నీరద:—నీవిటుల వచియించుచుండిన నేను కాదనజాలను. మంచిది! నడువుము. నిన్ను గారాగృహమునొద్దకుఁ దోడ్కొని పోయెదను.

మదాలస:—నేనును మీ వెంట నేతెంతునా?

నీరద:—ఆఁ. ఆఁ. ఎట్టి యాటంకమును లేదు. నీవుకూడ మీ రాణి యగు వసంతసేన నొకపరి పరికింపవచ్చును.

నీరద పరిచారికలను తనచెంతకుఁ బిలిచి వారితోఁ జెప్ప వలసిన విషయములను బాగుగ బోధించి తెలిపెను. తదనంతరము చంద్రికళామదాలసలను వెంటఁదోడ్కొని యచటినుండి బయలు దేరెను. మఱియు నామె యొకగదినుండి యొక్కైవారును లాంతరును జేత దీసికొని రెండవగదిలోనికిఁ జనెను. ఆగదియం దెట్టి సామగ్రులును లేవు. నీరద మఱియొకగదియొద్దకుఁ బోయి దానిబీగమును దెఱచెను. తదనంతర మామువ్వురాగదియందుఁ బ్రవేశించిరి. అది మిక్కిలి చిన్నదియగునది. దానియందు వర్ణించుటకుఁదగిన వస్తము లెవ్వియును లేవు. కాని, దానియం దొక యంతర్భవనము మాత్ర ముండెను. దానిలోని కేగుట కద్భుతమైన చిన్న లోహకవాట మొకటి గలదు. నీరద దనచేతియందలి లాంతరు భూమిపై నిడి మొలనుండి తాళపుఁజెవిని వెడలించి యాయంతర్భవనకవాటమును దెఱచెను. దానియందు గాఢాంధకారము వ్యాపించి యుండుటచే నీరద లాంతరు పైకెత్తి చూపెను. ఆయంతర్భవనములోనికిఁ బోవుటకు చిన్నచిన్న మెట్లు గలవు. చంద్రికళామదాలసలకుఁ దన వెంట నేతెంచుటకు సన్నఁజేసి నీరద యామెట్లనుండి క్రిందికి దిగిపోయెను. ఆమె యాస్థానమందుఁ బ్రవేశించుటతోడనే, యనర్ఘంబును నలభ్యంబును నద్వితీయంబును నగు పదార్థ మొకటి కన్నులయెదుటినుండి యొక్కమాఱుగ నదృశ్యమగుచో, వానికెట్టి విభ్రాంతి జనించునో

యాటుల నే నీరద వెలవెలబాఱిన మోముతో భయసంభ్రమాంధో ళితదృష్టి నలుదెసలఁ బరికింపసాగెను. ఆయంతర్భవన మిరువది మూ రలు పొడల్పును నిరువదియైదుమూరలు నిడివియు గలిగియుండెను. ఆలా ణ శృంఖలాబద్ధులగు నపరాధులకు నివాసస్థానమని చెప్పకయే చెప్పుచుండెను. దానియందు రెండుశ్రేణులుగ ద్వారములు లేని చిన్నచిన్న గదు లిరువది గలవు. ఇంతటి స్వల్పస్థానమం దిరువది గదుల నిర్మింపఁబడియుండుటచే వానియందు నివసించు నపరాధుల జీవిత సౌవ్విధంబుగఁ గడచుచుండెనో మాపాఠకమహాశయులు న్యాయముగ నూహింపఁగలరు.

ఆశ్రేణులమధ్య నాయపరాధులకు భోజనసామగ్రులు మున్న గువాని నొసంగి పోవుటకు నన్నని సందువలె నొక చిన్న మార్గము మాత్రము గలదు. ఆమార్గమున కొకకొనయం దివు డేమార్గమున మన నీరద మున్నగువార లేతెంచియుండిరో యచటఁ గొన్ని మెట్లు కట్టఁబడియుండెను. దానికి యెదురుగ రెండవకొనయందు సుదృఢం బగు నొక లోహకవాటము గలదు. ఆద్వార మిపుడు తెఱవఁబడి యుండుటయే నీరదకుఁ గలిగిన భయసంభ్రమములకుఁ గారణము. ఆకవాటము మూయునప్పు డుపయోగింపఁబడు పెద్దబీగ మొకటి ద్వారము నొద్ద భూమిపైఁ బడియుండెను. ఆద్వారము తెఱవబడి యుండుటచేతను దానియందలి యపరాధు లచటఁ గనిపింపకుండుట వలనను నీరద దొట్రుపాటుతో నలువైపులఁ బరికింపసాగెను.

నీరద:- శృంఖలాబద్ధులగు నపరాధు లెవ్విధంబున వెడలిపోయిరో, మఱియు నీకవాటమునకు బంధించియుంచిన బీగము నెవర్కు తెఱచిరో, కడు నశ్చర్యముగనున్నది. నిస్సందేహముగ మనపరిజనులలో నెవ్వరేనియు వారికిఁ దోడ్పడియుండవలె ను. లేదా, మనశత్రువు లెవ్వరో యిచటికి వచ్చి చేరియుం

డవలెను. కాదు కాదు. ఈసురంగద్వార మావలివైపునుండి
యెవ్వరును దెఱవఁజాలరు. మఱియు............"

చంద్రకళ:—ఏమి! అది యొక సురంగద్వారమా?

నీరద:—సహాయము తటస్థించినప్పుడీమందిరములోనికి వచ్చి పోవుట
కిదియొక రహస్యమార్గము. ఈసొరంగమార్గ మిచ్చటినుండి
చాలదూరమువఱకు వెడలియున్నది. మఱియు ననేకసంవత్స
రములనుండి యీమార్గ మువయోగింపఁబడుటలేదు. కాని,
మీతండ్రిని బంధించి గొనితెచ్చిన సమయము సమాత్రమీ
మీద్వారము తెఱవఁబడినది. అతఁ డీసురంగమార్గమున నే
యిచటికిఁ గొనితేబడెను.

మదాలస:—మన మన్నిటికంటె ముందుగ నాసురంగద్వారమును
బంధించు టత్యావశ్యముగఁ దలంచుచుంటిని. మన మాల
సించితిమేని యీమార్గమునఁ బగతులు వచ్చి చేరినను జేరఁ
గలరు. మఱియు మనప్రయత్నమంతయు విఫలంబగును.

చంద్రికళ:—మన మీసురంగములోని కేగిన సవరానులెందు తె
లియునేమో చూడ............"

నీరద:—నాయభిప్రాయమును నదియే! కాని, యిట్టివిధంబున రిక్త
హస్తంబులతోఁ బోవుట చతురతగాదు. దానియందుఁ బగ
తు రెవ్వరేనియుఁ జూపట్టిన ముప్పు వాటిల్లునుగదా? మం
చిది! మీరిరువురు నిచట నిలచియుండుఁడు. నేనిప్పుడే తిల
స్మభల్లమును గొనితెచ్చెదను.

ఇవ్విధంబున బలికి నీరద యచటినుండి వెడలిపోయెను.
ఆమె యాసురంగమార్గమును బంధింపకయే వెడలుట మిక్కిలి
పశ్చాత్తాపకరంబగు విషయము. మఱియు నాపప్రమాదమువలన
నామె యధికదుఃఖమనస్తాపముల నొందవలసివచ్చెను. నీరద మగుడి
యాతావునకు వచ్చి చేరునరికచటఁ జంద్రకళగాని, మదాలసగాని

చూపట్టరైరి. ద్వారము తెఱవబడియుండిన యాసుంగమార్గమున బగతు రెవ్వరో యేతెంచి నిస్సహాయులగు చంద్రికళామదాలసలను బంధించికొని పోయియుందురని నిశ్చయించుకొని నీరద మిగుల పశ్చాత్తాపము నొందసాగెను.

## ౨౧.

చంద్రికళామదాలస లదృశ్యలగుటచే నీరద కపారదుఃఖము [illegible]ంచెను. ఆమె తనప్రాణములను సహితము సరకుచేయక తిలస్మాథల్లమును జేతధరించి నిర్భయముగ నాసురంగమార్గమందుఁ బ్రవేశించెను. ఒకనాఁడు మృగాంకవతి యాతిలస్మాథల్లమును నీరద కొసంగి దాని గుణాతిశయములను వర్ణించి యామెకుఁ దెలిపియుండెను. మఱియు నీరద కాథల్లముపై గాఢవిశ్వాసము గలదు.

నేఁటికిఁ బూర్వమెన్నఁడు నీరద యాసురంగములోనికిఁ బోవు నవసరము గలుగకుండుటచే నది యెట్టిదో, దానియం దేమి గలదో, యామెకుఁ గొంచెమైనను తెలియదు. తత్కారణమున నాయబల తిలస్మథల్లపు పిడిని నొక్కి ప్రకాశమును గలిగించెను. దానినుండి వెడలిన విద్యుత్ప్రభవంటి ప్రకాశమందు నీరద యాసురంగద్వారమును దాఁటి లోన పాదమిడెను. రెండుమూఁడడుగులు నడచినపిదపఁ గ్రిందకు దిగి సరాసరిగ వెడలియుండిన యొకసుంగమందుఁ బ్రవేశించెను.

తన నెచ్చెలులగు చంద్రకళామదాలసలను జెరఁగొని పోవుచుండిన దుష్టు లాసురంగమందుఁ జూపట్టఁగలరను నాశతో నీరద్ధ యతిరయంబున దానియందుఁ బరుగులిడసాగెను. కొంతదూర మేగిన పిదపఁ దాను దలంచినటులఁ గొందఱు మనుజులు ముందువైపునకు వెడలిపోవుచుండు టామెకుఁ జూపట్టెను. ఆమనుజులు దమ వెనుక

నుండి వెడలివచ్చుచుండిన యద్భుతప్రకాశమును గని నివ్వెరపాటుతో నావైపునకుఁ దిరిగి పరికింపసాగిరి. ఆవెలుతురు క్షణక్షణము వారిని సమీపించుచు నేత్రములకు మిఱుమిట్లు గొల్పుచుండెను.

నిస్సహాయులగు చంద్రికళామదాలసలను ద్రుచ్చిలించికొని పోవుచుండిన దుష్టులు వీరలే! తిలస్మభల్లమును గైకొని నీరద మఱుడివచ్చునంతలో నాఘాతకులు చాలదూరమువఱకు వెడలియుందురు. కాని, చంద్రకళామదాలసలను బలాత్కారముగ నీడ్చుకొని పోవుచుండుటచేఁ దాము గోరినంత వేగముగ వారలు నడవఁజాలకుండిరి. తత్కారణంబున నీరద శీఘ్రముగ వారిజాడఁ గనిపెట్టగలిగెను. ఆదుష్టుల వెంట నొకలాంతరు గలదు. కాని, భల్లపుప్రకాశము దానిని నిరుపయోగ మొనర్చుచుండెను. వారలు దవ్వుననుండి నీరదను గాంచినంతనే సంతోషభరితమనస్కులయి యామెనుగూడ బంధించుకొనిపోవుటకుఁ దలంచిరి. కాని, యాతిలస్మభల్లమునుండి వెడలుచుండిన యద్భుతప్రకాశము వారికోరికను క్షణకాలములో వమ్ముజేసివైచెను. మఱియు నాయద్భుతప్రకాశమువలనఁ గన్నులను దెఱవఁజాలకుండుటచే నచటినుండి పారిపోవుటకు సహితము వారికి సామర్థ్యము గలుగకుండెను.

క్షణకాలములో నీరద వారిసమీపమునకుఁ బోయి చేరెను. ఆదుష్టులందఱు నలుగురు గలరు. నీరద చేతియందా తిలస్మభల్లము లేకుండినచో, దప్పక వారలామెనుగూడ బంధించియుందురు. కాని, యిచటివిషయమే వేఱుగనుండెను. ఆతిలస్మభల్లమునుండి వెడలుచుండిన దేదీప్యమానంబగు ప్రకాశమును భరింపఁజాలక వారలు రెండుచేతులతోఁ దమనేత్రములను మూసికొని క్రిందఁజతికిలఁబడిరి. చంద్రికళామదాలసలకుఁగూడ నట్టిస్థితియే యొదవియుండెను.

నీరద మిగులఁ జాతుర్యగరిమ నాతిలస్మభల్లము నాదుష్టుల దేహములకుఁ దాకించెను. తోడనే వారలు కంపించుచు మూర్ఛా

గతులయి నేలపయిఁ గూలిరి. నీరద యాభల్లపుపిడిని నొక్కుట మాని యాయద్భుతప్రకాశము నంతరింపఁజేయుటచేఁ జంద్రకళా మదాలసలు కన్నులనుదెఱచి నీరదను గనుఁగొనిరి.

చంద్రికళామదాలసల కోమలకరద్వయములు కఠినరజ్జువులతో బంధింపఁబడియుండుటఁ గనుఁగొని నీరద వెంటనే యాకట్లను విప్పివైచెను. అంత వారలు మిక్కిలి ప్రీతితో నీరదను కౌఁగలించుకొనిరి. ఆయబలలు ముగ్గురినేత్రములనుండి వెచ్చని యశ్రుబిందువులు జాలువారఁదొడంగెను. తదనంతరము నీరద చంద్రికళామదాలసలతో, "నెచ్చెలులారా! కొంతసేపటివఱకు మీరిచట వేచి యుండుఁడు. నేను కొంత ముందునకేగి యచటిస్థితి నరసివచ్చెదను. మార్గమందు శత్రువు లెవ్వరును దారసిల్లకుండిన చివరవఱకుఁ బోయి యీసురంగముయొక్క రెండవముఖద్వారమును బంధించి వచ్చెదను. వెలుపలివైపుననుండి పగతురీద్వారమును దెఱవఁజాలరని నాదృఢవిశ్వాసము. కాని, యిపుడదియంతయు మిథ్యమయ్యెను. ఈదుష్టు లెవ్విధంబున నాద్వారమును దెఱవఁగలిగిరో కదు యద్భుతముగఁ దోఁచుచున్న"దనెను.

చంద్రికళ:-నిక్కువము. కాని, నీవు ముందునకేగుట నాయభిప్రాయముగాదు. నీవు వెడలుసమయంబున మార్గమందు వైరిజనులు తారసిల్లినచో నధికయనర్థము సంభవింపఁగలదు. మన మిచటినుండి మరలిపోయి సురంగాంతర్భవనముల దృఢకవాటములను బంధించి మిన్నక గూర్చుండుటయే మేలు. తరువాత నాభగవంతుఁడేమి యొనర్చునో చూడవచ్చును.

నీరద:—(కొంచెము యోజించి) మీరిరువురు నిచటినుండి వెడలి సురంగాంతర్భవనద్వారములను బంధించి నిశ్చింత మందిరమందుఁ గూర్చుండియుండుట శ్రేయస్కరము. మఱియు

మీర లెట్టియాటంకమును బలుకక నే నీసురంగము వెలుపలకు వెడల సమ్మతింపుఁడు. కారణంబేమన, నపరాధులిచటినుండి వెడలిపోవుట సామాన్యంబగు విషయము గాదు. వారు తప్పక మహోపద్రవములను గలిగింపక మానరు. మఱియు నేను మృగాంకవతియెదుట సిగ్గుచేఁ దల వంచుకొనవలసివచ్చును. సోదరీమణులారా! ఆజగదాంబ కృపావిశేషంబున మీరిరువురను శీఘ్రముగఁ జూపట్టిరి. కానిచో, నధికయనర్థము సంభవించియుండును. మఱియు మృగాంకవతికి మోము జూపుటకుఁ దగియుండకుందును. ఇపు డాయపరాధులజాడ దీయుదనుక నాప్రాణములకు స్వస్థత గలుగఁజాలదు.

మదాలస:—సోదరీ! నీవిటు లేల వచియించుచుంటివి? అసంఖ్యాకులగు విరోధులమధ్యకు నొంటరిగ బోవు టుచితమేమో, మే మీవిషయమున నెటుల సమ్మతింపఁగలమో నీవే యోజించి చూడుము.

నీరద:—(తిలస్మభల్లము వైపునకు సంకేతించి) చూడుఁడు. నేను వేలకొలఁది పగతురమధ్యఁ జొచ్చి యవలీల విజయమును బడసి మగుడివచ్చుటకుఁ దగిన యద్భుతప్రభావ సమన్వితంబగు నమూల్యపదార్థమొకటి నాయొద్దఁ గలదు. మీరలిపు డీతిలస్మభల్లముయొక్క యద్భుతప్రభావమును గన్నుఁలారఁ గాంచియున్నను, దీని యసలువృత్తాంతము మీకుఁ దెలియకుండుటచే భీతిల్లుచు నన్ను వెడలనీయక యాటంకము బెట్టుచుంటిరి.

చంద్రికళ:—ఔను. మే మీభల్లముయొక్క ప్రభావమును గాంచియుంటిమి. మఱియు నిస్సందేహముగ నిదియొక యద్భుత

పదార్థమయి యుండినను, రిపుజనులలోనికి నీవొంటరిగ బోవుట మాకు సమ్మతముగాదు. నీవిటులనే పట్టు పట్టుచుండిన మే మిరువురముగూడ నీవెంట నే తెంపక మానము.

నీరద పెక్కుభంగుల వారిరువురకు బోధించి చూచెను గాని, వార లామెమాట యొకటియుఁ జెవిఁ బెట్టకుండుటచే నాఁకె నిరుపాయయై వారిమాటలకు సమ్మతించి తనయభిప్రాయము మార్చుకొనవలసివచ్చెను. తుదకు వారు లానురంగముయొక్క రెండవముఖద్వారమునొద్దకుఁ బోయి దానిని బంధించి వచ్చుటకును, నాదుర్మార్గులు సామాన్యమనుష్యులు గావున బంధించియుంచు టనావశ్యకమనియుఁ దలంచి వారల నీడ్చుకొనిపోయి సురంగము వెలుపలఁ బడవైచుటకు నిశ్చయించుకొనిరి. తుద కటులనే కావింపఁ బడెను.

నీరద చంద్రికకామదాలస లాయపరాధుల నీడ్చుకొనిపోవుచు నరగంటకాలములో నాసురంగముయొక్క రెండవముఖద్వారముచెంతకుఁ బోయి చేరిరి. ఆసురంగముఖద్వార మొక పర్వతగుహతో సంబంధించియుండెను. మఱియు దానిముఖద్వారమున జిన్న లోహకవాట మొకటియుఁ గలదు. అది యిపుడు తెఱవఁబడియుండెను. నీరద యాదుష్టులను వెలుపలకు నెట్టివైచి యాసురంగద్వారమును బంధించివైచెను. దానికి లోపలిభాగమున నెట్టిబీగమును లేదు. ఆద్వార మొక యినుపగొండ్లెముతో మాత్రము బంధింపఁబడుచుండెను. తదనంతర మాయబలలు మువ్వు రచటినుండి మరలిరి. మార్గమందు నీరద యాతిలస్మభల్లముయొక్క యద్భుతప్రభావమును చంద్రికకామదాలసలకు సవిస్తరముగ వర్ణించి తెలిపెను.

ఆయువతీమణులు మువ్వురు నంతర్భవనమందుఁ బ్రవేశించి, సురంగద్వారమును బంధించివైచిరి. పిదప నచటినుండి సౌధోపరి

భాగమునకు వెడలిన పిదప నీరద యామంతర్భవనద్వారము నొక సుదృఢంబగు బీగముతోఁ బంధించి వైచెను.

ఇట నాసరోవరజల మతివేగంబుగ నంతరించిపోవుచుండెను. కారణంబేమన, సరోవరముయొక్క పైభాగము క్రిందిభాగము కంటె మిక్కిలి వైశాల్యము గలిగియుండుటచే దానియందు విస్తారముగ జలము నిలచియుండును. అట్టివిధంబునఁ గాక క్రిందిభాగము తక్కువ వైశాల్యము గలిగియుండుటచే దానియందు జలము స్వల్పముగ నుండును. తత్కారణంబున దానియందలి జలము శీఘ్రగతి నంతరించి పోవుచుండెను. నీరద సౌధోపరిభాగమునకుఁ జేరినంతనే యాసరోవరము బొత్తిగా నెండియుండుటఁ గనుఁగొనెను. ఆమందిరమునకు నలువైపులఁగల చక్రములు లింకను నతివేగంబుతోఁ దిరుగుచుండెను. ఆమందిరసమీపమున కేగుట కష్టసాధ్యమే గాక యసంభవమనియుఁ దలంచి యరాతిజనులాచక్రములవైపున కత్యాశ్చర్యచకితదృష్టిఁ బరికించుచుండిరి. ఇట మన చంద్రకళామువాలనాసీరదలు పగతురపై బాణములను బ్రయోగించుట నిమిత్తము నిర్మింపఁబడియుండిన కుడ్యరంధ్రములనుండి వారి యవస్థను బరికింపఁ దొడంగిరి.

అపుడు రాత్రి రెండుగంటలకుఁ బైగా మీఱియుండెను. కాని, యొకజాముకాలము దర్శనమొసంగి యస్తమించు శశాంకుని చంద్రికలు వైరిజనుల కార్యాచరణముల నాధకారనిచోళమునందు మఱుఁగు బడనీయకుండెను.

ఎపుడా వైరిజను లాచక్రముల కారణమున నామందిరము చెంతకుఁ బోవుట యసంభవమని నిశ్చయించుకొనిరో, యపుడు వారలు పెద్దతడవు యోజించి తుద కొకయుపాయమును నాలోచించి యావిధంబుగ నొనరింపసాగిరి. వారి కార్యాచరణములను గాంచినంతనే నీరద చంద్రకళామువాలనల హృదయమందు గొప్ప

భీతి జనించెను. పగతు రాసరోవరమందు మట్టివైచి పూడ్చుటకుఁ బ్రారంభించిరి. అది మిక్కిలి చక్కని యుపాయమనుట కెట్టిసందియమును లేదు. ఆసరోవరము పూడ్చఁబడిన పిదప నాచక్రిములు నాలుగును తిరుగుటయుఁ దిరగకుండుటయు సమానము. అవి మట్టియందుఁ గప్పఁబడుటచేఁ దిరుగక నిలచిపోయినను నాశ్చర్యము నొందఁ బనిలేదు. ఆయారాతుల యొద్ద భూమిద్రవ్వ పరికరము లెవ్వియును లేవు. వారలు కత్తు లుకఠారులు బళ్ళెములు మున్నగు వానితో సాధ్యమగురీతి భూమిని త్రివ్వుచుండుటచే నాకార్యమందు విశేషసమయము నష్టపడుచుండెను. వైరిజనులొనర్చుచుండిన ప్రయత్నములను గాంచి నీరజహృదయము తటతట కొట్టుకొనఁదొడంగెను. మఱియు నామె పశ్చాత్తాప సంతప్తచిత్తయగుచుఁ జంద్రకళవైపునకుఁ బరికించి, "నెచ్చెలీ! వారిప్రయత్నముల కిపుడు సమాధానమేమి?" యనెను.

చంద్రకళ:—వారలొకదినములో నీసరోవరముఁ బూడ్చఁజాలరు. కాని, మన మీముప్పునుండి తప్పించుకొను నుపాయమును వేగమె యోజింపవలెను. ఈసరోవరము మట్టితోఁ బూడిన పిదప నీచక్రిములు నాల్గును మట్టియందుఁ గప్పఁబడిపోవును. ఇఁక వైరిజను లీమందిరమున నిరాఘాటముగఁ బ్రవేశింపఁగలరు.

మాలస:—నా మాసురంగమార్గమునఁ బారిపోవుటదక్క నితరోపాయ మెద్దియుఁ బొడకట్టకున్నది.

నీరజ:—ఏమి! యొాపిచ్చిమాటలు! పగతురకీసురంగవృత్తాంతము తెలిసియున్నదిగదా! వారలాసురంగ ముఖద్వారమును మాత్రము పూరక విడచియుందురా? అక్కడనుగూడ కొందఱు మనుజులు కావలి కాయుచుందురు.

మాలస:—అగుచో, నాయాశయు వ్యర్థంబే! మన మిచటినుండి పారిపోవుట కష్టసాధ్యము. మంచిది. కానిండు. ఆపరమేశ్వ

రుఁడే కలఁడు. మనమిపుడు బాణములను ప్రయోగించి శత్రువులసంఖ్య తగ్గునట్లుఁ గావింపవలెను. వారలు మనపై వెట్టియాయుధములను ప్రయోగింపఁజాలరుగదా!

నీరద:— ఔను. అయ్యారే నముచికథముగఁ దోఁచుచున్నది. తదనంతరము మనకుఁ దోఁచిన విధంబునఁ బ్రవర్తింపవలెను. కాని, సోదరీమణులారా! ఇప్పుడైనను సన్నీతిలన్మభల్లము సమేతముగ సమరంగము వెలుపలకు వెడలనీయుఁడని మరల వచియించుచుంటిని. నేనావంకలకొలఁది విరోధుల నెట్లుఁ బరిమార్చివచ్చెదనో శీఘ్రముగనే మీరలు చూడఁగలరు. మీ కీభల్లముయొక్క ప్రభావము పూర్తిగాఁ దెలిసియుయున్నది. కావున, మీరలు దీనివయిని విశ్వాసముంచి మాటాడక నన్ను బోనీయుఁడు. ఈసరోవర మిట్లు మట్టితోఁ బూడ్చబడుట నా కావంతయు సమ్మతముగాదు. మరల దీనిని బాగుచేయించుటయం దధికపరిశ్రమనొందవలసివచ్చును.

మదాలస:- నిశ్చయము. నీపలుకులు యుక్తిసంగతములు. మఱియు నీభల్లము నెంతవర్ణించినను తనివితీరదు. వైరభావముతో నీయెదుటి కేతెంచువారి నందఱను త్రుటికాలములో యమసదనమునకుఁ బుత్తెంపఁగలవు. కాని, వ్యూహమునుండి నీపై శరపరంపరలను గురియించిన నవు డేమిసేయఁగలవు?

నీరద:— (కొంచెము యోజించి) ఔను. నీవు వచియించిన నాగతియు యోజింపవలసినదే! మంచిది! బాగుగ జ్ఞప్తికి వచ్చినది. ఈమందిరమందు నాదేహమునకు సరిపడు నొక కవచము గలదు. నేను దానిని ధరించి సంగరాంగణమునకుఁ బోయెదను. మఱియు నెవ రెన్నిశరంబులఁ బ్రయోగించినను నిశ్చింతగ నుందును. ఇఁకఁ గన్నులు చెవులు మున్నగువాని

నెటులఁ గాపాడుకొనఁగలవని నీవు ప్రశ్నింపవచ్చును. కాని దానితోపాటీవిషయమునుగూడ యోజించుట లెస్స. మన పగతు లీసరోవరమును బూడ్చి మందిరములోని కరుదెంచి మనలను బంధించిన నేమిసేయఁగలము? మన మవమానము వడి హీనముగఁ బ్రాణములను గోల్పోవుటకంటెఁ బటుతర విక్రమంబున వైరివీరులతోఁ బోరుసల్పి రణాంగణమందుఁ గూలుటయే శ్రేయోదాయకముగదా!

చంద్రికళ:—ప్రాణములను బలినొసంగ సంసిద్ధురాలవగు నీవు మమ్మేలవిడచిపోయెదవు? నీవు వెళ్లినపిదప మాకు దుర్దశయు నవమానమును గలుగకుండునా?

ఈవిషయమందు నీరద చంద్రికళామదాలసలమధ్యఁ జాల సేపటివఱకు వాదప్రతివాదములు జరుగుచుండెను. తుదకు రూపమును మార్చుకొని కవచమును దొడిగి తిలస్మభల్లము నమేతముగ నీరద సురంగమార్గమున బోయి వైరివీరులతోఁ బోరుటకును, చంద్రకళామదాలస లిరువురు నీరదవెంట సురంగములోని కేగి యామె సురంగద్వారమును దాటినపిదప నాద్వారములను బంధించుకొనుచు మందిరములోని కేగుటకును, విరోధులను పలాయనులనుగ నొనరించినపిదప నీరద మందిరమునకుఁ దిరిగి వచ్చుటకును నిశ్చయించుకొనిరి.

నవయౌవన ప్రతిభావిభాసితలగు నాసుందరీమణులు ముగ్వురక్కచెల్లెండ్రకంటె నధికముగ నొండొరులను ప్రేమించుకొనుచుండిరి. తత్కారణంబున నీరదను నొంటరిగఁ బంపుటకు నమ్మతము గాకుండినను వివశులగుటచేఁ జంద్రకళామదాలస లామెవెంట సౌధోపరిభాగమునుండి క్రిందికి దిగివచ్చిరి. పిదప నీరద యొకగదిలోనికిఁ బోయి మైయారీమసాలాలతోఁ దనదేహమునకు రంగువై

చుకొని, చూపరు లెంతధైర్యశాలియైనను దన్ను గాంచినంతనే యొక్కమారైనను భీతిల్లునట్టి భయంకరాకారమును దాల్చికొనెను. పిదప గవచమును దొడిగి తిలన్మభల్లమును చేతధరించి, సురంగ మందు బయలుదేరెను. చేత నొకలాంతరును దీసికొని చంద్రికా మదాలసలును నామెవెంట నేగిరి.

మొదట నంతర్భవనద్వారమును పిదప సురంగద్వారమును దెఱచి యాపూర్వోక్తు లాసురంగమందు బ్రవేశించిరి. ఆసుంద రాంగులు మువ్వురు నిరువది నిరువదియైదుగజములకంటె నధికదూరము వెడలియుండరు. అంత నాకస్మికముగ వెనుకవైపు ద్వారములు బంధింపబడినటుల శబ్దము వెడలివచ్చుటచే నాయుబలలు మువ్వురు విస్మయాందోళితచిత్తలై యచట నిలచిపోయిరి. నీరద చంద్రికళామదాలసలవైపునకు బరికించి, "కటకటా! ఇది యెట్టి విచిత్రము! పగతు ఁడు మనయింటఁ జొచ్చియున్నా"డని పలుకుచుఁ జంద్రికళామదాలసలతో నచటినుంటి వెనుకకు మరలెను. మఱియు సురంగద్వారముునొద్దకుఁ బోయి కాంచునంత నది బంధింపఁబడి యుండుటఁ జూపట్టెను. నీరద యతిసంభ్రమముతోఁ దలుపులను బాగుగ నెట్టి చూచెను. కాని, నిష్ప్రయోజనము. ఇప్పు డాయుబలలు మువ్వుర హృదయములయం దెట్టిస్థితి యొదవియుండునో, దాని ని బుద్ధిశాలురగు మా పాఠకమహాశయులు స్వయముగ యోజింపఁ గలరు. మదాలస తొట్రుపడుచు, నీరదతో, "నీవలుకులు యదార్థములు. నీవు వచియించినటుల మనపగతు లీగృహమందే కలరనుట కెట్టిసందియమును"లే దనెను.

చంద్రకళ:—మనపరిజనులలో నెవ్వరో యొకరు మనకు విరోధి కావలెను. లేదా, పగతుర దైయెవ్వారు డెవ్వఁడో మనపరి జనులలో నొకరి రూపమును దాల్చికొని యిచట నివసించు చుండవలెను.

నీరద:—మనకిపుడు సందేహము దీరినది. అపరాధుల నాదురాత్ముండే వెడలించియుండును. రెండవవైపునుండి యేవిధంబునను దెఱవఁబడని యిట్టి సురంగ ముఖద్వారము దెఱవఁబడుటయు నపరాధులు తప్పించుకొని పారిపోవుటయు నాకమితాశ్చర్యమును గలిగించుచున్నది. కాని, యసలువృత్తాంతమిపుడు వెల్లడియైనది ఆపిశాచము (అతఁడెవఁడైనను) మనము మందిరములోనికి మగుడిపోకుండగ నీద్వారమును బంధించియున్నాఁడు. అకటా! గొప్పమోసము సంభవించినది. మన మావిషయమును గనిపెట్టలేక నిశ్చింతగ నుంటిమి. ఆదురాత్ముఁడు మఱుగుఁబడి మనవెంట నంతర్భవనములోనికి దిగియుండును. కాని, మనరాజాడ యనుమంతయుఁ దెలియదయ్యెను. (కొంచెమూగి) మనమిచట నిట్టి విపదయందుఁ జిక్కియుండిన సమాచారము మన పరిజనులకుఁ దెలియుట యసంభవముగదా! ఏమి సేయుదును!

చంద్రికళ:—ఏమి? యీవైపుననుండి యీద్వారమును దెఱచుటకేయుపాయాంతరమును లేకుండెనా?

నీరద:—ఏయుపాయమును లేదు.

మదాలస:—పగతు లాసురంగ ముఖద్వారమునుగూడ వెలుపలనుండి బంధించియుంచిన మనమేమి సేయగలము?

నీరద:—ఆద్వారము వెలుపల దానిని బంధించుట కుపయోగపడు వస్తువెద్దియును లేదు. అయినను పగతులు చాకచక్యము గలవారైనచో నాముఖద్వారమునుగూడ బంధింపవచ్చును. ఆద్వారముపై నిటుకరాళ్ళు, సున్నము మున్నగునవి గుట్టవేసి దానిని బంధింపవచ్చును. తుదకు మట్టివైచియైనను బూడ్చవచ్చును.

చంద్రకళ:—ఆహా! మనమిపు డకాలమరణము నొందనుంటిమి. పగతు లీద్వారమును బంధించు విషయమునుగూడ మొదటనే నిశ్చయించుకొని యుందురు.

మదాలస:—జాగెందులకు? మనమిచట నొక క్షణకాలమయినను నిలువక సురంగము వెలుపలకు వెడలుట శ్రేయస్కరము. ఆద్వారముకూడ బంధింపఁబడి యుండదుగదా!

నీరదాచంద్రకళామదాలస లచటినుండి వడివడిగా నడచుచు నాసురంగముయొక్క రెండవముఖద్వారమునొద్దకుఁ బోయి చేరిరి. ఆముఖద్వారమునొద్దను గూఢ మందిరమువైపునఁగల సురంగముఖద్వారమునకు నిర్మించియుండిన విధముననే కొన్ని మెట్లు కట్టఁబడియుండెను. నీరద యాకవాటమునకుఁ దగిల్చియుంచిన యినుప గొండ్లెమునుదీసి యాతలుపులను గెంటి చూచెను. కాని, యవియుఁ దెఱవఁబడకుండుటచే 'హా' యని యఱచి భూమిపైఁ జతికిలఁబడెను. మఱియుఁ జంద్రకళామదాలసలవైపునకుఁ బరికించి, "నెచ్చెలులారా! మనము సందేహించిన విధంబుననే తొడరినది. ఇఁక నేమికలదు. తెరవెయ్యది? ఈకవాటములు లోపలివైపునకుఁ దెఱవఁబడునటుల యాశిల్పకారుఁడు నిర్మించియుండినచో నెట్టిచింతయు లేకుండును. మనము తలుపులను లోపలివైపునకుఁ దెఱచి యామార్గ మేపదార్థమువలన మూయఁబడియుండెనో తెలిసికొనుటకు సులువు చేకూరియుండును. మఱియు నీఱిలస్మభల్లముతో దారిజేసికొని వెలుపలకు వెడలిపోవుటకుఁ బ్రయత్నింతుము. కారణంబేమన, నీభల్ల మెట్టిపదార్థమునైనను ఖండించు సామర్థ్యమును గలిగియున్నది. కాని, యీలోహకవాటము వెలుపలకు దెఱవఁబడుట పశ్చాత్తాపకరంబగు విషయము. ఇదియంతయు నాశిల్పకారుని ప్రమాదమువలన గలిగిన యనర్థము. సమయము దటస్థించినప్పుడుగాని పకార్యమందలి ప్రమాదము ననుభవమునకు రాదు. మందిరనిర్మాత లన్నిటికంటె ముందుగ

ద్వార మే వైపునకుఁ దెఱవఁబడవలెనో యను విషయమందుఁ దృష్టినిడవలెననియు వెలుపలివైపునకుఁ దెఱవఁబడు కవాటముల నెన్నఁడు నిర్మింపరాదనియు నాకిపుడు దెల్లమయినది. ఆహా! ఇపు డేమి సేయుదును. నామరణమున కావంతయు వగవను గాని, మిమ్ము రువురను జాగ్రత్తగాఁ గాపాడుచుండుటకు మృగాంకవతి నాయొద్దకుఁ బుత్తెంచియున్నది. మఱియు నేఁడు నామూలమున మీరిట్టి దుర్దిన మును గాంచవయ్యెఁ" ననెను.

"సురంగమార్గమున వెలుపలకుఁ బోరాదని మే మెంత చెప్పి నను మా మాటలు చెవి బెట్టకుండుటచే నిట్టి యంగదములను గుదు వవలసివచ్చె"నని యేసంకీర్ణహృదయులగు బాలికలేనియుఁ బలికినఁ బలుకవచ్చును. కాని, మన చంద్రకళాముదాలస లిపుడు విశాల హృదయులును సద్గుణగరిష్ఠలు నగుటచే నీరద మానసము నొవ్వఁ జేయుట యవివేకమనియు, నామె గావించియుండిన కార్య ముచిత మైననదైననుదైవము ప్రతికూలమగునపు డెవ రేమి సేయఁగలరనియు దలంచి వార లేమియుఁ బలుకక మిన్నకుండిరి.

ఈసురంగమందలి రెండుతట్టుల గోడలు మిక్కిలి దృఢము లైనవి. మఱియు వానిపై మిక్కిలి మందముగల యినుపతగడులు పొదగఁబడియుండెను. నీరదయొద్దఁగల తిలస్మిభల్లమెట్టిపదార్థము నైనను ఖండింపఁజాలియుండినను నట్టిస్థానమందు సురంగమును ద్రవ్వి మార్గ మేర్పఱచు కార్యమందది యుపయోగపడదు. అయి నను నీరద తనప్రయత్నమునం బెట్టిలోపమును గలిగించియుండ లేదు. కాని, యామె పరిశ్రమ కొంచెమైనను ఫలోన్ముఖమునకు రా దాయెను.

ఇది ఎనిమిదవ భాగము.

సుప్రసిద్ధములగు భారతి, ఆంధ్రపత్రిక లీగ్రంథవిషయమున దమ యభిప్రాయము నిటుల వెల్లడించియున్నవి:—

# లవంగలత.



ఇది యొక సాంఘికనవల. హిందీభాషనుండి అనువాదము.

అనువాదకుడు, కోసూరి రంగయ్యగారు, నర్సాపురం.

పశ్చిమ గోదావరిజిల్లా.

చందాదారులకు వెల రు. 1—0—0 ఇతరులకు రు. 1—8—0

భారతస్త్రీలకు యూరపు అమెరికాదేశ స్త్రీలకుగల స్వాతంత్ర్యము నొసంగుచో అయ్యది సర్వదా హానికరంబని యీనవల వ్యక్తీకరించుచున్నది. మన ఆధునిక సంస్కర్తలు స్త్రీలు బాగుగ నాంగ్లభాష నభ్యసించి, విశ్వవిద్యాలయమందలి డిగ్రీలనుబొంది ప్రాశ్చాత్త్యపరిధానములవంటి దుస్తులను ధరించి పరపురుషులతో-వారెవరైననునరే-చేత జేయికలిపి గాలిసికారున కేగవలయునని యు, దానివలన తప్పేమియు లేదనియు ననుచున్నారు. కాని, ఇట్టి ఆచారమువలన విపత్పరంపరలు వాటిల్లునని లవంగలత చారిత్రమే చాటుచున్నది. ఇట్లని స్త్రీలకు ఆంగ్లభాషను నేర్పరాదని యభిప్రాయము గాదు. లోకవార్తలన్నిటిని గ్రహించి సంఘమున కుపకరించు విషయములను అన్యదేశములనుండి నేర్చుకొనుటకు ఆంగ్లభాష విద్యాభ్యాసమేగాక ఇతరదేశీయభాషలనుగూడ స్త్రీలు అభ్యసించు టవసరము. కాని, ఏవిద్యనైనను సముచితరీతిని నేర్చుకొనుట ముఖ్యము. హద్దుమీరి యుండరాదనియే అభిప్రాయము. కాని వేరొండు కాదు.

బ్రహ్మసమాజ మతస్థుల ఆచారములవలన ఘటిల్లెడి అనర్థములను లవంగలతి చరిత్రమే చాటుచున్నది. పాఠశాలయందు

లభించు శిక్షణదృష్టి స్పష్టముగనుండినను వ్యర్థాడంబరముగల సంస్కారణజాలమందు తగుల్కొన్నచో స్త్రీలకుగల శీలము మున్నగు సద్గుణములు అంతరించుననుట తథ్యము. మరియు స్త్రీలు మితిమీరిన స్వాతంత్ర్యప్రియులగుచో, ఆపదలను మానసిక క్లేశములను అనుభవింపవలసివచ్చునన్నచో ఆశ్చర్యమొందనక్కరలేదు. దీనికి నిదర్శనము ఇటీవల కొందరు మన సోదరీమణులు వాంఛించుచున్న వివాహవిచ్ఛేదనపుచట్టమే! ఇట్టి విపత్తులన్నిటికి ఈనవలయందు చెప్పబడిన లవంగలత గురిఅయ్యెను. ఆమె స్వీయచారిత్రము తోడిసోదరీమణులకు గుణపాఠముగ నుండునటుల దెలుపబడెను. శీలసంవర్ధనము మానినీమణుల ప్రథమకర్తవ్యము. జనసామాన్యమందు దననిపుణతను విస్తరింపచేయదలంచిన, శీలములేనిదే యది సఫలీకృతము గాజాలదను విషయమునకు లవంగలతయే ప్రమాణము.

స్త్రీ ఎంత విదుషీమణిఅయినను, ఇంగ్లాండునందు బరీక్షోత్తీర్ణయయి ఎన్నిడిగ్రీలను సంపాదించియుండినను, శీలాభావమెన్నటికిని సుయశమును జేకూర్పజాలదనుటకు మన లవంగలత తార్కాణము.

లవంగలత తండ్రి బ్రహ్మసమాజమతస్థుడు. తల్లి హిందూమత సంప్రదాయిని. లవంగలతవిషయమై దంపతులకు భిన్నాభిప్రాయము లేర్పడెను. లవంగలతకు గరపెడి విద్యాపద్ధతి ఆమె జననికి రుచించెడిదిగాదు. బాలుర కుపయుక్తంబగు శిక్షణపద్ధతి ననుసరించి బాలికలకు విద్యగరపుట వారి భవిష్యజ్జీవితమునకు హితకరముగాజాలదని యామెతల్లి పలుమారు తనభర్తకు (లవంగలత జనకునకు) సూచించుచుండెను. కాని, లవంగలత జనకుడామె మాటలను పెడచెవిని బెట్టెను. తుదకు ప్రాయశ్చిత్తమైనపిదప పశ్చాత్తప్తుడాయెను. గృహిణిమాటను ద్రోసిపుచ్చినందులకు శాస్తి అయినదనుకొనెను. పురుషులపద్ధతి ననుసరించి స్త్రీలకు శిక్షాప్రదాన మొన

రించిన వారియందలి లజ్జావినయశీలాద్యుత్తమప్రకృతిగుణము లడుగంటిపోవును కావున గృహిణీపదమునకు సర్వదా యోగ్యంబగు శిక్షణమే వారి కొసంగవలయునను నీతిని లవంగలత చరిత్రము వెల్లడిచేయుచున్నది.

లవంగలత జనకుడు బ్రహ్మసమాజికుడగుటచే తన పుత్రికను ఒక్క యాదర్శపు శిక్షిత స్వాతంత్ర్య ప్రియగ నొనరించుటకు ప్రయత్నించుటచే ఆమెకిట్టి సంకటమేర్పడెను. అట్లొనర్పకున్నచో ఇట్టి దుస్థితి చేకూరెడిది కాదు. అతడు పశ్చాత్తాపమును జూపినవాడు మనహృదయము కరగకమానదు. అతని పశ్చాత్తాపము గుణపాఠముగ నుండగలదు.

కాలపరిమితిలేని ప్రౌఢ వివాహమువలన హానియేగాక లాభమిసుమంతయు లేదని లవంగలత స్వీయచరిత్ర చాటుచున్నది.

ఈనవల ఎంతయు నీతిదాయకమైనది. ప్రతి సోదరీమణియు పఠింపవలసినది. ఇట్టి నవలలను పాఠశాలయందు పఠనీయగ్రంథముగ నియమించుచో ఉవిదలకు ఆంగ్లభాషావిద్యాభ్యాసము గావించినను విపత్తు వాటిల్లదు. వారు అప్రమత్తులై శీలమును దాసకాపాడుకొనుచుందురు. వక్రమార్గమును ద్రొక్క నొల్లరు.

మానసంరక్షణము:—ఇది యొక అపూర్వమైన కథ

వెల రు. 0—2—0 లు.

శ్రీ

# విచిత్రనవలాగ్రంథమాల.

నరసాపురం, పశ్చిమ గోదావరిజిల్లా.

( స్థాపితము. )

1928 సం॥రం.

విచిత్రకల్పనల కాలవాలమగు నవలలు-నవరసభరితములగు నవలలు-250-300 పుటలకు మించకుండ-మూడుమాసముల కొక్కటిగ వెలువడుచుండును.

(1) ఈయుద్యమము నాదరించువారలు నాలుగు తరగతులుగ బరిగణింపబడుదురు. 1. రాజపోషకులు, 2. పోషకులు, 3. సహాయులు, 4. చందాదారులు.

I. ఇచ్ఛానుసారముగఁ దగువిరాళముల నొసంగువారు రాజపోషకులు.

II. సంవత్సరము 1 కి రు 30—0—0 లు చొ॥ నాలుగు సంవత్సరములలో రు 120—0—0 లు విరాళము నొసంగువారలు పోషకులు.

III. సంవత్సరము 1 కి రు 10—0—0 లు చొప్పున ప్రతిసంవత్సరము నొసంగువారలు సహాయులు.

భాషాభిమానులందఱుఁ దగు ప్రోత్సాహము నొసంగి యీగ్రంథమాలాభివృద్ధికిఁ దోడ్పడఁ బ్రార్థితులు.

—◆ చందాదారుల నిబంధనము. ◆—

(2) ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0—8—0 లు చెల్లింపవలెను.

(3) ఇందు మూఁడుమాసముల కొక్కటిగ వెలువడుచుండు మంచిరేపరు బైండుగల ప్రతిగ్రంథము రు 1—0—0 కి మాత్రమే చందాదారులకుఁ బంపుచుందుము.

(4) చందాదారులుగాఁ జేరఁగోరువారు వెనుకటి గ్రంథములన్నియుఁ గొనవలయునను నియమములేదు. వారుకోరినచో వెనుకటి గ్రంథములన్నియుఁ జందాదారుల వెలలకే పంపుదుము. క్రొత్తగ వెలువడు ప్రధానాంగములగు గ్రంథములను మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

(5) ఇందప్పుడప్పు డనుబంధములుగ బ్రకటింపబడు చిన్ననవలలు—నాటకములు—చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికిఁ బంపుచుందుము.

(6) చందాదారులకు సంవత్సరమున కొకపర్యాయము చిన్ననవలలు బహుమతి పంపఁబడును.

(7) పోస్టుఖర్చులు గ్రంథములను స్వీకరించువారలే [illegible]ంపవలయును.

(8) వి. పి. మూలముగాఁ బంపఁబడు గ్రంథములను చందాదారులు స్వీకరించనియెడల ముందట్టివారికి గ్రంథమాలనుండి గ్రంథములు పంపబడవు.

(9) చందాదారులుగఁ జేరఁగోరువారు మా ఏజంట్లయొద్ద నిక్రింద సంతకము చేసినవారి యాజ్ఞాపత్రములేనిదే చేరరాదు. అట్లు చేరినవారి ప్రవేశరుసుమున కీగ్రంథమాల యెంతమాత్రము బాధ్యము కానేరదు.

కొనూరి రంగయ్య అండ్ సన్సు,

ప్రకాశకులు.

రాజకీయ నవల.

# మహామాయి

## తొమ్మిదవ భాగము.

ఇదియొక విచిత్ర ఘటనాసంపూర్ణ నవలారత్నము. నవలా
నమందలి విచిత్రభావకల్పనాకుంజముల యత్యంత హృదయ
హక సజీవచిత్రము. నాయికా నాయకుల చరిత్ర శిల్పముతో
టత్యద్భుత కల్పనా వైచిత్రంబులం దేజరిల్లుచుం జదువరులకుం
పై నుల్లాసమును జనింపఁజేసి యెన్నిమాఱులు చదివినను మరలం
నవలయునను నుత్కంఠ గలిగించుచుండును. దీనియందలి విచి
ల్పనలు హృదయప్రకంపితములై విస్మయానందభయాదిభావ
ను నుదయింపఁజేసి చదువరులను స్తంభీభూతులనుగ నొనరింపం
యున్నవని పలువురు తమ యభిప్రాయములను వెల్లడించియు
రు. ఆంధ్ర సారస్వతకుసుమ కాననంబున ననేక నవలాభ్రమ
మరముల లలిత ఝుంకారములు వినిపించుచున్నవి ఈనవలా
పమట్పద ఝుంకారములు నత్యంత మధురములై చిత్తాకర్షణ
లై నూతనమార్గ ప్రదర్శకములై యొప్పారుచున్నవి. ఈనవల
క్క మొదటి ఎనిమిదిభాగములు చదివినవారిలో నంశసంబంధి
ంపుమహానందమును మాకు వ్రాయుచి వారలు.

:-చందాదారులకు రు 1—0—0 ఇతరులకు రు 1—8—0.

దొరుకువారు:—

# కోసూరి రంగయ్య అండ్ సన్సు

## శ్రీ విచిత్ర నవలా గ్రంథమాల, నర్సాపురం.

పశ్చిమ గోదావరిజిల్లా.

అని వ్రాసిన దొరుకుగలరు:—

